# భువనవిజయం

(రాయల నాటి కథలు, గాథలు)

డా॥ జి.వి.పూర్ణచందు

ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి
ప్రచురణ

**భువనవిజయం – రాయలనాటి కథలు, గాథలు**

**Bhuvanavijayam- Rayalanati kathalu, gathalu**

*(Exploring the Legacy of Sri Krishnadevaraya)*

Written by :

Dr. G.V.Purnachand, *B.A.M.S.,*
Satnam Towers, First Floor,
Opp. Buckinghampet Post Office,
Governorpet, Vijayawada - 520 002
Cell : 94401 72642
purnachandgv@gmail.com

First Edition : 2025

Published by :

Andhra Pradesh Creativity and Culture Commission,
Ghantasala Venakteswara Rao
Govt. Music & Dance College,
Durgapuram,VIJAYAWADA - 520 003

Title : Sri Regulla mallikarjuna Rao

For Copies :

Andhra Pradesh Creativity and Culture Commission,
Ghantasala Venakteswara Rao
Govt. Music & Dance College,
Durgapuram,VIJAYAWADA - 520 003

Printed at :

Sri Sri Printers, Vijayawada
srisriprinters.vja@gmail.com
Ph : 94906 34849

Price : Rs. 200 /-

# ఇందులో...

# తెలుగు భాషాభోజుడి వెలుగు కథ

**– రేగుళ్ళ మల్లికార్జున రావు**

*యమ్ యస్ సి,*

*ముఖ్య కార్యనిర్వహణాధికారి,*

*ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి*

శ్రీకృష్ణదేవరాయల చరిత్రంతా ప్రజల్లో కథలు, గాథలుగానే వ్యాప్తిలో ఉంది. విజయనగర సామ్రాజ్యాన్ని ఆ కాలపు ప్రపంచ సంపన్న దేశంగా ఆయన తీర్చిదిద్ద గలిగాడన్నది అందరికీ తెలిసినదే ! కానీ, అందుకు అనుసరించిన ఆర్థిక క్రమశిక్షణ, సాధించిన అభివృద్ధి, ప్రవేశపెట్టిన సంక్షేమాల మూలాల గురించి పరిశోధనలు ప్రముఖంగా ప్రజల్ని చేరాలంటూ, డా. జి. వి. పూర్ణచందు వెలువరించిన ఆలోచనాత్మక గ్రంథం "భువనవిజయం – రాయలనాటి కథలూ గాథలు" ఈ ఆసక్తిదాయకమైన ఎన్నో విషయాలను మన ముందుంచుతోంది.

అభివృద్ధి ధ్యేయంగా ముందుకు సాగుతున్న మన రాష్ట్రానికి తగిన సమయంలో వెలువడిన తగిన గ్రంథం ఇది. పునర్ మూల్యాంకనం అనేది ఈ కాలపు నవీన విధానం. మన భాషాసంస్కృతుల చరిత్రకు సంబంధించి పునర్ మూల్యాంకనం జాతి ప్రగతికి కొత్త దారులు వేస్తుంది కూడా !

రచయిత డా. పూర్ణచందు తెలుగు భాషోద్యమ ప్రముఖుడు. ప్రసిద్ధ కార్యకర్త కూడా ! ప్రపంచ తెలుగు రచయితల 6 మహాసభలకు ప్రధాన కార్యదర్శిగా వ్యవహరించారు. తెలుగు భాషా సంస్కృతుల మూలాల్ని తవ్వి తీసిన పరిశోధకుడాయన. తెలుగు వారి ఆహారచరిత్రవేత్త కూడా ! వివిధ అంశాలపైన 150కి పైగా పుస్తకాలు వెలువరించారు.

ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి పక్షాన 'కృష్ణాతీరం', 'దేశభాషలందు తెలుగు లెస్స' లాంటి పరిశోధనాత్మక బృహత్ గ్రంథాలకు ఆయన సంపాదకత్వం వహించారు. 2007 నుండి శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణు దేవాలయంలో పన్నెండేళ్లపాటు నిరాటంకంగా జరిగిన శ్రీకృష్ణదేవరాయ మహోత్సవాలలో ప్రముఖ పాత్ర వహించారు. సాంస్కృతిక శాఖ పక్షాన తెలుగు భాషా బ్రహ్మోత్సవాలు, పద్యకవితా బ్రహ్మోత్సవాలు, జానపద బ్రహ్మోత్సవాలకు సమన్వయకర్తగా వ్యవహరించారు. దాదాపు 300 మంది రచయితలను పోలవరం ప్రాజెక్టు సందర్శింపచేయటానికి నాయకత్వం వహించి సాంస్కృతిక శాఖకు సహకరించారు.

సాహిత్య రంగంలో వీరి కృషిని గుర్తిస్తూ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 2017లో కళారత్న (హంస) పురస్కారంతో గౌరవించింది.

భాషా సంస్కృతుల పట్ల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తన నిబద్ధత చాటుకుంటూ తెలుగులోనే పాలనకు తక్షణ చర్యలు చేపట్టింది. భాషా సంస్కృతుల పూర్వ వైభవం నిలపటానికి ప్రయత్నిస్తోంది. రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధిలో సాహితీ సాంస్కృతిక రంగాలకు కూడా సముచిత స్థానాన్ని కల్పిస్తున్నారు. భాషాభిమానులకు ఇవి సంతోషం కలిగించే అంశాలు.

రాయలవారి చరిత్రకు కొన్ని కొత్త ఆలోచనలను జోడించిన ఈ పుస్తక ప్రచురణ మాకెంతో సంతోషదాయకంగా ఉంది.

శ్రీకృష్ణదేవరాయలు తెలుగు భాషకు ప్రతిరూపం, భాషోద్యమానికి స్ఫూర్తిప్రదాత. కండగలిగిన తెలుగు భాషకు పెద్ద అండ. భాషాభోజుడైన ఆయన గురించిన నిజాలను అన్వేషించే ప్రయత్నాలను స్వాగతించవలసి ఉంది.

మరో మంచి రచన చేసిన రచయిత డా. జి.వి.పూర్ణచందును మనసారా అభినందిస్తున్నాను. ❑

# అపోహల్లోంచి వాస్తవికతలోకి

**- డా. మండలి బుద్ధప్రసాద్**

*గౌరవాధ్యక్షులు, ప్రపంచ తెలుగు రచయితల సంఘం*

తెలుగువారి చరిత్రలో స్వర్ణయుగం రాయలపాలనా కాలం. కృష్ణదేవరాయల గురించి మనం చర్చించుకునేప్పుడు చాలా ప్రశ్నలకు సమాధానాలు మనకు తెలీనివి ఉన్నాయి. నిజం చెప్పాలంటే రాయలవారి నిజాలు మనకు తెలిసింది తక్కువ, కల్పిత గాథలే ఎక్కువ అనిపిస్తుంది.

పోర్చుగీసుల వ్రాతలు చదివి వాటి ఆధారంగా తెలుగు ప్రభువు చరిత్రను మనం తెలుసుకోవాల్సి వస్తోందంటే చరిత్రరంగంలో మనం వెనకబడి ఉన్నామని అంగీకరించక తప్పదు. A Forgotten Empire -1900 లండన్ ముద్రణ) రాబర్ట్ సూయల్ వ్రాసినదే ప్రామాణికం. అందులో ఆయన స్పృశించని అంశాలు మన చరిత్రకారులకు ఈనాటికీ అస్పృశ్యంగానే ఉన్నాయనేది పూర్ణచందు ఈ "భువనవిజయం-రాయలవారి కథలు-గాథలు" లో వ్యక్తపరుస్తున్న ఆవేదన. అతని ఆవేదన అక్షరం అక్షరానా కనిపిస్తోంది.

1901లో తొలి భాషోద్యమ నిర్మాత కొమర్రాజు లక్ష్మణరావు గారు శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషానిలయం వ్యవస్థాపించిన సంగతి మనం మరువ కూడదు. రాయలవారు తెలుగువాడా? కన్నడం వాడా? అనే మీమాంస కన్నా రాయలవారు తెలుగు భాషా సంస్కృతుల కోసం చేసిన పరిశ్రమ తెలుగు వారికి ప్రధానం.

"తెలుఁ గదేల యన్న? దేశంబు దెలుఁ గేను
దెలుగు వల్లభుండఁ, దెలుగొ కండ,
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశ భాషలందుఁ దెలుగు లెస్స"

అనే పద్యం రాయలవారి అంతరంగాన్ని ఆవిష్కరిస్తుంది. తెలుగు భాషాభిమానాన్ని ఒక దైవప్రేరితంగా ఆయన ఘనంగా చెప్పుకున్నాడీ పద్యంలో! సాక్షాత్తు తెలుగు వల్లభుడైన ఆంధ్రమహావిష్ణువు తనతో స్వయంగా ఈ విషయం చెప్పాడని, రసపరిపుష్టి కలిగినది దేశ భాషల్లో తెలుగు మాత్రమేనని తాను గ్రహించానని, అనేకమంది ప్రముఖులతో అనేక భాషల్లో మాట్లాడిన అనుభవంతో ఈ విషయాన్ని తాను అవగతం చేసుకున్నానని ప్రకటించారు. తన మాతృభాష అయిన తెలుగులోనే తాను ఆముక్తమాల్యద దివ్యప్రబంధ రచన చేయటానికి సంకల్పం చేసుకున్నారాయన. రాయలవారి తరువాతి తరం వాడైన అప్పయ్య దీక్షితులనే మరో తెలుగు మహాకవి "ఆంధ్రత్వం ఆంధ్రభాషాచ నాఽల్పస్య తపసః. ఫలమ్" ఆంధ్రత్వం, ఆంధ్రభాష అనేవి ఎన్నో జన్మల తపఃఫలం వలనే సిద్ధిస్తాయన్నాడు. మనందరం తెలుగు వాళ్లంగా పుట్టినందుకు గర్వించాల్సిన విషయం ఇది.

తెలుగు జాతిని భాష పరంగా ఏకం చేయగల శక్తి రాయలవారికి మాత్రమే ఉన్నదనేది నిర్వివాదం. కృష్ణదేవరాయల విగ్రహాన్ని శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణు దేవాలయ ప్రాంగణంలో 2007లో ప్రతిష్ఠించిన తరువాత తెలుగు భాషోద్యమ పరంగా వచ్చిన ఊపుని గమనించాక ఈ విషయాన్ని అనుభవ పూర్వకంగా గ్రహించాను కూడా !

కొడాలి సుబ్బారావు గారు 1933లో ప్రచురించిన హంపీక్షేత్రం పద్య కావ్యంలో మనకు తెలీని హంపీ నిర్మాణాల ప్రస్తావన లెన్నో ఉన్నాయి. భారతీయ ఏకాత్మత అనేది ఎంత విధ్వంసానికి గురయ్యిందో కరుణరసాత్మకంగా ఆయన వర్ణించారు.

రాళ్ళపల్లి సుబ్బారావు గారు రాజమహేంద్రవరంలో ఆంధ్ర ఐతిహాసిక మండలి ఏర్పరచి దాని పక్షాన అమూల్యమైన చారిత్రక వ్యాసాలతో ఒక త్రైమాసిక పత్రిక నడిపారు. హంపీ విజయనగరోత్సవం నిర్వహించి విజయనగర సంచిక, కళింగ సంచిక తెచ్చారు.

శ్రీయుతులు నేలటూరి వెంకటరమణయ్య, రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, పుట్టపర్తి నారాయణాచార్య, వేటూరి ప్రభాకరశాస్త్రి, గాడిచర్ల హరి సర్వోత్తమరావు

ఇంకా ఎందరో మహనీయులు చేసిన కృషి ఫలితంగా విజయనగర చరిత్ర తెలుగు వారిలో పదిలంగా ఉంది. ఇంత కృషి జరిగినా అంతుబట్టని చరిత్ర ఇంకా ఎంతో ఉంది. రాయలవారి జననం మరణం కూడా ఇప్పటికీ వివాదమయంగానే ఉన్నాయి అపోహలు, కల్పిత గాథలతో కలగలసిపోయి అసలు నిజాలు మరుగున పడిపోతున్నాయి. చరిత్రకారులు వాటిని జల్లెడ పట్టగలగాలి.

రాయలవారు తన 20 యేళ్ల పదవీ కాలంలో యుద్ధాల ద్వారా సాధించిన విజయాలకు తార్కాణాలు ఉన్నాయి. కానీ, విజయనగర సామ్రాజ్యాన్ని అత్యధిక ధనిక సామ్రాజ్యంగా తీర్చిదిద్దటంలో ఆయన అనుసరించిన విధానాలపై సమగ్ర విశ్లేషణ అవసరం అని భావిస్తున్నాను. ఆ విధానాలలో నేటి కాలానికి ఉపయోగించే అనేక అంశాలు ఉండవచ్చు కూడా !

ఈ "భువన విజయం-రాయలవారి కథలు, గాథలు" పుస్తకంలో డా॥ జి.వి.పూర్ణచందు వజ్రాల పరిశ్రమ గురించి వ్రాసిన వ్యాసం చాలా ఉపయుక్తమైంది. గనుల నిర్వహణ విషయంలో రాయలు అనుసరించిన మార్గాన్ని ఇప్పటి మనం అనుసరించకపోవటాన గనుల్ని మింగే 'ఘనులు' పెరిగిపోవటాన్ని చూస్తూనే ఉన్నాం. చరిత్ర నేర్పే పాఠాల్ని నేర్చుకోకపోతే జరిగే అనర్థం ఇది.

డా॥ జి.వి.పూర్ణచందు పరిచయం అవసరం లేని శతాధిక గ్రంథకర్త. 150కి పైగా పుస్తకాలు అచ్చులో వెలువరించాడు. నిరంతర పరిశోధకుడు. తెలుగు భాష మూలాలను వెలికితీసి కొనసాగవలసిన పరిశోధనలుగా వెలువరించాడు. తెలుగువారి ఆహారచరిత్రకారుడిగా ప్రసిద్ధి పొందాడు. ఎప్పుడూ ఏవేవో కొత్త విశేషాలు వెలుగులోకి తేవాలని ప్రయత్నం చేస్తాడు. తనదైన విశ్లేషణతో తనదైన కోణంలో విశ్లేషించి పాఠకుల్ని ఆలోచింపచేస్తాడు. ఆ ప్రయత్నంలో భాగంగానే రాయలనాటి విశేషాల గురించి అనేక వ్యాసాలు వ్రాస్తూ వచ్చాడు. వాటన్నింటికీ ఇప్పుడు పుస్తకరూపం కల్పిస్తున్నాడు.

ఈ పుస్తకంలో ఎవరూ స్పృశించని, సృజించని అంశాలు కొన్ని ఉన్నాయి. తుఖ్ఖా, మోహనాంగి వ్యాసాలలో అనేక నూతన అంశాలు మనకు కనిపిస్తాయి.

ప్రత్యేకించి రాయలవారు ఆరాధించిన ఆంధ్రమహావిష్ణువు కేవలం పూర్ణచందు మాత్రమే వ్రాయగలిగిన వ్యాసం. ఒక్కో వ్యాసం చదువుతుంటే మనకు తెలీని కొత్త విషయాలు తెలుస్తుంటాయి. ఎంత అధ్యయనం చేస్తే ఇంత సమాచారాన్ని ఇవ్వగలడా అనిపిస్తుంది ! నిరంతర అధ్యయనం, నిర్విరామ రచనావ్యాసంగంతోపాటు అనితరసాధ్యంగా కార్యక్రమాలు నిర్వహిస్తూ, కార్యకర్తగా పనిచేసే పూర్ణచందు ఇవన్నీ ఒకే వ్యక్తి చేస్తున్నాడా?... అని ఆశ్చర్యపరుస్తాడు.

శ్రీ కృష్ణదేవరాయల్ని కులాలకు, మతాలకు అతీతంగా తెలుగు భాషోద్ధారకుడిగా గౌరవించుకోవటం మన ధర్మం. అంతే కాదు ప్రపంచంలోని ధనిక రాజ్యాలలోకెల్లా ధనిక రాజ్యంగా విజయనగర సామ్రాజ్యాన్ని ఆయన తీర్చిదిద్దిన తీరు అద్భుతమైనది. పూర్ణచందు కోరినట్టు ఆనాటి అభివృద్ధికి మూలాలను వెదకాల్సిన అవసరం ఉందని భావిస్తున్నాను.

తెలుగు నాట "తెలుగు కరువు" ఏర్పడుతున్న సమయంలో దీపస్తంభంలా దారిచూపే రాయలవారి వెలుగులో మనం నడిచి తెలుగు భాషను పరిరక్షించుకోవటం, తెలుగు జాతిని ప్రకాశవంతం చేసుకోవటం మన కర్తవ్యం. ఆ కర్తవ్య బోధ చేస్తున్న డా॥ పూర్ణచందు వ్రాసిన ఈ పుస్తకం సరైన సమయంలో వచ్చిన ఒక ఉత్తమ రచనగా భావిస్తున్నాను.

తెలుగు భాషోద్యమంలో పూర్ణచందుది ప్రముఖ పాత్ర. కృష్ణాజిల్లా రచయితలసంఘం కార్యదర్శిగా ప్రపంచ తెలుగు రచయితల మహాసభలను 6 పర్యాయాలు నిర్వహించిన కార్య దక్షత అతని స్వంతం. తాను రచయిత అయినప్పటికీ తెలుగు నాట రచయితలందరినీ ఒక బాటకు చేర్చి భాష కోసం సంస్కృతి కోసం అందరినీ ఆ బాటలో నడుపుకుపోవాలనేది అతని తపన.

ఈ "భువనవిజయం-రాయలవారి కథలు, గాథలు" పుస్తకం ఆలోచించేవారి కోసం ఉద్దేశించిన గ్రంథం. గ్రంథం చిన్నదే కానీ సమాచారం విలువైనది. అపోహల్లోంచి వాస్తవికతలోకి నడిపించే దీపిక ఇది. పూర్ణచందుని మరోసారి మనసారా అభినందిస్తున్నాను. ❑

# అభివృద్ధి మూలాల అన్వేషణే చరిత్ర

**- డా॥ జి.వి.పూర్ణచందు**

స్వాతంత్రోద్యమ కాలంలో చరిత్రను పరిశీలించిన పరిశోధకులు విజయనగర చరిత్రను స్వదేశీ, విదేశీ కోణాల్లోంచి ఎక్కువగా విశ్లేషణ చేశారు. ఆనాటి చరిత్రలో సుల్తాన్లు విదేశీ శక్తులు. స్వాతంత్ర్యం వచ్చాక పరిశోధకుల దృష్టి హిందూ ముస్లిం వైరుధ్యాల కోణం మీదకు ఎక్కువగా మళ్లింది. కొత్త సహస్రాబ్దిలో గడచిన ఈ పాతికేళ్ల కాలంలో సమాజంలో ఎంతో మార్పు వచ్చింది. కానీ, చరిత్ర పరిశీలనా దృక్పథంలో మార్పు రాలేదు. ఆనాటి రాజకీయ పరిస్థితుల్లో అప్పట్లో జరిగిన సంఘటనల్ని ఇప్పటి అంశాలకు ఆపాదించి, మత విద్వేషాలకు చరిత్రను వాడుకునే పరిస్థితి నడుస్తోంది. చరిత్ర ఆశించే ప్రయోజనం ఇది కాదు కదా !

విజయనగర కాలంలో జరిగిన అభివృద్ధి పైన దృష్టిపెట్టి పరిశీలన చేస్తే, అది నేటి కాలపు ఆలోచనలకు మేలు చేసేదిగా ఉంటుంది. చరిత్ర పరిశీలనా దృష్టి మారాలన్నదే ఈ పుస్తకం ఆశిస్తున్న లక్ష్యం. చరిత్ర అవసరాన్ని ప్రజలు గుర్తించటానికి కావలసిన అంశాల గురించిన ప్రతిపాదనే తప్ప చరిత్రకారులకు పాఠాలు చెప్పే ప్రయత్నం ఇది ఎంత మాత్రమూ కాదు. చరిత్రను పాఠ్యాంశంగా ఎత్తేసి చరిత్ర తెలియని తరాన్ని సృష్టించే పాలకులు చరిత్ర ప్రాముఖ్యతను గుర్తించేలా చేయాల్సిన బాధ్యత చరిత్రకారులది. అలాగే, మేధావులది కూడా !

ఇన్నాళ్లూ, విజయనగర చరిత్రను భారతీయత, ప్రాంతీయత, జాతీయత, కుల మత వర్గాల కోణాల్లోంచి పరిశీలిస్తూ వచ్చారు. కానీ, చరిత్ర ఆధారాలు, సాహిత్య ఆధారాలు, ప్రజల్లో వ్యాప్తిలో ఉన్న కథలు ఈ మూడింటికీ పొంతన లేకపోవటం, వ్యక్తిగత ఇష్టాయిష్టాలకు తగ్గట్టుగా వీటిని ఎవరికివారు వ్యాఖ్యానించటం వలన ముఖ్యంగా కృష్ణదేవరాయల చరిత్రలో వక్రీకరణలు ఎక్కువగా చోటుచేసుకున్నాయి.

ఈ కథనాలు ఎలా పుట్టాయి?, ఎందుకు పుట్టాయి? వాటిలో నిజం ఎంత? అనే ఆలోచనే లేకుండా 'ట' కార ప్రయోగాలతో ప్రజలు అదే నిజమైన చరిత్రగా భావిస్తూ తమ తరువాతి తరాలకు అందిస్తూ వస్తున్నారు. ఈ 21వ శతాబ్దపు యువతకు కూడా అలాంటి కల్పిత గాథలను అందించే పరిస్థితి ఉండకూడదనే ఆవేదన ఈ పుస్తక రచనకు ప్రేరణ.

చరిత్ర గురించి కేవలం చరిత్రకారులు మాత్రమే మాట్లాడుకుంటారు. ప్రజలకు అసలు చరిత్ర తెలియకపోవటం వలన అమ్మమ్మ చెప్పినవో నాయనమ్మ చెప్పినవో చరిత్రగా భావిస్తారు. వాళ్లలో ప్రతిభావంతులు వాటికి మరిన్ని కొత్త కథలు అల్లి జనరంజకం చేస్తారు. తెనాలి రామకృష్ణ కథల సృష్టికర్తలు ఎంతటి ప్రతిభావంతులు కాకపోతే మేకకొక మేక... మేకతోక లాంటి పద్యాలు అల్లగలుగుతారు? కానీ, అంతటి ప్రతిభావంతులు తమ సమర్థతను చరిత్ర సత్యాలను ప్రజలకు తెలపటానికి ఉపయోగించి ఉంటే ఎంతో మేలు జరిగి ఉండేది.

తెనాలి రామకృష్ణుడు నిజంగా వికటకవే అయితే ఆయన హాస్యప్రధానమైన రచనలు ఎందుకు చెయ్యలేదు? ఆయన అష్టదిగ్గజాల్లో ఒకడైతే ఆ విషయాన్ని తన కావ్యావతారికల్లో ఎందుకు చెప్పుకోలేదు? పెద్దన సహా అష్టదిగ్గజ కవుల్లో ఏ ఒక్కరూ తాము అలాంటి ఎనిమిది మంది కమిటీలో సభ్యులుగా ఉన్నామని ఎవరూ ఎందుకు ప్రకటించుకోలేదు?

కృష్ణరాయల్ని రాజు చంపాలని ఆదేశించటం, తిమ్మరుసు మేక కళ్లు తెచ్చి చూపించటం, కృష్ణదేవరాయలకొక కొడుకు పుట్టటం, అతన్ని తిమ్మరుసే చంపించటం, రాయలు అతని కళ్ళు పీకించటం... వీటికి మాత్రమే చరిత్ర పరిమితమై అభివృద్ధి అనే కోణాన్ని విస్మరించటం అన్యాయం ! ప్రపంచంలోనే ఆనాడు అత్యధిక ధనిక అగ్రరాజ్యంగా విజయనగరం ఎలా ఎదగగలిగిందో చర్చించరెందుకని?

విజయనగర చరిత్ర అధ్యయనం అంటే, ఆర్థిక క్రమశిక్షణ, విదేశీ వాణిజ్యం, అధిక ఉత్పాదకత ఇవి ప్రధాన వస్తువులు కావాలి. పేదరాశి పెద్దమ్మ కథలు చరిత్ర పట్ల ఉత్సాహాన్ని మాత్రమే కలిగిస్తాయి. కానీ, చరిత్ర పరిశోధనలు జ్ఞానాన్ని కలిగించేవిగా ఉండాలి.

కల్నల్ మెకంజీ కైఫీయత్తుల్లో ఉన్న కథనాలకు భిన్నంగా 1810 A.D.లో కల్నల్ మార్క్ విల్క్స్ అనే ఈస్టిండియా కంపెనీ గవర్నర్ మరియు చరిత్రకారుడు మైసూరు రాజ్యం ఎలా అభివృద్ధిని సాధించిందో వివరించాడు. మైసూరు రాజ్య చరిత్ర అనే కోణం లోంచి దక్షిణ భారతదేశంలో విజయనగర సామ్రాజ్యం నిర్వహించిన పాత్రని తొలుతగా విశ్లేషించిన పరిశోధకుడాయన. ఆ తరువాత వందేళ్లకు రాబర్ట్ సూయల్ పరిశోధనలు వెలువడ్డాయి. సూయల్ మద్రాస్ ప్రెసిడెన్సీలో రికార్డ్ కీపరుగా ఉద్యోగం చేసేవాడు. ఆయన విజయనగరాన్ని ఒక విస్మృత సామ్రాజ్యం (ఎ ఫర్గాటెన్ ఎంపైర్) అన్నాడు. కానీ, తెలుగు ప్రజల హృదయాలలో విజయనగర సామ్రాజ్యం అలాగే, శ్రీకృష్ణ దేవరాయలు అభిమానపాత్రమై చిరస్థాయిగా నిలిచి ఉన్నారు.

సూయల్ విస్మృత సామ్రాజ్యం గ్రంథ ప్రచురణ తరువాతే విజయనగర పరిశోధనలు ముమ్మరం అయ్యాయి. జాతీయోద్యమం అందుకు ప్రధాన కారణం. కన్నడ, తెలుగు, తమిళ భాషల్లో అనేకమంది పండితులు విజయనగర చరిత్రను తమకు దొరికిన ఆధారాలతో తమభాషలో అందించే ప్రయత్నం చేశారు.

కృష్ణస్వామి అయ్యంగార్, కె.ఎ.నీలకంఠశాస్త్రి, బి.యె.శాలట్టోర్ లాంటి చరిత్రకారులు జాతీయతా వాద ప్రభావంతో విజయనగర సామ్రాజ్యం భారతీయతకు, భారతీయ సాంస్కృతిక వికాసానికి ఏ విధంగా తోడ్పడిందో వివరించారు. పరాయి సంస్కృతికి హంపీ విధ్వంసాన్ని ఒక సాక్షిగా చూపించారు. దక్షిణాదిలో ఏకైక హిందూ సామ్రాజ్యంగా విజయనగరాన్ని నిలిపారు.

Albert Henry Long hurst (1876 – 1955) అనే బ్రిటిష్ చరిత్రకారుడు ఆర్కియోలాజికల్ సర్వే ఆఫ్ ఇండియా దక్షిణ భారత విభాగానికి ఆయన అధికారి. జాన్ మార్షల్ గారికి బావమరిది కూడా! 1927–31 నాగార్జున కొండ త్రవ్వకాలలోంచి బౌద్ధ చారిత్రక సంపదను వెలుగులోకి తెచ్చింది ఆయనే! 1917లో "Hampi Ruins Described and Illustrated" అనే పుస్తకం వ్రాశాడు. హంపీ నగరం గురించి బైట ప్రపంచానికి ఈ పుస్తకం చాలా విలువైన విషయాలను తెలిపింది.

కొడాలిసుబ్బారావుగారు, కామరాజుగడ్డ శివయోగానందరావు కలిసి హంపీ క్షేత్రం పేరుతో ఒక్కో శిథిలం మీద పద్యాలలో వాటి చరిత్ర చెప్తూ గొప్పకావ్యం వ్రాశారు. చాలాకాలం ఈ పుస్తకం ముద్రణకు నోచుకోక పోవటంతో 1933లో విశ్వనాథ సత్యనారాయణ ప్రభృతులు పట్టుబట్టి ఆ పుస్తకాన్ని అచ్చులోకి తెచ్చారు.

Hampi Ruins, హంపీ క్షేత్రం ఈ రెండు పుస్తకాలనూ పక్కపక్కన బెట్టుకుని చూస్తే, బ్రిటిష్ అధికారి రచనలో భారతదేశానికి బ్రిటిష్ వారి అవసరం ఎంతైనా ఉందనే కోణం ప్రధానంగా కనిపిస్తుంది. కొడాలివారి హంపీ క్షేత్రంలో విదేశీ శక్తులు మన సంస్కృతిని, జాతీయతని ఎలా విధ్వంసం చేశారో ఆవేదన ధ్వనిస్తుంది. ఆనాడు తెలుగువారిని కృష్ణదేవరాయలు అమితంగా ప్రభావితం చేశాడు. జాతీయోద్యమంలోకి అత్యధిక సంఖ్యలో తెలుగు జనసామాన్యం ముందుకు దూకటానికి రాయలవారే పరోక్షంగా ప్రేరకుడయ్యాడనటానికి ఈ హంపీక్షేత్ర కావ్యమే తార్కాణం.

కొమర్రాజు లక్ష్మణరావు గారు, జమీందార్లు నాయని వేంకట రంగారావు (మునగాల), పార్థసారథి అప్పారావు(పాల్వంచ), సహచరుడు రావిచెట్టు రంగారావు ఇంకా ఆనాటి అభివృద్ధి కాంక్షాపరులు 1901లోనే తెలుగువారి కోసం శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయాన్ని హైదరాబాద్ నగరంలో స్థాపించారు. అప్పటి దాకా తిరుమలలో ఇద్దరు దేవేర్లతో పాటుగా ఉన్న విగ్రహం తప్ప, రాయలవారు ఎలా ఉంటాడో ఎవరికీ తెలీదు, ఆనాడు కొమర్రాజువారు గీయించిన కృష్ణదేవ రాయల ఊహాచిత్రమే ఈ నాటికీ రాయలవారి ముఖచిత్రంగా ప్రచారంలో ఉంది. కృష్ణదేవరాయల్ని తెలుగు భాషామూర్తిగా ప్రచారంలోకి తెచ్చారాయన. ఆ విధంగా తెలుగు వారిలో భాషా స్ఫూర్తిని కొమర్రాజువారే కలిగించారు. ఇదంతా జాతీయతాభావ ఆవేశంతో సాగిన భాషాసేవలో ఒక భాగం.

మండలి బుద్ధప్రసాద్ గారు కృష్ణాజిల్లా శ్రీకాకుళం ఆంధ్రమహావిష్ణు దేవాలయం ప్రాంగణాన ఆముక్తమాల్యద మంటపంలో రాయల వారు కూర్చుని ఆముక్తమాల్యద రచనకు శ్రీకారం చుడుతున్నట్టు ఒక నిలువెత్తు విగ్రహాన్ని ఏర్పరచటం

ద్వారా తెలుగుభాషోద్యమానికి గొప్ప ఊపుతెచ్చారు. తెలుగు భాషకు ప్రాచీనతా హోదా కోసం జరిగిన పోరాటాన్ని తద్వారా ఉధృతం చేయగలిగారు. 2007 ఫిబ్రవరి 9, 10, 11 తేదీలలో కృష్ణదేవరాయ మహోత్సవాలు నిర్వహించారు. రాయలవారి వారసుడు శ్రీ అచ్యుతదేవరాయలను ఆహ్వానించారు. అది మొదలు ప్రతీ ఏటా ఫిబ్రవరి 11న ఈ మహోత్సవాలు క్రమం తప్పకుండా 2018 వరకూ నిర్వహించారు. తెలుగు వారందరూ రాయల వారిని కులమతాలతో నిమిత్తం లేకుండా భాషా సాంస్కృతిక ప్రతినిధిగా గౌరవించుకుంటూనే ఉన్నారు.

కన్నడ రాజ్య రమావిభుడైనప్పటికీ కన్నడం వారి కన్నా రాయల కోసం ముందుగా స్పందించింది తెలుగు వారే ! గురుజాడ శ్రీరామమూర్తిగారు 1893లో "కవి జీవితములు" గ్రంథంలో అష్టదిగ్గజాల ఉనికిపై మొదటగా సందేహం వ్యక్తపరిచారు.

కందుకూరి వీరేశలింగం గారు 1895లో ఈ ఆలోచనల్ని మరింత ముందుకు తీసుకుపోయారు.

1903 లో జీర్ణకర్ణాట రాజ్య చరిత్రని వ్రాసి చిలుకూరి వీరభద్రరావుగారు రాయలవారిని ఒక సాంస్కృతిక వారధిగా ముద్ర వేశారు. రాబర్ట్ స్యూయల్ విస్మృత సామ్రాజ్యం ఇంకా అందుబాటులోకి రావటానికి ముందే విజయనగర చరిత్ర వ్రాసిన తెలుగు ప్రముఖులు వీళ్లు.

1915 లో మహమ్మదీయమహాయుగం గ్రంథం ద్వారా కొమర్రాజు వేంకట లక్ష్మణరావు విజయనగర సామ్రాజ్యం హిందువుల ఐక్యత ఆవశ్యకత చాటారు.

1922 లో వేటూరి ప్రభాకరశాస్త్రిగారు చాటుపద్యమణిమంజరిలో విజయనగర ప్రభువులు, కవుల ప్రశస్తిని లోకానికి చాటారు.

1935 లో నేలటూరి వేంకట రమణయ్య, 1950లో చాగంటి శేషయ్య, 1960 లో నిడుదవోలు వేంకటరావు ప్రభృతులు విజయనగర వైభవాన్ని విరివిగా వెలుగులోకి తెచ్చారు.

తెలుగు పరిశోధకులు రాయలవారి భాషాసేవ పైన ఎక్కువ దృష్టిపెట్టగా, కన్నడం వారు సంగమ వంశం మూలాలు గురించి తర్కం నడిపారు. రాయలవారి

వలన ఆదరణ పొందిన కన్నడ కవులెందరో ఉన్నారు. కానీ, విజయనగర సామ్రాజ్యాన్ని పాలించిన రాజవంశాల రాజకీయాల మూలాల గురించిన పరిశోధనల ద్వారా ప్రాంతీయతకే కన్నడం వారు ఎక్కువగా ప్రాధాన్యత నిచ్చారు.

క్రీ.శ. 1900 లో రాబర్ట్ సూయల్ విధ్వంసానికి గురైన హంపీ నగరం వైపు పండితుల దృష్టిని మరల్చాడు. హంపీని తమ కళ్ళతో ఆఖరుగా చూసిన డొమింగో పేస్ మరియు నూనిజ్ కళ్లతో చూస్తూ ఆయన హంపీ చిత్రాన్ని చిత్రించాడు. ఒక అభివృద్ధిని దోచుకోవటానికి బహమనీ సుల్తాన్లు చేసిన ప్రయత్నంగా కాకుండా దీన్ని మతపరమైన ద్వేషానికి పరాకాష్టగా చిత్రించాడు. దోపిడీ దొంగని ఒక దొంగగా కాక అతని మతం, కులం అనే కోణంలోంచి విశ్లేషిస్తే దోపిడీ అప్రధానం అయి, మతవిద్వేషాలు పెచ్చుమీరటానికి కారణం అయ్యింది.

దక్షిణ భారతదేశ చరిత్రలో ఇస్లామీకరణను ప్రతిఘటించిన ఏకైక సామ్రాజ్యం విజయనగరమే ! కానీ, విజయనగర వైభవానికి అది ఒక్కటే ప్రధానాంశం కాదు. కేవల మత వ్యతిరేకత వలన విజయనగర సామ్రాజ్యం ప్రపంచ ధనిక సామ్రాజ్యం కాలేదు కదా ! అభివృద్ధి వెనక ఉన్న రహస్యం చరిత్రలో ప్రధానాంశం కాకపోవటం వలన చరిత్ర కలిగించే సామాజిక ప్రయోజనం నెరవేరకుండా పోతోంది.

కర్ణాటకలో మరో విచిత్ర పరిస్థితి కనిపిస్తుంది. రాయలు తుళువ వంశీకుడు కాబట్టి, తుళువ వంశేతరులకు రాయలపట్ల ఉత్సాహం లేదనే ఆరోపణ ఉంది. కొందరైతే రాయలవారు విచక్షణ లేకుండా విదేశీ వ్యాపారుల్ని రప్పించటం వలనే ఈ రోజు భారతదేశం స్వాతంత్ర్యాన్ని కోల్పోయి బ్రిటిష్ వారికి బానిస అయ్యిందన్నవాళ్లూ ఉన్నారు. కలిబురిగి లాంటి కన్నడ మేధావులు రాయలు చేసిందంతా తెలుగుకే గానీ కన్నడానికి ఏమీలేదన్నారు. కృష్ణదేవరాయల మహోత్సవాలను బహిష్కరించాలన్నారు. దీనివలన తుళు ప్రాంతీయుల మనోభావాలు గాయపడ్డాయి. తుళునాడు ఏర్పాటు చేయాలనే వాదానికి బలం చేకూరింది.

1520 – 22 లలో విజయనగరం కాలంలో కూరగాయలు అమ్మినంత స్వేచ్ఛగా వజ్రాల మార్కెటింగ్ జరిగేదని డోమింగో పేస్ వ్రాశాడు. విజయనగర

సామ్రాజ్యంలో వజ్రాల గనులు ప్రధానంగా ఉన్నది తెలుగు ప్రాంతాల్లోనే! మంచిగంధం మొక్కల అడవులున్నది కన్నడ నేల మీద. తమిళ మలబారు ప్రాంతాలలో సుగంధ ద్రవ్యాలు పండుతాయి. ఈ విధంగా తెలుగు, కన్నడ, తమిళ, మలయాళ ప్రాంతాలన్నీ కలిసి, విజయనగరాన్ని సుసంపన్నం చేశాయి.

ఉత్పాదకతని పెంచటంతో పాటు పట్టణ సంస్కృతిని పరిచయం చేయటానికి రాయలు ప్రయత్నించారు. రోము నగరం కన్నా పెద్దదని విదేశీ యాత్రికులు ఆనాడే పొగిడిన హంపీ విజయనగరంలో మౌలిక సదుపాయాలు, వాణిజ్యం, రవాణా మరియు నీటి నిర్వహణ లాంటి అంశాలు, ఆనాటి ఇంజనీరింగ్ వ్యవస్థ, పంటభూములకు నీటిని అందించిన వైనం, జలవనరులు, ఇరిగేషన్ విధానాలు, ప్రణాళికా బద్ధమైన పాలనా యంత్రాంగం, వాస్తుశిల్పకళలు, భవన నిర్మాణాలు, అపారంగా సాగిన వాణిజ్యం, సంస్కృతి మరియు కళలు విదేశీయుల్నే కాదు స్వదేశీయుల్ని కూడా ఆకర్షించాయి. ఆనాటి రహదారుల నిర్మాణాల గురించి కూడా చర్చ జరగాలి. గ్రామపాలనా వ్యవస్థతో పాటు, త్రిసముద్రాధీశుడైన రాయలవారు ఓడరేవుల్ని నిర్వహించిన విధానాలు గొప్పవి. సులభతరం చేసిన వాణిజ్య విధానాలు, ఉత్పాదకత నిచ్చిన వ్యవసాయం, పరిశ్రమలు, ఆనాటి ప్రజల జీవన ప్రమాణాలు, ప్రజాశ్రేయోపథకాలు ఇలాంటివి చరిత్రలో ప్రధాన చర్చనీయాంశా లైనప్పుడు ఈనాటి సమాజానికి అవి మార్గదర్శకాలౌతాయి. తప్పొప్పుల్ని సరిచేసుకునే ఆకరాలౌతాయి.

రాజధాని నగరాన్ని ఆధ్యాత్మిక నగరంగా, వాణిజ్యనగరంగా, పాలనా నగరంగా మూడు భాగాలుగా నిర్వహించిన వైనం ఆశ్చర్యం అనిపిస్తుంది. పరమత సహనం అనేది విజయనగరం నేర్పిన మొదటిపాఠం. ప్రతిభావంతమైన పాలన, పటిష్టమైన సైనిక వ్యవస్థ, ఆయుధ సంపత్తి కలిగి ఉండటం ద్వారా ఇతర రాజ్యాలపై పైచేయిని సాధించగలగటం, అపూర్వమైన సాంకేతిక ప్రగతి, ఆర్థిక ప్రణాళికలు, ఆదాయ వనరులతో పాటు భాషా సాహితీ సాంస్కృతిక కళా రంగాలకు పెద్దపీట వేశారు రాయలవారు చర్చ వీటిపైన జరగాలి!

ఆనాటి తెలుగు శాసనాలలో సంస్కృత పారిభాషిక పదాల స్థానంలో అచ్చతెలుగు పదాలు కొత్తగా రూపొందాయి. భాషా వైషమ్యాలు ప్రబలకుండా రాయలవారు ఏ ప్రాంతానికి ఆ ప్రాంతపు భాషలో పాలన అందించిన వైనం కూడా అర్థం అవుతుంది. రాయల వారు అన్ని విధాలా సమతుల్యత కోసం ప్రయత్నించారు. వాటి అధ్యయనావశ్యకత ఈనాడు ఎంతైనా ఉంది.

మనం కొత్త సహస్రాబ్దిలో మొదటి శతాబ్దిలో మొదటి పాతిక సంవత్సరాలు గడుపుకుని ఆధునికత వైపు పరుగులు పెడ్తూ, అభివృద్ధి కోసం కలలు కంటున్నాం. చరిత్రకూడా ఆ కోణంలోంచి మనకు మార్గదర్శనం చేసేదిగా ఉండాలి !

❊ ❊ ❊

“భువనవిజయం :: రాయలవారి కథలు–గాథలు” పుస్తకం ఏకబిగిన వ్రాసింది కాదు. వివిధ సందర్భాలలో వ్రాసిన వ్యాసాల సమాహారం. ఈ వ్యాసాలన్నీ పుస్తకరూపంలో తీసుకురావాలనేది బుద్ధప్రసాద్ గారి ఆదేశం.

చిన్నప్పుడెప్పుడో ఆరో తరగతి ఆయనతో కలిసి అవనిగడ్డలో కొండయ్య మేష్టారుగారి దగ్గర చదువుకున్న చిరుజ్ఞాపకం. ఆ తర్వాత 1979లో బందరులో ఆంధ్రప్రదేశ్ రచయిత్రుల మహాసభలు నిర్వహించినప్పుడు ఆయనతో సాన్నిహిత్యం. 1983లో అవనిగడ్డలో కృష్ణాజిల్లా రచయితల మహాసభల నిర్వహణ, అనంతరం ఏర్పడిన కృష్ణాజిల్లా రచయితల సంఘానికి ఆయన, నేనూ కార్యదర్శులుగా ఎన్నిక కావటం, అది మొదలుగా ఈనాటి వరకూ ఆయన చెయ్యి పుచ్చుకుని నన్ను నడిపిస్తూనే ఉన్నారు.

2004లో జరిగిన కృష్ణామహోత్సవంలో చేతిలో చెయ్యివేసి ప్రమాణం చేసుకున్నాం, భాషా సంస్కృతుల కోసం కలిసి పని చేయాలని ! ఆయన గౌరవాధ్యక్షులుగా, శ్రీ గుత్తికొండ సుబ్బారావు అధ్యక్షులుగా, నేను ప్రధాన కార్యదర్శిగా కృష్ణాజిల్లా రచయితల సంఘానికి ప్రాణప్రతిష్ఠ చేశాం. ఈ 20 యేళ్ళ కాలంలో ఆయనతో కలిసి పనిచేసి సాధించిన భాషాపరమైన విజయాలు నన్ను చరితార్థుణ్ణి చేశాయని నమ్ముతున్నాను.

6 పర్యాయాలు ప్రపంచ తెలుగు రచయితల మహాసభలు నిర్వహించ గలిగామంటే ఆయన నేతృత్వమే అందుకు ప్రేరణ. రాయలవారి పేరు చెప్తే తెలుగు నాట భాషా సాంస్కృతిక వికాసం కలుగుతుంది. బుద్ధప్రసాద్ గారి ప్రేరణ ఉంటే భాషా సాంస్కృతిక వికాసం వర్ధిల్లుతుంది. తెలుగు భాషోద్యమ సమరాంగణ సార్వభౌముడిగా బుద్ధప్రసాద్ గారి తోడ్పాటు ఈ గ్రంథరూపకల్పన వెనుక ఎంతైనా ఉంది!

ఈ పుస్తకాన్ని బాధ్యత తీసుకుని ప్రచురించటానికి అంగీకారం తెలిపి, ముఖచిత్రం చిత్రించి ఇచ్చి అచ్చులో వెలువరిస్తున్న ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి కార్యనిర్వహణాధికారి శ్రీ రేగుళ్ళ మల్లికార్జునరావుగారికి నా నమస్సులు. ❑

రాయలవారు ఆరాధించిన

## ఆంధ్రవిష్ణు కథ

"తెలుఁ గదేల యన్న? దేశంబు దెలుఁ గేను
దెలుగు వల్లభుండఁ, దెలుగొ కండ,
యెల్లనృపులు గొలువ నెఱుఁగవే బాసాడి
దేశ భాషలందుఁ దెలుగు లెస్స"

"తెలుగే ఎందుకంటే నా మాతృదేశం తెలుగు. నేను తెలుగు వల్లభుణ్ణి. తెలుగొ... ఇంక తెలుగు భాషంటావా? కండ ! అది కలకండలా (పటికబెల్లం) తియ్యనైనది. పటుతరమైన భాష. వివిధ భాషలు మాట్లాడే సామంతాది రాజులెందరో నీ కొలువులో ఉన్నారు. వాళ్లందరితో నువ్వు వాళ్ల భాషల్లోనే మాట్లాడుతుంటావు. నీకు అనేక భాషలతో పరిచయం ఉంది కదా ! ఈ భాషలన్నింటిలోనూ తెలుగే లెస్స అని నీకు తెలుసు కదా..." అని కృష్ణరాయలకు స్వప్నసాక్షాత్కారం ఇచ్చిన ఆంధ్రమహావిష్ణువు తెలుగులో అమ్మవారి కథ వ్రాయమని తనను ఆదేశించినట్టు రాయలవారే స్వయంగా పేర్కొన్నారు.

శ్రీకాకుళ ప్రసక్తి క్రీడాభిరామంలో రాగా మళ్ళీ ఆముక్త మాల్యదలోనే వచ్చింది. శ్రీకాకుళానికి రాగానే రాయలవారికి చటుక్కున క్రీడాభిరామం సహజంగానే గుర్తుకొచ్చింది. క్రీడాభిరామం అనగానే ఎవరికైనా "దేశభాషలందు తెలుగు లెస్స" అనే పద్యపాదం కూడా గుర్తుకొస్తుంది. రాయలవారిక్కూడా గుర్తుకొచ్చింది. అది అలవోకగా ఈ పద్యంలో ఒదిగిపోయింది.

ఈ విషయంలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారి వివరణ మరో ముందడుగు వేసింది. తెలుగులో ఏ అక్షరం వ్రాయాలన్నా ఎడమవైపుకు చెయ్యి తిప్పాల్సి ఉంటుంది.

ఏత్వాలు, ఐత్వాలు, తలకట్లు, కొమ్ములు, గుడింతాలన్నీ ఎడమవైపు చెయ్యి తిప్పి వ్రాయందే కుదరవు. అందుకే తెలుగు లిపిని 'వామావర్త లిపి' అంటారు. కాబట్టి, ఇది జగజ్జననికి ప్రీతిపాత్రమైన భాష. అమ్మవారి కథ వ్రాయటానికి తెలుగే తగిందని, అది అమ్మవారి భాష అని భావం.

ఆముక్త మాల్యద వ్రాయాలనే సంకల్పాన్ని ఆంధ్రమహావిష్ణువే రాయలవారికి కలిగించాడు. ఇది ఒక తెలుగు రాజకవి వ్రాసిన అపూర్వ దివ్య ప్రబంధం. వ్రాయించిన వాడు ఆంధ్రమహావిష్ణువు. ఈ ఆంధ్రమహావిష్ణువు ఎలా ఉంటాడు?

"నీల మేఘము డాలు డీలు సేయఁగఁ జాలు
మెఱుఁగుఁ జామన చాయ మేని తోడ,
నరవిందముల కచ్చు లడగించు జిగి హెచ్చు
నాయతంబగు కన్నుదోయితోడఁ
బులుగు రాయని చట్టుపల వన్నెనొర నెట్టు
హొంబట్టు జిలుఁగు రెంటెంబు తోడ
నుదయార్క బింబంబు నొఱపు విడంబంబు
దొరలంగ నాడు కౌస్తుభముతోడఁ

తే.గీ. దమ్మి కేలుండఁ బెఱకేల దండయిచ్చు
లేములుడిపెడు లేఁజూపు లేమతోడఁ
దొలకు దయఁ దెల్పు చిఱునవ్వుతోడఁ గలఁ
దంధ్ర జలజాక్షుఁ డిట్లని యానతిచ్చె"

రాయలవారికి దర్శనం ఇచ్చిన ఆంధ్రమహావిష్ణువు రూపాన్ని ఇలా వర్ణించాడు కృష్ణదేవరాయలు.

"నల్లని మబ్బుల కాంతి అంటే మెరుపు తీగల్ని జయించే మెరుగు చామన చాయ కలిగిన నీలకాంతిపుంజము కనిపించి అదే శరీరంగా మారిందా అన్నట్టుగా అనిపించింది. తామర పూల గర్వాన్ని ధిక్కరించగల విస్తారమైన కనుదోయి ఆ తరువాత కనిపించింది. గరుత్మంతుని రెక్కల కాంతినే మెరుగుపెట్టగల బంగారు

పట్టువస్త్రం ఆ శరీరాన్ని ఆవరించి ఉంది. వక్షస్థలం మీద కౌస్తుభరత్నం అరుణార్కబింబ సౌందర్యాన్ని ధిక్కరిస్తోంది. అంటే ఆయన వక్షస్థలం నీలాకాశం లాగా, కౌస్తుభరత్నం అక్కడ ఉదయిస్తున్న సూర్యునిలాగా ఉంది. ప్రక్కన లక్ష్మీదేవి ఒక చేతిలో పద్మాన్ని ధరించి మరొక చేతితో భర్త హస్తమును గ్రహించి ఉండగా కారుణ్యం తొణకిసలాడే చిరునవ్వుతో ఆంధ్రవిష్ణువు స్వప్నంలో సాక్షాత్కరించాడట.

**ఎవరీ ఆంధ్రమహావిష్ణువు ?**

'సజాతీయత' అనే పదం చరిత్ర విశ్లేషణకు చాలా ముఖ్యమైంది. సజాతీయం అంటే racial oneness – జాతిపరంగా ఒకటే అని ! దేవతలు, మనుషులూ ఒక జాతివారే అనేది Bergaign వ్రాసిన Religion of Vedique గ్రంథంలో ప్రముఖమైన విషయంగా చెప్తారు.

కానీ, తెలుగువారు ద్రావిడ భాషా కుటుంబీకులైనప్పుడు, ద్రావిడ జాతీయులైనప్పుడు వారి దేవతలు ద్రావిడ జాతీయులు కాకుండా పోయారెందుకు? సామాన్యుడు చాలామందికి ఈ ప్రశ్న వేశాడు. పిల్లలు ఏదైనా అడిగితే, 'నీకెందుకురా? పెద్దవాళ్ల విషయాలు" అని కేకలేస్తాం చూశారా? అలా సామాన్యుడి నోరుమూయిస్తున్నారు. కానీ, సమాధానం వెదికితే దొరకకపోదు.

1930లలో Leyden లో జరిగిన 18వ ఓరియంటలిష్టుల కాంగ్రెస్ సమావేశంలో ఫ్రెంచి భాషలో Prof. Jean Przyluski విష్ణుమూర్తి ద్రావిడ దేవుడనే ఓ పరిశోధనా పత్రాన్ని సమర్పించాడు. యల్. వి. రామస్వామి అయ్యర్ ఈ వ్యాసాన్ని కొంత మెరుగుపరచి 1934 మిథిక్ సొసైటీ జర్నల్ సిల్వర్ జుబిలీ సంచికలో ప్రచురించాడు. ఇందులో తెలుగువారికి సంబంధించిన చాలా విశేషాలున్నాయి. Przyluski అభిప్రాయాలు పండితుల దృష్టిలో పడలేదు. దానిపై పెద్దగా చర్చ జరగలేదు.

18వ శతాబ్దం చివరి భాగంలో మాక్స్ ముల్లర్ వేదాధ్యయన విశ్లేషణల తరువాత ప్రపంచంలోని ప్రాచీన ఇండో యూరోపియన్ జాతుల దేవతల్లో వైదిక

దేవతల పోలికలు కనిపించటం ఒక కొత్త అధ్యయనాంశం అయ్యింది. దేవతల పేర్లు, వారి స్వరూప స్వభావాలు కూడా సమీపంగా ఉండటం ఆశ్చర్యం కలిగించింది. Ouranos అనే గ్రీకు దేవత Varuna గా కనిపిస్తాడు. ఇలా ఎందరినో గుర్తించవచ్చు. కానీ, విష్ణువు గురించి ప్రస్తావిస్తూ ఏ యూరోపియన్ మైథలాజికల్ దేవతలలోనూ విష్ణువు లాంటి దేవత కనిపించ లేదన్నాడు.

భారతీయ ఆధ్యాత్మికతలోనే విష్ణువు ఉత్తరాది వారికి ఒక అర్థంలోనూ, దక్షిణాది వారికి ఇంకో అర్థంలోనూ కనిపిస్తాడు. ఋగ్వేద ఆర్యులు ఇండో యూరోపియన్ భాషాకూటమికి చెందిన జాతి కాబట్టి వారి దేవతలు కూడా ఇండో యూరోపియన్ జాతికి చెందిన వారై ఉండాలి. కానీ, విష్ణువు మరే ఇండో యూరోపియన్ దేవతల్లోనూ కనిపించకపోవటం కొత్త సందేహాలకు దారి తీసింది.

విష్ణు శబ్దానికి మూలం 'విష్' అనే ధాతువు. వ్యాప్తి అని ఈ ధాతువుకి అర్థం. ఆర్యుల విష్ణువు సర్వ వ్యాపకుడు. కానీ, ద్రావిడ (కేవలం దక్షిణాది భాషల కూటము అనే అర్థంలో మాత్రమే) విష్ణువుకు 'విణ్' ధాతువు మూలం. ద్రవిడియన్ ఎటిమలాజికల్ నిఘంటువు DEDR 5396 లో తమిళ విణ్, విణ్ణవాన్, తెలుగు విను, విన్ను, మిను, మిన్ను శబ్దాలు ఆకాశాన్ని లేదా అంతరిక్షాన్ని సూచించేవిగా కనిపిస్తాయి. దక్షిణాది విష్ణువుకి అంతరిక్షదేవత అని అర్థం. అంతరిక్షం కన్నా వ్యాప్తి కలిగిందేదీ లేదు కాబట్టి ఉత్తరాది దక్షిణాది విష్ణువుల మూలస్వరూపం అనంత వ్యాప్తికలవాడనే ! విష్, విన్ రెండూ విష్ణు సంబంధమైన ధాతువులే !

S.K. చటర్జీ "the Aryan Vishnu, the spreading one-as a name for the sun was combined with a Dravidian sky God VIN, VINNU to give the later Hindu notions of Surya Narayana" అన్నారు. సర్వవ్యాపకుడు అయిన ఆర్యుల విష్ణువుని ద్రవిడుల అనంతమూర్తి అయిన విణ్ (లేదా) విణ్ణు (మిన్ను = ఆకాశం) రూపంతో కలపటం వలన సూర్యుడికి ప్రతిరూపమైన సూర్యనారాయణ అనే భావన ఏర్పడి ఉంటుందని చటర్జీగారు భావించారు. జాతుల మధ్య సంలీనాల ఫలితంగా ఏర్పడ్డ కొత్త పరిణామాలివి.

ఋగ్వేదంలో 5 లేక 6 సూక్తాలలో మాత్రమే విష్ణువుకు సంబంధించిన వర్ణన ఉంది. దేవతలందరి కంటే గొప్పవాడు ఊరుగాయుడు, ఊరుకర్ముడు, మూడు పాదాలు కలిగినవాడుగా విష్ణువు ఈ సూక్తాలలో కనిపిస్తాడు. ఈ మూడు పాదాలతో భూమి, అంతరిక్షం, స్వర్గాలను విష్ణువు ఆక్రమించాడట. మూడో పాదం స్వర్గానికి ద్వారం కాబట్టి స్వర్గాన్ని "విష్ణుపథం" అన్నారు. ఋతుచక్రాన్ని త్రిప్పేది ఈయనే నన్నారు. సూర్యుడే వ్యాప్తి శీలాన్ని బట్టి విష్ణువుగా స్తుతులు పొందినట్టు అర్థం అవుతుంది.

"విశతీతి విష్ణుః అని విష్ణు శబ్దాన్ని నిర్వచిస్తూ "విష్ణువుకు గల విశ్వమ్, విష్ణుః అను నీ రెండు నామంబులును వ్యాప్తినే దెల్పుచు నుండియు. విశ్వ శబ్దము పూర్తిని, విష్ణు శబ్దము వ్యాప్తిని చెప్పుటచే పునరుక్తి దోషము లేదు" అని విష్ణు సహస్రనామాలకు పరాశర భట్టరుల భాష్యాన్ననుసరించి వ్రాసిన వ్యాఖ్య పేర్కొంది. విష్, విణ్ రెండూ ఒక రూపాన్నేసూచిస్తున్నాయి. ఉన్నతమైన, అనంతమైన ఆ దివ్యరూపమే విష్ణు అనేది దక్షిణాదివారి భావన. విష్ణు శబ్దం ద్రావిడార్యుల దేవతల మధ్య వైరం చూపట్లేదు.

**మరాఠీలో విఠలుడు**

ఆర్యుల 'విష్' ద్రావిడుల – 'విఠ్'గా, 'వెఠ్'గా మారి విఠ్ఠల శబ్దోత్పత్తి జరిగిందని Jean Przyluski పేర్కొన్నారు. మహాపరినిబ్బాన సుత్త (దీఘనిక–2) బౌద్ధ గ్రంథంలో వెఠ్ఠదీప (విష్ణుద్వీప) ప్రస్తావన కనిపించటాన్ని ఆయన ఇందుకు సాక్ష్యంగా చూపారు. మరాఠీలోకి విఠ్ లేదా విఠల ద్రావిడ మూలాల్లోంచే చేరిందని కూడా భావించారు. విలియం క్రూక్ లాంటి ఆధునిక భాషావేత్తలు విఠ్ అంటే ఇటుక అని, స్థల అంటే నెలకొని ఉండటం అనీ ఇటుకమీద నిలబడి ఉండేవాడు విఠలుడనే అర్థాన్ని చెప్తున్నారు. ఈ వివరణ చాలా పేలవంగా ఉంది. చరిత్రకారుడు గోపాల భండార్కర్ విఠ్ఠ అనేది ద్రావిడ మూలాల్లోంచే వచ్చిందని, బహుశా కన్నడం నుండి సంక్రమించి ఉండవచ్చనీ వ్రాశాడు. తెలుగు, తమిళ, కన్నడ మలయాళాది ద్రావిడ భాషలు ఏర్పడక పూర్వమే మూల ద్రావిడ భాష నడిచిన కాలంలోనే ఈ మార్పు జరిగి ఉండవచ్చు కూడా !

హొయసాల ప్రభువు విష్ణువర్ధనుడికి బిట్టిదేవ అనే పేరు విర్థుని బట్టే ఏర్పడింది. కన్నడంలో బిర్థ అంటే విష్ణువు. బిర, బిర్థి, బిర్థదేవ, అనే పేర్లున్న కన్నడ రాజులు కన్పిస్తారు. తెలుగు రాజవంశీకులలో బేత అనే పేరు కనిపిస్తుంది. బేతవోలు అనే ఊరుపేరు, త్రిభువనమల్లు బేతరాజు అనే కాకతీయ రాజవంశీకుడి పేర్లలో 'బేత' శబ్దం విష్ణు సంబంధమైనదే !

పి.టి.శ్రీనివాస అయ్యంగార్ Life in Ancient India in the age of Mantras గ్రంథంలో ద్రావిడ విణ్ణు శబ్దమే ఋగ్వేద విష్ణువుకు మూలం కావచ్చని పేర్కొన్నాడు. జూలై 1931 ఆంధ్రా హిస్టారికల్ రీసెర్చి జర్నల్లో ఇండో ఆరియనిష్టు లెవరూ విష్ణువుకి ద్రావిడ మూలాలు కూడా ఉన్నాయంటే ఒప్పుకోకపోవచ్చునన్నారు. ఈ పరిశోధన పట్ల దక్షిణాదివారు ఉత్సాహం చూపించాలి. లేదా విదేశీ పండితులు పట్టించుకోవాలి. ఔత్తరాహికులకు ఇది ఏమాత్రం అంగీకారం కాని అంశం. ఆర్య, ద్రావిడ భాషా, జాత్యభిమానాల కతీతంగా సున్నితంగా పరిశీలించాల్సిన ఈ అంశాన్ని భాషా శాస్త్రపరంగా విశ్లేషిస్తేనే కొంత సమాధానం వస్తుంది. అది మన భాషావేత్తల విధి.

**ఆంధ్రవిష్ణువు అవతారమే వాసుదేవ కృష్ణుడు**

బౌద్ధ జాతక కథలలో ఘటజాతకం (పాళీ నెం 355, 454), సంకిచ్చ జాతకం (పాళీ నెం. 580) లలో విష్ణువు పేరు వెణ్ణు లేదా వెన్ను అని కనిపిస్తుంది. "నందగోపా నామ్ అస్సా పరిచారిక అహొూసి, అంధకవెన్హూ నామ దాసో తస్సా సామికో అర్థమ్ అకాసి. తదా ఉత్తరామధురాయామ్ మహాసాగరో నామ రాజ్జమ్ కరేతి. తస్సా సాగరో చ ఉపసగరో చ తి ద్వే పుత్తా అహెసుమ్" ఇది పాళీ భాషలో రూపొందించిన బౌద్ధానికి సంబంధించిన "ఘటజాతకం" జాతక కథలో కృష్ణుడి కథ. హరివంశంలోనూ, భాగవతంలోనూ కనిపించే కృష్ణుడి కథకు కొంత భిన్నమైన అంశాలు ఇందులో కనిపిస్తాయి. పాళీ నిఘంటువుని దగ్గిర పెట్టుకుంటే ఈ కథని చదవటం పెద్ద కష్టమేమీ కాదు.

ఈ కథలో అంధకవెణ్ణు కొడుకు వాసుదేవుడే కృష్ణుడు కాగా, భాగవత కథలో వాసుదేవుడి కొడుకు కృష్ణుడు. పురాణాలు కృష్ణుణ్ణి వాసుదేవుడిగా వర్ణించిన

వైనాన్ని మనం మరిచిపోకూడదు. కాబట్టి, పాళీ వాసుదేవుడి కథని మనం పట్టించుకోవాలి.

కంసుడి బారి నుంచి తనకు పుట్టిన మగపిల్లల్ని రక్షించుకోవడానికి, దేవగర్భ తన పిల్లల్ని అంధక వెణ్ణు దగ్గరకు చేర్చి అక్కడ పుట్టిన ఆడపిల్లల్ని తన దగ్గరకు తెప్పించు కొంటుంది. ఇది భారత, భాగవతాలలో కథే...పాత్రలు, పాత్రధారుల పేర్లు కొద్దిగా మారతాయి. భారతంలో కథ బౌద్ధులకు చేరిందా.. బౌద్ధుల కథ భారతం లోకి చేరిందా... అనే విషయాన్ని పక్కన పెట్టి కథలోకి వద్దాం:

ఆ విధంగా మొత్తం 10 మంది మగపిల్లలు వాసుదేవ, బలదేవ, చంద్రదేవ, సూర్యదేవ, అగ్నిదేవ, వరుణదేవ, అజ్జున, పజ్జున ఘటపండిత. అంకుర... వీళ్ళంతా అంధకవెణ్ణు పుత్రులుగా పెరుగుతారు. దుష్టశిక్షకులుగా వీళ్ళని రూపొందించి కంసుని చంపించి అంధకవెణ్ణు దుష్టశిక్షకుడి పాత్ర వహించాడు. జంబూద్వీపం యావత్తూ వాసుదేవుడి చేత జయింపచేస్తాడు అంధకవెణ్ణు. ఆంధ్రుడైన విష్ణువు (అంధక వెణ్ణు) సాధించిన విజయం ఇది" అని ఈ జాతక కథ చెప్తోంది.

ఈ కథని ప్రస్తావించిన Jean Przyluski "అంధక విష్ణువు సాధించిన విజయం ఇది" అని వ్యాఖ్యానిస్తాడు. "A Theogony in which the ancestral God is called VISNU - the Andhra, could only have been of Dravidian origin" ఈ ఆంధకవెణ్ణు నిస్సందేహంగా ద్రావిడ మూలాలు కలిగిన వాడు, ఆంధ్రుడు, కృష్ణ ఒడ్డున శ్రీకాకుళంలో ఆంధ్రవిష్ణువుగా పూజలందుకుంటోన్నాడు అన్నాడు. రాయలవారు ఆంధ్రవిష్ణు దేవాలయంలో ఒకరాత్రి నిద్రచేసి స్వామి స్వప్నసాక్షాత్కారం పొందటం కాకతాళీయం కాదు, అంతా విష్ణుకల్పనే!

గీతోపదేశం చేసి కృష్ణుడు అర్జునుడి నిర్వేదాన్ని పోగొట్టినట్టే, అంధకవెణ్ణు కథ ద్వారా ఘటకుమారుడనే మంత్రికి బుద్ధుడు నిర్వేదం పోగొట్టడం, కొడుకు మరణించిన దుఃఖంలో మునిగిపోయిన వాసుదేవుడికి అతని తమ్ముడు ఘట పండితుడు మరణ రహస్యం వివరించటం. వాసుదేవుణ్ణి జర (వార్ధక్యం) పీడించటం,

ఇలాంటి కథల్ని పోల్చి శ్రీమహావిష్ణువే పాళీ భాషలో చెప్పిన అంధక విష్ణువు అనీ, వాసుదేవుడూ, బలదేవుడూ లాంటి దేవతలకు విష్ణువు పితృదేవత లేదా మూలదేవత అనీ Jean Przyluski అభిప్రాయపడ్డాడు.

**అంధక వెణ్ణు ఆంధ్రవిష్ణువు ఎలా అయ్యాడు?**

అంధకవిష్ణు లేదా ఆంధ్రవిష్ణు పేరులో అంథ్ గురించి కొంత చర్చ చెయ్యాలి. మనం ప్రోటో ఇండో యూరోపియన్ పదరూపాల్లో వెదికితే అంథ్ కి అసలు అర్థం దొరుకుతుంది. సంస్కృతం లాటిన్ లాంటి భాషలన్నీ ఇండో యూరోపియన్ భాషా కూటమికి చెందినవి. ఈ కూటములోని భాషలకు మూలరూపంలో (ప్రోటో ఇండో యూరోపియన్) 'అంథ్' అంటే మనిషి అని అర్థం. Anthropology అనే పదంలో అంథ్– anth-(anthos) అంటే మనిషి. అంతేగానీ గుడ్డి, చీకటి అని కాదు. మనది మనిషి వారసత్వం ! మనం అంథకుడనే అసురుడి వారసులమో, శాపగ్రస్థులైన విశ్వామిత్ర పుత్రులమో కాదు, అంథ్ అంటే మనుషుల వారసులం. అమృతాంధసులంటే మరణం లేని జాతి అని ! అంథ్ అంటే మనిషి. అంథ్ అంటే ఆంధ్రుడు. అంథకవెణ్ణు – ఆంధ్ర వెణ్ణు – ఆంధ్రవిష్ణు – ఇలా అయ్యాడు.

'హెరిటేజ్ ఆఫ్ ఇండియా సిరీస్'లో భాగంగా పి. చెంచయ్య అనే పండితుడు "History of Telugu literature" అనే వ్యాసంలో "the Telugus may have been in the remote past a Dravidian people possessing a non Aryan Culture, but they seem to have lost their Dravidian identity very early in their History. In Historical times, they were so completely Aryanised in religion, Language and Literature, that for all practical purposes they may be treated as Aryans although their indigenous Dravidian influence continued to make itself felt"

"తెలుగువారు ఆర్యేతర సంస్కృతీ వికాసాలు కలిగిన ద్రవిడియన్ జాతీయులు. కాలక్రమంలో వాళ్లు ఆర్యులతో సంపర్కం కారణంగా తమ ఆర్యేతర సంస్కృతిని వదులుకున్నట్టు కనిపిస్తోంది. చారిత్రక యుగం మొదలయ్యేనాటికే తెలుగు వారు

ద్రావిడ సంస్కృతికి దూరంగా ఉన్నారు. చారిత్రక యుగాలలో వీళ్లు పూర్తిగా ఆర్యీకరణం చెంది, మతపరంగా, భాషాపరంగా, సాహిత్యపరంగా కూడా యజ్ఞసాంప్రదాయాలను అలవరచుకున్నారు. బౌద్ధయుగం నాటికి తెలుగువారు ఆర్య తరహా జీవన విధానంలోకి మారిపోయారు. అయితే, వారి సొంత ఆచార వ్యవహారాలు ఆర్యధర్మాలను ప్రభావితం చేసి, వారి ఉనికిని నిలిపాయి" అని చెంచయ్యగారు విశ్లేషించారు.

విన్సెంట్ స్మిత్ కూడా "early Indian History as a whole cannot be viewed in the perspective until the non - Aryan institutions of the South receive adequate Treatment" దక్షిణాదిలోని ఆర్యేతరుల చరిత్రని సమగ్రంగా విశ్లేషిస్తేగానీ అఖండ భారతదేశపు తొలినాటి చరిత్రని నిర్మించడం సాధ్యం కాదన్నాడు.

1912 లోనే "Life in the Ancient India in the age of Mantras" అనే గ్రంథంలో పి.టి. శ్రీనివాస అయ్యంగార్ విష్ణు అనేది నిస్సందేహంగా ద్రావిడ పదమేనని రాశాడు. అప్పట్లో ఆయన వాదనని ఎవ్వరూ పట్టించుకోకపోవడానికి హిందూ దేవతలంతా ఆర్యులేననే ఒక నమ్మకం ముఖ్యకారణం. ఋగ్వేదంలో "అన్యవ్రతులు" (ఆర్యేతరులైన ప్రజలు) చాలామంది ఉన్నట్లు అనేక ఋక్కుల్లో కనిపిస్తుంది. దాని ఆధారంగా మన విశ్లేషణ జరగాలి!

ఘటజాతక కథలోని అంథకవెణ్ణు / అంధకవెణ్హుకి సంబంధించిన ఓ విచిత్రమైన కథ ఒకటుంది :

ద్వారకానగరాన్ని మంత్రశక్తులున్న ఒక గాడిద కావలి కాస్తుంటుంది. శత్రువు వచ్చినప్పుడు అది బిగ్గరగా అరవగానే ద్వారకా నగరం గాలిలోకి లేస్తుందట. వాసుదేవుడు వెళ్ళి ఆ గాడిద కాళ్ళు పట్టుకొని ప్రార్థించాడు. అది అరవకుండా కొద్దిసేపు ఉంటానికి అంగీకరించింది. ఈలోగా వాసుదేవుడు ద్వారకని గొలుసుల్తో బంధించి ఎగరకుండా కట్టడి చేస్తాడు.

వసుదేవుడంతటివాడు గాడిద కాళ్ళు పట్టుకున్నాడనే తెలుగు సామెత ఈ నాటికీ వాడకంలో ఉందంటే ఘటజాతక కథకి తెలుగు నేలపై ప్రాచుర్యం ఉండేదన్నమాట. నాగార్జునకొండ శిల్పాల్లో ఘటజాతక కథ శిల్పాలున్నాయి.

కౌండిన్యసుచంద్రుడి పుత్రుడైన ఆంధ్రమహావిష్ణువు కథలో కనిపించే ఆంధ్రవిష్ణువనే రాజు తెలుగు జాతి ప్రతిష్ఠని ఇనుమడింప చేసి, అనేక జాతులుగా జీవిస్తున్న ప్రజలందరినీ ఏకం చేసి, భాషపరంగా తెలుగు వారుగానూ, జాతి పరంగా ఆంధ్రులుగానూ తీర్చిదిద్దాడు.

ఆంధ్రులకు సంబంధించిన కథలు అటు ఆర్య పురాణాలలోకి, ఇటు బౌద్ధ జాతక కథల్లోకి సమానంగానే వ్యాపించాయి. ఎవరి దృష్టి కోణంలోంచి వాళ్ళు వాటిని మలచుకొని ప్రచారం చేశారు. అంధకుడు అసురుడనే భావంతో ఆంధ్రులు అతని కథల్ని తమ కథలుగా చెప్పుకోవడానికి ఇష్టపడి ఉండకపోవచ్చు.

పండితులు ఆంధ్రవిష్ణువుని ఏ కారణం చేత విస్మరించారో తెలియదు. “నేను తెలుగు వల్లభుణ్ణి” అని స్వయంగా స్వామి చెప్పుకున్నా స్పందించలేదు మనం.

రాయలనాటి చరిత్రని, సంస్కృతిని సాహిత్యాన్ని అర్థం చేసుకోవటానికి హృదయ వైశాల్యం కావాలి ! ❑



*శ్రీకాకుళాంధ్రమహావిష్ణు దేవాలయం*

# రాయలనాటి వజ్రాల పరిశ్రమ అనంతర పరిణామాలు

15 వ శతాబ్దినాటికి ప్రపంచంలోనే అత్యధిక ధనిక సామ్రాజ్యంగా విజయనగర సామ్రాజ్యాన్ని తొలుతగా గుర్తించినవారు పోర్చుగీస్‌లు. యూరోపియన్ ఆర్థిక వ్యవస్థకన్నా విజయనగర ఆర్థిక వ్యవస్థ గొప్పగా ఉందని వాళ్లు భావించారు.

దక్షిణ భారతదేశంలోని సుగంధద్రవ్యాలు విజయనగరాన్ని సంపన్నం చేశాయని వాళ్ళు మొదట అంచనా వేశారు. కానీ, విజయనగరానికి వచ్చి స్వయంగా పరిశీలించిన మీదట సుగంధద్రవ్యాల కన్నా మించిన ఆదాయాన్ని. సమకూర్చే మరో రెండు అంశాలున్నట్టు గుర్తించారు. ఒకటి, సాంకేతికంగా అభివృద్ధి చెందిన వజ్రాల పరిశ్రమ. రెండవది మంచి గంధపు చెక్క

విజయనగర సామ్రాజ్యంలో వజ్రాల గనులు ప్రధానంగా ఉన్నది తెలుగు ప్రాంతాలలో, మంచిగంధం మొక్కల అడవులున్నది కన్నడ నేలమీద. సుగంధ ద్రవ్యాలు, ప్రధానంగా దొరికేది మలబారు, తమిళ ప్రాంతాలలో. ఈ విధంగా తెలుగు, కన్నడ, తమిళ, మలయాళ ప్రాంతాలు కలిసి, విజయనగరాన్ని సుసంపన్నం చేశాయి.

### తెలుగు నేలపైన వజ్రాల గనులు

విజయనగరం వజ్రాలను "హంపీ" వజ్రాలనేవాళ్లు. ఆనాటి పోర్చుగీసు, జెర్మన్, స్పెయిన్, ఫ్రెంచి, రోమ్ వర్తకులు, యాత్రికులు వ్రాసిపెట్టిన వ్రాతప్రతులు హంపీ వజ్రాలకు సంబంధించిన అనేక వివరాలను అందిస్తున్నాయి.

ఫ్రెంచి యాత్రికుడు జీన్ బాప్టిస్ట్ టావెర్నియర్ "ట్రావెల్స్ ఇన్ ఇండియా" (ed : william Crooke, Tr.V.Ball, 1925, Vol.II) గ్రంథంలో విజయనగరం వజ్రాల గనులను స్వయంగా చూసి విశేషాలు రికార్డు చేశాడు. సెబాస్టియావో

మౌరిక్ 1629-43 కాలంలో విజయనగరంలో పర్యటించిన విశేషాలు పేర్కొన్నాడు. అబ్బుల్ రజాక్, నికోలాకోంటి, డోమింగో పేస్, ఫెర్నావో, న్యూనిజ్, అథనేసియస్ నికీటిన్ లాంటి యూరోపియన్ వర్తకులు, యాత్రికులు హంపీ వజ్ర పరిశ్రమ గురించి ప్రముఖంగా ప్రస్తావించారు.

16,17 శతాబ్దాల కాలంలో పోర్చుగీసుకు చెందిన "ఫ్రాన్సిస్కో ఫెరీరా", ఇటాలియన్ వ్యాపారులు సీజర్ ఫ్రెడెరిక్ , గాస్పెరో బల్బీ, స్పానిష్ వ్యాపారి జాక్విస్ డి. కౌటే, ఫ్రెంచి యాత్రికుడు బెర్నియర్ వీళ్లంతా హంపీ వజ్రాల గురించి ఆనాటి ప్రపంచానికి చాటి చెప్పినవాళ్లు.

ఆనాటి పోర్చుగీసులు విజయనగర వైభవాన్ని చూడాలని ఎంత ఆత్రపడ్డారో డొమింగో పేస్ రాసినదాన్ని బట్టి తెలుస్తుంది. "క్రిస్టోవావ్ డి ఫిగ్విరిడో తనతో వచ్చిన పోర్చుగీసు వారందరికీ బిస్నగ (విజయనగరం) నగర రాజ భవనం చూపడానికి దయతో తనను అనుమతించవలసినదిగా రాజును అభ్యర్థించాడు. తనతో అనేకమంది పోర్చుగీసువారు మొదటిసారిగా బిస్నగ నగరానికి వచ్చారని, దాన్ని చూసి వారంతా ఆనందిస్తారనీ, భగవంతుడు వారిని తమ తమ ప్రాంతాలకు తీసుకు వెళ్లినప్పుడు తాము చూసిన దాన్ని గురించి చెప్పుకునే వీలు కలుగుతుందని ఫిగ్విరిడో రాజుకు విన్నవించాడు" (విస్మృత సామ్రాజ్యం విజయనగరం - రాబర్ట్ స్యూయల్)

ఫెర్నావో న్యూనిజ్ కూడా "గతె (గుత్తి- Gooty) వజ్రాల గనుల గురించి ప్రస్తావించాడు. డ్వార్టీ బార్బోజా అనే పోర్చుగీసు రాజప్రతినిధి 16వ శతాబ్ది తొలి నాటివాడు. బిస్నగ సామ్రాజ్యంలో డక్వెమ్ (డెక్కన్ - దక్షిణం) భూభాగంలో ఎన్నో వజ్రాల గనులున్నట్లు తన రాజుకు తెలుపుకున్నాడు.

ఫెన్సిస్కో పెరీరా, పోర్చుగల్ రాజుకు రాసిన లేఖలో - పడిక్, కొర్టిన్నా బళారి, కరుల్, కొండెపెల్యం, పెంపాయ్ ప్రాంతాలలో వజ్రాల గనుల గురించిన వివరాలున్నాయి. ఈ పేర్లలో బళ్లారి, వజ్రకరూర్, కొండపల్లి, హంపీ ఇవన్నీ ప్రసిద్ధి గనులు. 1611-1614లో జాక్విస్ డి క్యూటర్ వ్రాసిన వ్రాతప్రతిలో రామలకోట, నందియాల్, మల్లవెల్లి, మర్మూరు గనుల పేర్లున్నాయి. వీటిలో

మల్లవెల్లి వజ్రాలగనిని తాను స్వయంగా చూశానని స్ట్రేన్‌షన్ మాష్టర్ (1679) పేర్కొన్నట్టు, కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్ (1883) లో గోర్డాన్‌మెకంజీ వ్రాశాడు. కృష్ణాజిల్లా నూజివీడు దగ్గర మల్లవల్లి, గొల్లపల్లిలలో వజ్రాల గనులున్నట్లు దీన్నిబట్టి తెలుస్తోంది.

1795 లో డా॥ హేనీ అనే బ్రిటిష్ అధికారి కూడా ఈ నూజివీడు గనుల్ని చూసినట్టు రికార్డు చేశాడని మెకంజీ వివరించాడు. గోల్కొండ సుల్తానుల పాలనలో నూజివీడు "కొండపల్లి సర్కార్" కింద ఉండేది. కోళ్లూరు, పరిటాల, మల్లవల్లి, గొల్లపల్లి ఇవన్నీ కొండపల్లి వజ్రాల గనులున్న ప్రాంతాలు ఆనాడు.

విన్స్టేటెన్, విలియం మెత్వోలు, కాస్టాన్‌హెడా, గర్నియా డి ఓర్జా, వర్తెమా, బార్బొజా, యాండ్రీసొరీస్‌బీ లాజరస్ వైగస్, ఆంటోనియో లోపెల్ ఇలా ఎందరో యూరోపియన్లు విజయనగరం, గోల్కొండలలోని వజ్రాల పరిశ్రమ గురించి ఎన్నో విశేషాలు రాసి పెట్టారు.

**హంపీ వజ్ర సంపద :**

విజయనగర వజ్రాల పరిశ్రమ వర్ధిల్లిన కాలంలో ప్రపంచంలో ఇంత ఆదాయ వనరులు కలిగిన పరిశ్రమ మరొకటి లేదు. బ్రెజిలియన్‌లు 1725లో దక్షిణ అమెరికాలో వజ్రాల పరిశ్రమను స్థాపించారు. 1866 లో దక్షిణ ఆఫ్రికాలో బంగారు గనుల విశేషాలు వెలుగులోకి వచ్చాయి. అంతవరకూ తెలుగువారి వజ్రపరిశ్రమే ప్రపంచ ప్రసిద్ధిగా ఉండేది. అమెరికన్ డైమండ్స్ తక్కువ నాణ్యమైనవి. కానీ, విజయనగరం వజ్రాలు అలాంటివి కాదు. తిరుగులేనివి. నాణ్యమైనవి. ఇంకెక్కడా దొరకనివి. "We can certainly assume that Deccan was the only place of Diamond production in the world at that time" అంటాడు డా॥ యస్. జయశీల స్టీఫెన్ (1995 ఏప్రియల్ – జూన్, మిథిక్ సొసైటీ జర్నల్ – Diamond Mining Industry - Vijayanagara state policy and the Regional Economy of Late Medieval South India వ్యాసం)

ప్రత్యామ్నాయ ఆర్థిక వనరులైన ఖనిజాలు, లవణాల మీద దృష్టి పెట్టగలగడం వల్లనే విజయనగర రాజులు అంతర్జాతీయ వాణిజ్యాన్ని అంత విజయవంతంగా నిర్వహించగలిగారు.

ఫ్రాన్సిస్కో పెరీరా అనే పోర్చుగల్ రాజప్రతినిధి హంపీ వజ్రాల్ని 3 రకాలుగా వర్గీకరించాడు. వజ్రకరూర్‌లో దొరికే వజ్రం అన్నింటి కన్నా శ్రేష్ఠమైందన్నాడు. కొండపల్లి వజ్రం కొంచెం చిన్నదిగా ఉంటుంది గానీ, వజ్రకరూర్‌కన్నా కాంతివంతంగా ఉంటుందన్నాడు. పెంపాయ్ వజ్రం ముతకగా, పెళుసుగా ఉంటుందని విశ్లేషించాడు.

1520 నాటికి, కృష్ణదేవరాయల ఆధీనంలో ఆయన స్వయం పర్యవేక్షణలో 7 వజ్రాల గనులుంటే, 1678 నాటికి సుల్తాన్‌ల ఆధీనంలో, బీజాపూర్ సామ్రాజ్యంలో 15 గనులు, గోల్కొండ సామ్రాజ్యంలో 23 గనులు ఏర్పడ్డాయి. అంటే సుల్తానులు కొత్త గనుల్ని తెరిచారన్నది స్పష్టం. భూగర్భ వనరుల్ని విజయనగర రాజులు సంయమనంతో, సమతుల్యత సాధించే విధంగా వినియోగించారనీ, సుల్తాన్‌లు వాణిజ్య ప్రయోజనాల కోసం తెలుగు నేల లోపలి వనరుల్ని తెగనమ్ముకున్నారనీ అర్థం అవుతోంది.

16వ శతాబ్దిలో తమిళనాడులోని దేవికాపురం, అగరం, తిరువైయూరులలో వజ్రాల మార్కెట్లు ఏర్పడ్డాయి. 17వ శతాబ్దిలో “జింజి”ని శివాజీ ఆక్రమించాక అక్కడ కూడా ఒక వజ్రాల మార్కెట్ ఏర్పడింది.

**రాయలకాలంలో వజ్రగనుల నిర్వహణ**

విజయనగర రాజులకు గనుల నిర్వహణ విషయంలో శాస్త్రీయ విధానం ఉంది. కృష్ణదేవరాయలు తర్వాత, సుల్తానులు కొంత మార్పు చేసినప్పటికీ, మొగల్ చక్రవర్తులు, బ్రిటిష్ పాలకులు కూడా విజయనగర విధానంలోనే వజ్రాల గనుల్ని నిర్వహించే ప్రయత్నం చేశారు. కానీ చిత్తశుద్ధి కొరవడటం వలన గొప్ప విజయాలు సాధించలేకపోయారు.

వజ్రాలు దొరికే భూముల్ని సర్వే చేసి, ఎంపిక చేసుకోగలగటం మొదటి అంశం. రాజు స్వయంగా పర్యవేక్షించేవాడు. కంపలు, దుబ్బులు, తుప్పలు ఏరి, వాటిని దగ్ధం చేసేవాళ్లు. గని కోసం కేటాయించిన భూమికిచుట్టూ కోటప్రాకారాలు నిర్మించేవాళ్లు. అది నిషిద్ధ ప్రదేశం. జనసామాన్యానికి ప్రవేశం లేదు. నిరంతర నిఘా, సైనికుల పహారా ఉండేవి. గని కార్మికులను సెక్యూరిటీగార్డులు బట్టలు దులిపి మరీ పరీక్షించి బైటకు పంపేవాళ్లు.

బలులిచ్చి, శాస్త్రోక్తంగా పూజలు జరిపి, వజ్రాల వేట ప్రారంభించేవాళ్లు. గని కార్మికులందరినీ అక్కడ సమావేశపరచి, తిలకం దిద్ది, గనిసంపదని కాపాడతానని దేవత పేరుతో ఒట్టు వేయించేవాళ్లట.

ఒక్కో గనిలో 20 వేల నుంచి 60 వేల వరకూ కార్మికులు పనిచేసేవాళ్లు. వీళ్లలో, స్త్రీలు, పురుషులు, పిల్లలు కూడా ఉండేవాళ్లు. వేగులు వెయ్యికళ్లతో గని కార్మికుల్ని కనిపెడుతూ ఉంటారు. వజ్రాన్ని దొంగతనం చేసినట్లు బైటపడితే, దాన్ని లాక్కుని దాని విలువకు 8 రెట్లు అపరాధరుసుము విధించేవాళ్లట. మరణశిక్ష కూడా విధించేవాళ్లు. "వాన్‌లింషో టెన్" అనే యాత్రికుడు ఇలా అంటాడు. "If anie man bee found that hideth anie such he looses both life and goods" అని ! ఇంత కఠినమైన నియమాలను పెట్టి నడపడంతో బైట ప్రజలకు ఈ వజ్రాల గనుల గురించి పెద్దగా తెలిసేదికాదు.

ప్రతి 2 వేల మంది కార్మికులపైన ఒక పర్యవేక్షకుడుంటాడు. ప్రతి వందమందినీ ఒక యూనిట్‌గా తీసుకుని, ఈ వందమందికీ నిపుణత, అనుభవం, సీనియారిటీ ఉన్న కార్మికుణ్ణి నాయకుడిగా పెట్టేవాళ్లు. ఈ యూనిట్‌ని "MUZHAM UNIT" అని పోర్చుగీసు భాషలో పిలిచేవాళ్లు. త్రవ్వకాలన్నీ మగకార్మికులే జరిపే వాళ్లు. మట్టిమోయడం, ఊడవటం, కడగటం లాంటివి ఆడవాళ్లు, పిల్లలు చేసే వాళ్లు. బండరాళ్లు అడ్డం వస్తే పేలుడు పదార్థా లుపయోగించి పగలగొట్టేవాళ్లు. గనిని తవ్వుకొంటూ లోపలికి పోయినప్పుడు, తట్టల్లో మట్టిని ఎత్తుకుని వరుసగా నిలబడిన కార్మికులు ఒకరి చేతుల్లోంచి ఒకరు అందుకొంటూ అంచెలంచెలుగా గని బైటకు తెచ్చి కుప్పగా పోసేవాళ్లు. "గనిమట్టి" లోంచి వేరుచేసిన వజ్రపు

రాళ్లను రెండు రోజులపాటు నీళ్ల తొట్టెలో వేసి నానబెట్టేవాళ్లు. రాయిని అంటుకున్న మట్టిని కడిగి, ఆ వజ్రపు రాయిని ప్రభువుకు అప్పగించడం వీళ్ల బాధ్యత. ఎత్తుగా ప్రత్యేకంగా కట్టిన ఒక అరుగు మీద కొద్ది కొద్దిగా "గనిమట్టి" తెచ్చి, కొండ చీపుళ్లతో జాగ్రత్తగా కడిగేవాళ్లు. వజ్రపురాయికీ, మామూలు రాయికీ తేడా తెలిసిన నిపుణుల పర్యవేక్షణలో ఈ "కడుగు" కార్యక్రమం జరిగేది. వజ్రపు 'రవ్వ' దొరికినా దాని విలువ దానిదే కదా !

అక్కడి నుంచి ప్రభుత్వ ఆధ్వర్యంలోని కార్ఖానాకు ఆ వజ్రపు రాయిని చేరుస్తారు. దాన్ని కోణాలుగా కోసి, సానబెట్టేందుకు తిరుగలి రాయి లాంటి రాతి చక్రాలు ఉండేవి. విజయనగరం పనివాళ్లు అనుసరించే పద్ధతిలో తరుగు ఎక్కువగా పోదని, పోర్చుగీసు పద్ధతిలో ఎక్కువ వజ్రభాగం నష్టపోతున్నాం అనీ పోర్చుగీసులే అంగీకరించారు. రాయి ఎంత వేగంగా తిరిగితే, మెరుగు అంత ఎక్కువ, తరుగు అంత తక్కువ వస్తుందని టావెర్నియర్ రాశాడు.

## గనులకు ప్రైవేటు యాజమాన్యాలు

పెద్ద గనులను రాయలవారే స్వయంగా నిర్వహించినా, తక్కిన చిన్న గనులున్న ప్రాంతాల్ని నమ్మకమైన వ్యక్తులకు కౌలుకు ఇచ్చేవాడు. "గూటి (గుత్తి) గనిని అడపా నాయకుడు కౌలుకు తీసుకున్నాడు. "అడపా నాయక్ మరొక సామంతుడు, రాజుకు ప్రధాన సలహాదారుడు. "గతె" (గూటి, గుత్తి) ప్రాంతానికి ప్రభువు. ఆదాయం మూడు లక్షల బంగారు పర్దావులు. ఈ ఆదాయంలో గుత్తి వజ్రాలగనిలో దొరికే వజ్రాల మీద వచ్చే ఆదాయం చేరదు. రాజుకు ప్రతి సంవత్సరం నలభైవేల పర్దావులు చెల్లిస్తాడు. అయితే, అక్కడ దొరికే వజ్రాలలో ఇరవై "మంజెలిన్" లకు మించిన బరువు గల వజ్రాలన్నీ రాజుగారి కోశాగారానికి సమర్పించాలి. ఎనిమిదివేల పదాతులు, ఎనిమిది వందల గుర్రాలు, ముప్పయి ఏనుగులను పోషించాలి. రాజుకు ప్రతి సంవత్సరం లక్ష పర్దావులు చెల్లించాలి–" అని ఇతన్ని గురించి ఫెర్నారోన్యూనిజ్ వ్రాశాడు (విస్మృత సామ్రాజ్యం – విజయనగరం : రాబర్ట్ స్యూయల్ 2010 ఎమెస్కో)

తిమ్మరాయుడు "పేలి" వజ్రాల గనిని, గోపాలరాయుడు నంద్యాల గనిని, కృష్ణరాయుడనే పాలెగారు మర్మూరు గనిని కౌలుకు తీసుకుని నిర్వహించేవాళ్లని విదేశీయుల వ్రాతప్రతుల్ని బట్టి తెలుస్తోంది.

మాంజెలిన్ అంటే ఒక కేరట్ కన్నా కొంచెం ఎక్కువ. నాలుగు మాంజెలిన్‌లు 5 కేరట్లతో సమానంగా ఉంటాయి. 20 మాంజెలిన్లు అంటే 25 కేరట్లు అవుతాయి. 25 కేరట్లకన్నా చిన్నవైన వజ్రపురాళ్లను తామే ఉంచుకుని, గనుల లీజుదార్లు పెద్ద వజ్రాలన్నింటినీ సగౌరవంగా ప్రభువుకు అర్పించుకునేవాళ్లు. ఏ కారణంచేతనైనా, రాజ్యంలో ఎవరి దగ్గరైనా 25 కేరట్లకన్నా పెద్ద వజ్రం ఉన్నా దాన్ని అమ్మినా, దాన్ని కొన్నా అది మరణశిక్ష పడేటంత నేరం. వజ్రానికి సాన పెట్టేవాళ్లు కూడా మనిషికి మూడు వజ్రాలకన్నా ఎక్కువ ఉంచుకోకూడదనే ఆంక్ష ఉండేది. 1531-32 సంవత్సరాలలో ముత్తిన లక్ష్మీసెట్టి వజ్రకరూర్‌లోని ప్రభుత్వ వజ్రభాండాగారానికి అధిపతిగా ఉండేవాడు. పెద్ద వజ్రాలు మాత్రం రాజధానిలో ప్రభుత్వ కోశానికి పంపించి, చిన్న వజ్రాలను తాను సంరక్షించేవాడు.

విలియం మెత్వోలిన్ "రిలేషన్స్ ఆఫ్ గోల్కొండ ఇన్ ద ఎర్లీ సెవెన్టీన్త్ సెంచురీ-1931" గ్రంథంలో ఇలాంటి వివరాలున్నాయి.

**వజ్రాల అంగళ్లు**

1520-22 లలో డోమింగో పేస్ రాసిన దాన్నిబట్టి చూస్తే, విజయనగరం కాలంలో కూరగాయలు అమ్మినంత స్వేచ్ఛగా వజ్రాల మార్కెటింగ్ జరిగేదని తెలుస్తుంది. "ఇంకా ముందుకు వెళితే ఒక విశాలమైన మనోహరమైన వీధి వస్తుంది. నేను ఇంతకు ముందు వర్ణించిన అందమైన ఇళ్లు, వీధుల వంటిది. ఈ ఇళ్లు భరించగలిగిన స్థాయి ధనవంతులవని గుర్తుంచుకోవాలి. ఈ వీధిలో చాలామంది వర్తకులు నివసిస్తారు. ఇక్కడ అన్ని రకాల కెంపులు, వజ్రాలు, పచ్చలు, పగడాలు, సన్న ముత్యాలు, వస్త్రాలు, భూమ్మీద లభించే ప్రతి వస్తువూ నీవు కొనదలచుకున్నది ఏదైనా దొరుకుతుంది" (విస్తృత సామ్రాజ్యం విజయనగరం- రాబర్ట్ స్వ్యాయల్)

నిత్యావసర వస్తువులతో పాటే, ఈ ఖరీదైన రత్నాలూ వజ్రాలు సామాన్య ప్రజల కోసం బహిరంగంగా అమ్మకం జరిగేవి. ఇవేకాదు, గుర్రాలు కూడా ఈ మార్కెట్లోనే అమ్మకానికి ఉండేవి. చిన్నవజ్రాలను మూటగట్టి హంపీ మార్కెట్‌లో ఐదు రూబుళ్లకూ, పదిరూబుళ్లకూ అమ్మేవారని "నికిటిన్" పేర్కొన్నాడు. రెండు వేల పౌండ్ల బరువైన బంగారం ఇచ్చి 25 వజ్రాలు కొనుగోలు చేసేవాళ్లట. "కొనవజ్రం" అయితే పదివేల పౌండ్ల ఎత్తు బంగారం ధర పలికేదట.

బహిరంగ మార్కెట్‌లో దొరికే వజ్రాలు ఎక్కువ భాగం ప్రైవేటు యాజమాన్యం నిర్వహించే గనులలోని చిన్న వజ్రాలే ! పెద్ద వజ్రాలు బహిరంగంగా అమ్మటం నిషిద్ధం ఆనాడు. వీటితోపాటు కృత్రిమ వజ్రాలు కూడా అమ్మేవారని (ఇమిటేషన్ వజ్రాలు) బార్బోజా వ్రాశాడు. అందుకని, నాణ్యత పసిగట్ట గలిగిన స్వర్ణకారుల్ని వెంట తీసుకువెళ్లి, కొనవలసిందిగా పోర్చుగల్ రాజు తన ఏజెంట్లను ఆదేశించేవాడు.

చాలా దేశాల వాళ్లు ఇక్కడ కొన్న వజ్రాలతో, ఇక్కడే బంగారు ఆభరణాలు చేయించుకు వెళ్ళేవాళ్లు. 1517లో "లాజరస్ నూరెన్ బెర్లర్" అనే జర్మనీ నగల వ్యాపారి పోర్చుగీసులతో కలిసి విజయనగరం మార్కెట్‌కు వచ్చాడు. రాజ్యం నలుమూలలా తిరిగాడు. వజ్రాల గనుల వివరాలు తెలుసుకున్నాడు. తిరిగివెళ్ళి జర్మనీ అంతా హంపీ వజ్రాల గురించి ప్రచారం చేశాడు. జెర్మనీ ప్రభువు 1520లో "హిష్వోజెల్" అనే వ్యాపారికి డబ్బిచ్చి తన పక్షాన వజ్రాలు కొనుగోలు చేసి తెమ్మని నియమించాడు. 23-10-1549 న పోర్చుగల్ రాజు భారతదేశంలో తన గవర్నర్‌ని "Cosme Anoes" అనే వర్తకుడికి విజయనగరంలో వజ్రాలు కొనడం కోసం 10 పరదావుల బంగారాన్ని ఇవ్వవలసిందిగా ఆదేశించాడు. "ఆంటోనియో లోపెల్" భారతదేశంలో పోర్చుగీసుల కోశాధికారిగా ఉండేవాడు. 4-4-1557న పోర్చుగల్ రాజు 42 గ్రాముల వజ్రపు ఉంగరం కొనటానికి 24,582 పోర్చుగల్ కరెన్సీని చెల్లించి హంపీకి పంపవలసిందిగా అతనిని ఆదేశించాడు. వజ్రాల వ్యాపారం ఇంత పగడ్బందీగా జరిగేది ఆ రోజుల్లో.

**కొండపల్లి వజ్రాలు :**

నదిలో దొరికే రాళ్లనుంచి పూర్వపు రోజుల్లో వజ్రాలను ఏరి పదును పెట్టే వాళ్లు. River Gravels అంటారు వీటిని. భూమిపై పొరల్లో కూడా ఇలానే వజ్రపు రాళ్లుండి, వాన కురిసినప్పుడు అవి తేలి బైటకొచ్చేవి. వాటిని Kimberlite stones అంటారు. కృష్ణా, గుంటూరు, మహబూబ్‌నగర్, కర్నూలు, కడప, అనంతపురం జిల్లాల్లో కృష్ణాతీరం వెంబడి ఉన్న భూముల్లో ఈ కింబర్లయిట్ వజ్రపురాళ్లు దొరుకుతాయి. తుంగభద్ర నుంచి కృష్ణానది దివిసీమ సాగరసంగమం వరకూ 300 కి.మీ. ప్రాంతంలో వజ్రాలు దొరికేవి. కాబట్టి కృష్ణానదిని "వజ్రాలనది" అనేవాళ్లు. ఈ నదీ పరీవాహక భూమిని వజ్రభూమి అనేవాళ్లు. బౌద్ధుల కాలం నాటికే ఇది వజ్రభూమి.

గుంటూరు జిల్లా సత్తెనపల్లి దగ్గర కోళ్లూరు, కృష్ణాజిల్లా జగ్గయ్యపేట దగ్గర పరిటాల గ్రామాలలో గొప్ప వజ్రాల గనులుండేవి. అనంతపురం జిల్లా వజ్రకరూరు, కర్నూలు జిల్లా నంద్యాల, జొన్నగిరి, కర్నాటకలోని రాయచూరు, కడపజిల్లా బనగానపల్లి విజయనగర కాలం తర్వాత బాగాప్రసిద్ధి పొందిన వజ్రపు గనులు, కోస్టాకొండ, కడప, ద్వానెగూటి, నేవా, పేలి... వీటిని వజ్రపు గనులున్న ప్రాంతాలుగా యూరోపియన్ల రికార్డుల్లో పేర్కొన్నారు. విజయనగర కాలంలో హంపీ వజ్రాలుగా పిలువబడిన ఈ వజ్రాలని సుల్తానుల కాలంలో గోల్కొండ వజ్రాలని పిలిచారు.

విలియం మెత్ వరల్డ్ అనే యూరోపియన్ 17వ శతాబ్దిలో కోళ్లూరు గనిని ప్రశంసించాడు. వజ్రకరూర్ తర్వాత అంతటి ప్రశస్తమైన వజ్రాలు కోళ్లూరులోనే దొరికాయట !

కోళ్లూరు గనిని గోల్కొండ సుల్తానులే కనుగొన్నారని అంటారు గానీ, గోర్డాన్ మెకంజీ "కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్" (1883) లో ఈ కోళ్లూరు గని అంతకు మునుపు అనేక వందల సంవత్సరాలుగా ఉండేదని వ్రాసాడు. వెనీస్ యాత్రికుడు మార్కోపోలో 13 శతాబ్దిలో కృష్ణాతీరాన్ని సందర్శించాడు. కృష్ణానది మీద ప్రయాణిస్తూ సిందుబాద్ సాహసయాత్రల్ని గుర్తు చేసుకున్నాడు. ఆయన సందర్శించిన వజ్రాలగని ఈ కోళ్లూరే కావచ్చునన్నాడు గోర్డాన్ మెకంజీ.

అశోకుడి తరఫున బౌద్ధ ప్రచారానికి శ్రీలంక వెడుతూ మార్గమధ్యంలో కృష్ణానది దగ్గర ఆగిన తిష్యరక్షిత బృందం కృష్ణానది మీద ప్రయాణిస్తున్నప్పుడు "వజ్రాలదిన్నె" దగ్గర, ఇసుకమేటకు పట్టుకొని పడవ ఆగిందట.

వజ్రాలు దొరికే భూమి కాబట్టి దీన్ని వజ్రాల దిన్నె అన్నారనీ, ఇదే ఆ తరువాతి కాలంలో 'కోళ్లూరు'గా ప్రసిద్ధి చెందిందనీ ఒక వాదన ఉంది.

కృష్ణా డిస్ట్రిక్ట్ మాన్యువల్ (1883) లో గోర్డాన్ మెకంజీ ఈ కోళ్లూరు గురించి ఒక ఆసక్తికరమైన కథ చెప్పాడు. 3120080114 (విజయనగరం) నుంచి 15 రోజులు ప్రయాణిస్తే వజ్రాలు దొరికే కొండ వస్తుంది. దాన్ని అల్బెనిగరాస్ కొండ అంటారు. దానిమీద వజ్రాలను కాపాడుతూ భయంకరసర్పాలు తిరుగుతుంటాయి. దాన్ని ఎక్కడం చాలా కష్టం. అందుకని, ఈ కొండకు దగ్గరలో ఉన్న మరో కొండమీదకు ఎక్కి అక్కడ పూజలు చేసి, బలిసిన ఎద్దుని బలి ఇచ్చి, దాని మాంసాన్ని ముక్కలుగా తరిగి, ప్రత్యేకమైన యంత్రాల సహాయంతో ఈ మాంసం ముక్కల్ని వజ్రాల పర్వతం మీదకు విసిరేవాళ్ళట. మాంసం ముక్కలకు వజ్రాలు అంటుకొంటాయి. రాబందులు ఆ మాంసం ముక్కల్ని గోళ్లతో పట్టి, అక్కడ పాములుంటాయి. కాబట్టి, సురక్షితమైన ఇవతలి కొండకు తెచ్చుకుని తింటాయి. మాంసానికి అంటిన వజ్రపు తునకలు అక్కడ రాలిపడితే వాటిని ఏరుకునేవాళ్లట.

ఈ కథ కోళ్లూరుకు సంబంధించినదే అనీ కోళ్లూరు దగ్గర వజ్రసేకరణ ఇలా ప్రారంభమైందనీ ఈ కథనం చెప్తోంది. మార్కోపోలో కూడా కోళ్లూరు గురించి ఇలాంటి కథే చెప్పాడు. కాబట్టి, అతను దర్శించింది, కోళ్లూరేనని అర్థం అవుతోందంటాడు గోర్డాన్ మెకంజీ.

15వ శతాబ్దిలో నికోలో కోంటీ, ఫ్రెంచి నగల వర్తకుడు జాన్‌బాప్టిస్ట్ టావెర్నియర్ (1605–89) కూడా ఈ కోళ్లూరు వజ్రాల గనిని సందర్శించారు. టావెర్నియర్ గోల్కొండ నుంచి ఆరు రోజులు ప్రయాణించి కృష్ణదాటి Gani Coulour (గని కోళ్లూరు) వెళ్లినట్టు రాసుకున్నాడు. నేటి పులిచింత(ల) కు దక్షిణాన,

బెల్లంకొండ పక్కన గనికోళ్లూరుంది. 1679 మార్చి 18న స్ట్రేన్‌షమ్ మాస్టర్ అనే ఈస్టిండియా కంపెనీ ఏజెంటు మద్రాసు – మచిలీపట్నం మధ్య వ్యాపారానుకూల అంశాలను పరిశీలిస్తూ, కోళ్లూరు సహా కృష్ణాతీరంలో వజ్రాలు దొరికే అవకాశాలను సర్వే చేశాడు. 1795 లో డా॥ హేనీ అనే ఇంకో సర్వేయర్ రంగుల బొమ్మలతో వీటి గురించి నివేదిక పంపాడు. 1880 "జియోలాజికల్ మెమోయిర్స్" గ్రంథంలో 'గని పరిటాల ప్రాశస్త్యాన్ని తెలుపుతున్న వివరాలున్నాయి. అలాగే, 1881 నాటి గ్రంథం "ది డైమండ్స్ కోల్ అండ్ గోల్డ్ ఆఫ్ ఇండియా"లో కూడా చాలా వివరాలున్నాయి.

1850 లో లెఫ్టినెంట్ యాపిల్‌గాత్ అనే అసిస్టెంట్ సివిల్ ఇంజనీర్ పరిటాల, జగ్గయ్యపేట పరిసర ప్రాంతాలలో సింగరేణికి మించిన బొగ్గు నిక్షేపాలున్నాయని తెలిపాడు.

కమాలియార్ జంగ్ బహదూర్ పరిటాలని ఒక తాలూకాగా ప్రకటించాడు. ఈ తాలూకాలో మొత్తం 7 గ్రామాలలో వజ్రాల గనులుండేవి. గని ఆత్కూరు, వెలునూదూరు, బత్తినపాడు, నందిగామ, కొడవటికల్లు, ఉస్తేపల్లి, మల్లవల్లి – గ్రామాల్ని కలిపి పరిటాల తాలూకా ప్రకటించాడు. గనులున్న తాలూకా కాబట్టీ దీన్ని కన్నత్ తాలూకా అన్నాడు. 1640 వరకూ పరిటాలని "పర్తియాల" అన్నారు. 1650 లో గోల్కొండ సుల్తాన్ అబ్బుల్ హుస్సేన్ దగ్గర మంత్రిగా ఉన్న "మీర్ జుమ్లా" తన మంత్రి పదవికి రాజీనామా ఇచ్చి, పరిటాలలో వజ్రాల వ్యాపారిగా మారాడట. పెద్దవజ్రాలను ప్రభుత్వానికి అప్పగించే నియమానుసారం పరిటాలలో దొరికిన ప్రసిద్ధ వజ్రాలను ఈ "మీర్ జుమ్లా" గోల్కొండకు సమర్పించుకున్నాడు. కోళ్లూరులో దొరికిన "కోహినూరు వజ్రాన్ని మాత్రం నేరుగా మొగల్ చక్రవర్తి షాజహాన్‌కే సమర్పించాడు.

**రాయల అనంతరం తెలుగు వజ్రాలు :**

చరిత్ర ప్రసిద్ధ చెందిన కొండపల్లి వజ్రాలు దాదాపు 16 వరకూ వివిధ డాక్యుమెంట్ల ఆధారంగా కన్పిస్తున్నాయి. రాయల అనంతరం దొరికిన తెలుగువజ్రాలివి!

**1. కోహినూర్ వజ్రం :** ప్రస్తుతం అది 180 కేరట్లు ఉందని అంచనా. ఇది 1656 లో కోళ్లూరులో దొరికిందని చరిత్రవేత్తల అభిప్రాయం. బ్రిటిష్ రాణి కిరీటంలో దీన్ని అమర్చారు. ఇప్పుడది లండన్‌లో ఉంది. రాబర్ట్ స్యూయల్ "విస్మృత సామ్రాజ్యం విజయనగరం" (2010 ఎమెస్కో – పేజీ 374 "వజ్రాలు" అనుబంధం) లో దీని గురించి కొంత వివరణ కన్పిస్తుంది. "... ఆ సమయంలో మీర్ జుమ్లా వజ్రాల తవ్వకం చేయిస్తున్నాడు. ఈ వజ్రాన్ని చెక్కకుండానే షాజహాన్ చక్రవర్తికి బహూకరించాడు. అప్పుడు దాని బరువు 756 ఇంగ్లీషు కేరట్లు. దీన్ని వెన్నిస్ నగరానికి చెందిన "హార్టెన్సియోబోర్డియో" కి సానపట్టడం కోసం అప్పగించారు. అతని చేతుల్లో చాలా తరుగుపోయింది.

1665 లో ఔరంగజేబు కోశాగారంలో టావెర్నియర్ దీన్ని చూసినప్పుడు ఇది 268 1/2 ఇంగ్లీషు కారట్లకు మించిలేదు.

1739 లో ఇరాన్ ప్రభువు నాదెర్ షా (1688–1747) ఢిల్లీని ధ్వంసం చేసి ఈ వజ్రాన్ని వెంట తీసుకుపోయాడు. దీనికి కోళ్లూరు (కోహినూరు) వజ్రం అని పేరు పెట్టాడు. 1747 లో నాదెర్ షా హత్యకు గురయ్యాడు. ఆ తరువాత ఈ కోహినూరు వజ్రం అతని మనుమడు షారూఖ్ చేతుల్లోకి పోయింది. నాలుగేళ్ల తరువాత షారూఖ్ దీన్ని ఆధునిక ఆఫ్ఘనిస్థాన్ నిర్మాత అహ్మద్‌షా దురానీకి అమ్మేశాడు. దురానీ నుండి అతని కొడుకు తైమూరు షా దురానీకి వెళ్లింది. 1793 లో వారసత్వంగా అతని కొడుకు "జమాన్ షా దురానీ"కి లభించింది. 1795 లో ఇది అతని సోదరుడు సుల్తాన్ షుజా చేతుల్లోకి చేరింది.

1809 లో 'షుజా" కాబూలు రాజయ్యాడు. ఎల్ఫిన్‌స్టోను ఆ సమయంలో ఈ వజ్రాన్ని అతని చేతికంకణంలో చూసినట్టు పేర్కొన్నాడు.

1818 లో ఒక ఒప్పందం ప్రకారం షుజా ఈ కోహినూరు వజ్రాన్ని రంజిత్‌సింగ్‌కు అప్పగించాడు. రంజిత్‌సింగ్ తరచుగా ఈ వజ్రాన్నీ ధరించటాన్ని లాహోరులో యూరోపియన్ సందర్శకులు పలుమార్లు చూశారు.

1839లో రంజిత్‌సింగ్ మరణానంతరం బాలుడైన దులీప్ సింగును వారసుడిగా గుర్తించేంత వరకూ కోహినూర్ వజ్రాన్ని ఆభరణాల కోశంలో ఉంచారు.

1849 లో పంజాబును బ్రిటిష్ సామ్రాజ్యంలో కలుపుకోవడంతో దీన్ని సర్‌జాన్ లారెన్సు కు అప్పగించారు. అతను దీన్ని ఇంగ్లాండు మహారాణికి పంపాడు. 1851లో తొలి మహాప్రదర్శనలో దీన్ని ప్రదర్శించారు.

1852లో గరాండ్స్ కంపెనీకి చెందిన వూర్‌శాంజర్ అనే ఆమ్‌స్టర్‌డామ్ వజ్రాల కట్టరు దీన్ని మళ్లీ సానపట్టాడు. ఇప్పుడు దీని బరువు 106.1/16 కారట్లు"

**2. గ్రేట్ మొగల్ వజ్రం :** 787.5 కేరట్లున్న పెద్ద వజ్రం అది. యూరోపియన్‌ల వ్రాతల్ని బట్టి ఈ వజ్రం ఒకటి ఉండేదని తెలుస్తోంది. 1650 లో కోళ్లూరులో ఇది దొరికిందని చెప్తారు. ప్రస్తుతం ఎక్కడుందో తెలియదు.

**3. రీజెంట్ వజ్రం :** 1701లో పరిటాలలో ఇది బయటపడింది. ప్రస్తుతం దాని బరువు 410 కేరట్లు. పారిస్‌లోని అపోలో గేలక్సీ ప్రదర్శనశాలలో ఇది ఉంది. 1766 లో ఈస్టిండియా కంపెనీకి గంజాం, విశాఖపట్నం, గోదావరి, కృష్ణాజిల్లాల్ని పరిపాలించుకోవటానికి రాబర్ట్‌క్లైవ్ ఫర్మానా పొందాక ఈ వజ్రం మీద అప్పటి మద్రాసు గవర్నర్ పిట్స్ దొరగారి కన్నుపడింది. దాన్ని బలవంతంగా స్వాధీనం చేసుకొని పిట్స్‌దొర రహస్యంగా యూరప్ తీసుకెళ్లి రీజెంట్ ఆర్జియన్స్ కంపెనీకి అమ్ముకున్నాడట! అది (ఫ్రెంచి ప్రభుత్వాన్ని చేరింది. రాణిగారి కిరీటంలో అమర్చారు. రీజెంట్ కంపెనీ వాళ్లు ఇచ్చింది కాబట్టి రీజెంట్ వజ్రం అనీ, పిట్స్ దొర దొంగతనంగా తెచ్చి అమ్మాడు కాబట్టి పిట్స్ వజ్రం అని దీన్ని పిలుస్తారు. కోహినూర్ వజ్రం "కోళ్లూరు"కి, రీజెంట్ వజ్రం పరిటాలకూ అంతర్జాతీయ ఖ్యాతిని తెచ్చాయి.

**4. ఓర్లోఫ్ వజ్రం :** ఇది 300 కేరట్లు బరువున్న వజ్రం. 1739 లో కోళ్లూరులో దొరికింది. ప్రస్తుతం రష్యాలోని క్రెమ్లిన్ వజ్రాల కోశంలో ఇది భద్రపరచబడింది. ఇది రష్యా చేరిన వైనం వేరే పరిశోధనాంశం. బహుశా విక్టోరియా రాణికి, జారు చక్రవర్తికి గల బంధుత్వం కారణంగా ఆమెకు కానుకగా చేరి ఉండవచ్చు.

**5. నిజాం వజ్రం :** 440 కేరట్లున్న ఈ వజ్రం కూడా కోళ్లూరులోనే 1835 లో దొరికింది. ప్రస్తుతం నిజాం ట్రెజరీలో భద్రపరచబడింది.

**6. హోప్ వజ్రం :** కేవలం 67 కేరట్లున్న ఈ వజ్రం 1642 లో కోళ్లూరులో దొరికింది. ప్రస్తుతం దీన్ని వాషింగ్టన్ "స్మిత్ జోనియన్ ఇన్‌స్టిట్యూషన్"లో భద్రపరిచారు. అక్కడకు ఎలా చేరిందో తెలీదు.

**7. గోల్కొండ వజ్రం :** 130 కేరట్లున్న ఈ కొండపల్లి వజ్రం మెల్‌బోర్న్‌లోని డన్‌క్లింగ్స్ నగల వ్యాపారుల దగ్గర ఉన్నదట.

**8. కోళ్లూరు వజ్రం :** 63 కేరట్లుంటుంది. కోళ్లూరులో దొరికింది. ప్రస్తుతం ఎక్కడుందో, ఏమయ్యిందో తెలియదు.

ఇవికాక – అక్బర్‌షా, దర్యా ఇనూర్, తాజ్–ఇ–మహ్, సోనీ, బాబర్, గ్రేట్ టేబుల్, షా... ఇలా అనేక తెలుగు వజ్రాలు ఉండేవని రికార్డుల ఆధారంగా తెలుస్తోంది. బరోడా రాజు గాయిక్వాడ్ దగ్గర వీటిలో ఒక వజ్రం ఉందని భావిస్తున్నారు.

**గోల్కొండ వజ్రాల గనులు**

విజయనగరానికీ, సుల్తానులకూ మధ్య తరచూ యుద్ధాలకు మతపరమైన కారణాలు వెతుకుతారు. కానీ, వజ్రాల గనులున్న భూముల మీద ఆధిపత్యం సంపాదించటానికే ఈ యుద్ధాలు ముఖ్యంగా జరిగాయని ఈ వివరాలు చూస్తే తేలికగా అర్థం అవుతుంది.

సుల్తానులు 5 రాజ్యాలుగా చీలి ఉన్నారు. ఒకరితో ఒకరికి సఖ్యత లేకపోవడం వలన విడివిడిగా ఏ సుల్తానూ విజయనగర మహాసామ్రాజ్యాన్ని ఎదుర్కొనలేక పోయాడు. బలమైన సైనికవ్యవస్థను కలిగి ఉండటం ద్వారా విజయనగర ప్రభువులు తక్కువ యుద్ధాలతో ఎక్కువ విజయాలు పొందే ప్రయత్నం చేశారు. ఈ వాస్తవాన్ని ఆలస్యంగా గుర్తించారు సుల్తానులు. అందరి సైన్యమూ ఏకమై 23–01–1565 న మూకుమ్మడిగా విజయనగరాన్ని ముట్టడించారు. చివరికి గెలిచారు.

గెలిచిన తర్వాత కూడా సుల్తానులు వెనుకటి గుణాన్ని మార్చుకోలేదు. వజ్రాల భూముల పంపకంలో మళ్లీ వాళ్లలో వాళ్లకి కలహాలు రేగాయి. బీజాపూర్,

గోల్కొండ సుల్తానుల మధ్య పెద్ద యుద్ధమే జరిగింది. 1573లో ఆ ఇద్దరి మధ్య కుదిరిన అంగీకారం ప్రకారం మైసూరు రాజ్యంలోని అధికభాగం 'బీజాపూర్'కి దక్కింది. దిగువ కర్నాటకలోని నెల్లూరు వరకూ గోల్కొండ ఆధీనంలోకి వెళ్లింది. నెల్లూరు ఆవల తంజావూరు, మధుర వరకూ చంద్రగిరి విజయనగర సామ్రాజ్యం ఉంది. వీటిలో బీజాపూర్ ఆదిల్షా ఆధ్వర్యంలో రాయచూర్, బళ్లారి, రాయలసీమ గనులు, గోల్కొండ కుతుబ్‌షాహీ, ఆధ్వర్యాన కొండపల్లి గనుల్నీ పంచుకున్నారు.

గనుల నిర్వహణలో విజయనగర రాజులకున్నంత పట్టు గోల్కొండ, బీజాపూర్ లకు లేదు. వజ్రాల ఉత్పత్తిలోకి విదేశీ శక్తులను రానివ్వకూడదనే దృఢమైన నిర్ణయాన్ని విజయనగర రాజులు తీసుకున్నారు. సుల్తానులే ఈ దేశంలో విదేశీ వర్తకులు కాబట్టి వాళ్ళకు ఆ పట్టింపు ఏమీ ఉండేది కాదు. మైనింగ్ రంగంలో అనుభవం ఉన్న కంపెనీలకు గనులు తవ్వక బాధ్యత అప్పగించే వాళ్లు. పెద్ద వజ్రాలు దొరికితే ప్రభుత్వానికి అప్పగించి తీరాలనే నియమం లాంటివి సుల్తానులూ కొనసాగించారు.

గోల్కొండ సుల్తానుల కాలంలో ఇటలీ వ్యాపారి బెర్నార్లోడి నార్గోనా 1606 లో వజ్రాల అంగడిలో కాకుండా నేరుగా రామలకోట వజ్రాలగని దగ్గరకు వెళ్లి అక్కడే బేరం చేసి వజ్రాలు కొన్నాడు. వజ్రాలను వాటి ఉత్పత్తి స్థానంలోనే కొనడం వలన గని యజమానికి వజ్రాలను భద్రపరచడం, మార్కెట్టుకు తరలించడం లాంటి ఖర్చులు తప్పేవి. వెంటనే సొమ్ము చేతికి వచ్చేది. మధ్య దళారీలు లేకపోవడాన అమ్మేవాడికీ, కొనేవాడికీ ఇద్దరికీ లాభదాయకంగా ఉండేది. కానీ, ఉత్పత్తి అయిన వజ్రం మీద ప్రభుత్వానికి అదుపు లేకుండా పోయింది.

గనుల దగ్గరే కొనుగోళ్లు మొదలయ్యాక, విదేశీ ఏజెంట్లు తమ నివాసాలను గనులకు దగ్గరగా మార్చుకున్నారు. 1620 లో ఫెలిప్పీ ఎస్కుడో అనే పోర్చుగల్ వజ్రవ్యాపారి గోవా నుంచి తన నివాసాన్ని ఏకంగా దక్షిణాదికి మార్చేశాడు. గనుల దగ్గర అందరికన్నా ముందుంటే, నాణ్యమైన వాటిని దక్కించుకోవచ్చని ! ఆనాటి గోల్కొండ వజ్రవ్యాపారుల్లో మాలిక్ తుజార్ ముఖ్యుడు.

17-7-1614 న పీటర్ ఫ్లోరిస్ అనే ఏజెంటు గోల్కొండ మార్కెట్లో వజ్రాల ధరలు చాలా ప్రియంగా ఉంటున్నాయని, సామాన్యుడు కొనగలిగే స్థితి లేదని

రాశాడు. టోకు వ్యాపారం గనుల దగ్గరే జరిగిపోవడంతో మార్కెట్టుకు నాణ్యత లేని వజ్రాలే రాసాగాయి. ధరల్లో హెచ్చు తగ్గులుండటం వీటి వలన గోల్కొండ మార్కెట్ నిలకడలేనిదయ్యింది. ధరలో వ్యత్యాసం కూడా 5 రూబుళ్ళ నుంచి 10 రూబుళ్ల వరకూ ఒకేసారి పెరగడం, వెయ్యి పౌండ్ల బంగారం నుంచి రెండు వేల పౌండ్ల బంగారానికి రేటు పెరగడం... ఇదీ ఆనాటి పరిస్థితి !

**తెలుగు వజ్రాలకే డిమాండు**

ఇంత వ్యతిరేక పరిస్థితి ఉన్నా ప్రపంచంలో తెలుగు నేల మీద మాత్రమే నాణ్యమైన వజ్రాలు దొరకడం కారణంగా గోల్కొండ వజ్రాలకు డిమాండు తగ్గలేదు. 1620–23 మధ్య కాలంలో డచ్ వాళ్లు మచిలీపట్నం ఓడరేవు ద్వారా 2293.75 కేరట్ల వజ్రాలను ఎగుమతి చేసినట్లు లెక్కలు చెప్తున్నాయి. 'ఆరకాన్' నుంచి మచిలీపట్నానికి రత్నాలు తెచ్చి బదులుగా డెక్కన్ వజ్రాలు కొనుగోలు చేశారట.

1615 వరకూ వజ్రవ్యాపారంలో తనదే ఏకఛత్రాధిపత్యం అన్నట్లు నిలిచింది పోర్చుగల్. వెనీస్, ఆమ్ 'స్టర్' డామ్ నుంచి కూడా వ్యాపారులు రావటాన పోర్చు గీసు వజ్రవ్యాపారం తగ్గింది. విజయనగర కాలంలో పోర్చుగీసులు పొందిన గౌరవాలు లాభాలు గోల్కొండకాలంలో తగ్గిపోయాయి.

భారతదేశం అంటే తవ్వి గంపలకెత్తుకు పోవడమేనని భావనతో వచ్చినవాళ్లే వీళ్లంతా ! ఎంత బిందె తెచ్చుకుంటే అన్ని నీళ్లు అన్నట్లు పనిచేశారు. మద్రాసులో బ్రిటిషర్లు ఫోర్ట్ సెయింట్ జార్జి కట్టుకొన్నాక మచిలీపట్నం రేవులో వాణిజ్యం స్తంభించింది. ఇక్కడి అప్పుల్ని ఎగ్గొట్టి బ్రిటిష్ ఈస్టిండియా కంపెనీ రెండు మరఫిరంగులు మాత్రం వదలి మూటాముల్లె సర్దుకుని మొదట విశాఖపట్టణానికి ఆ తర్వాత మద్రాసుకూ బిచాణా ఎత్తేసింది. దాంతో కొండపల్లి వజ్రాల గనులు దిక్కులేకుండా పోయాయి. సర్కారు జిల్లాలను బ్రిటిషర్లకి ధారాదత్తం చేసి, నిజాం నవాబు వజ్రాల మీద ఆశతో పరిటాలను మాత్రం ఉంచుకున్నాడు. కానీ, బందరు రేవు మూతపడడంతో అక్కడా వజ్రాల వ్యాపారం సాగలేదు.

బ్రిటిష్ సహకారంతో టిప్పుసుల్తాన్ని ఓడించిన సందర్భంలో నిజాం వాటాగా 1792, 1799 లలో కడప, కర్నూలు, అనంతపురం, బళ్లారి జిల్లాలు నాలుగూ కైవసం అయ్యాయి. 1800 సంవత్సరంలో ఈ నాలుగు జిల్లాలనూ బ్రిటిష్ వాళ్లకి దత్తత ఇస్తున్నానన్నాడు నిజాం. "దత్తమండలం" అని దానికి పేరు పెట్టాడు. 1801లో పలనాడును కూడా ఇలానే బ్రిటిషర్లకు దత్తత చేశాడు.

కడప మాన్యువల్ (1880) లో బ్రిటిష్ పాలనాకాలంలో రాయలసీమ వజ్రాల గనుల గురించి ఈ క్రింది వివరాలున్నాయి :

ఈ దత్త మండలానికి కలెక్టర్ థామస్ మన్రో 1804 జూలై 24 న బ్రిటిష్ బోర్డుకు ఒక లేఖ రాశాడు. వజ్రాల గనులకు విజయనగర కాలంనాటి వైభవాన్ని తెచ్చే అంశాన్ని ఆ లేఖలో ప్రస్తావించాడు. గౌలగుంట (జమలమడుగు) గోరాపూర్ (చెన్నూరు), హుస్సానపూర్ (దూపాడు) లలో కొత్తగా వజ్రాల గనులను ప్రారంభించాలని బోర్డుకు ప్రతిపాదించాడు. అవకాశం కల్పిస్తే ఒక సంవత్సర కాలంలో కనీసం 30 గనులు తెరిచే అవకాశం ఉందని చెప్పాడు.

గనులలో ఒక పగోడా బరువుకన్నా పెద్ద వజ్రాలు ప్రభుత్వానికే చెందుతున్నాయని నియమం పెడదామన్నాడు. చిన్న వజ్రం విలువలో 2.25% సొమ్ము ప్రభుత్వానికి కట్టాలని ప్రతిపాదించాడు. ఒక్కో గనికీ నెలకి 1 పగోడా 2 పణాల కనీస అద్దెగా ఉండాలన్నాడు.

ప్రతీ గని కార్మికుడికీ 1/12 పగోడా నెల జీతంగా ఇచ్చేట్లయితే 30 గనులకు 24,030 మాత్రమే ఖర్చు అవుతుందని, రాబడి అంతకు ఎన్నో రెట్లు ఉంటుందని లెక్కలు చెప్పాడు. అటు అద్దెడబ్బులతో పాటు ఇటు పెద్ద వజ్రాలు కూడా దక్కుతా యని బోర్డుకు ఆశపెట్టాడు. 20 గనుల యజమానులు నైజాం నవాబుకు 50,00,000 రూపాయలు అద్దె చెల్లించేవారని గుర్తుచేశాడు. మనం 30 గనులు ప్రారంభిస్తే మరింత లాభం అని ఆశపెట్టాడు, కానీ, లండన్ బోర్డు అధికారులు మన్రో ఆలోచనలకు స్పందించలేదు. కాలక్రమంలో వజ్రాల పరిశ్రమ అడుగంటి పోయింది. స్టీన్షమ్ మాస్టర్ లాంటి సర్వేయర్లు వివరించినా లండన్ అధికారులు ఆ పరిశ్రమ జోలికి పోలేదు.

ఇందులో ఆశ్చర్యపడాల్సిందేమీ లేదు. హృదయంతో ఆలోచించే ఏ బ్రిటిష్ అధికారినీ లండన్ ప్రభుత్వం ప్రోత్సహించేది కాదు. తక్షణ రాబడి, తక్కువ పెట్టుబడి సిద్ధాంతాన్ని బ్రిటిష్ పాలకులు అనుసరించేవాళ్లు. అందుకని, ప్రైవేటు యజమాన్యానికి గనుల నిర్వహణ వదిలేశారు. లైసెన్సు పొంది, రాయల్టీ చెల్లించే లైసెన్సింగ్ విధానాన్ని అమల్లోకి తెచ్చారు బ్రిటిష్ అధికార్లు.

1805 లో గ్రంథి రాయసెట్టి అనే గని యజమాని లైసెన్సు ఫీజు కట్టి కడపలో 5 ఎకరాల బంజరు భూమిని కొనుక్కొని అందులో మైనింగ్ జరపడం మొదలుపెట్టాడు. ఇలాగే చెన్నూరు, దూపాడు, జమ్మలమడుగు, కోయిలకుంట్ల, కమలాపురం, గుర్రంకొండ, గుత్తి మొదలైన ప్రాంతాల్లో కొత్తగా వజ్రాల గనులు మొదలయ్యాయి. గనులు తవ్వడంలో నిపుణులైన వారిని గుజరాతు నుంచి తెచ్చుకుని మైనింగ్ లైసెన్సు పొందడం మొదలుపెట్టారు.

1815 లో బళ్లారిలో ఓ ఆరేళ్ల పిల్లవాడికి పొలంలో ఒక వజ్రపురాయి దొరికింది. దాన్ని వాళ్ల నాన్న చూసి బజారుకు తీసుకెళ్లి రహస్యంగా నాలుగు రూపాయలకు అమ్మేశాడు. ఈ రహస్యం తెలిసిన దత్త మండలం కలెక్టర్, దాన్ని కొన్న వ్యాపారిని పిలిచి వెయ్యి రూపాయలు చేతిలో పెట్టి ఎవరికీ చెప్పవద్దని హెచ్చరించి, పంపేశాడట. ఇలాంటి కథలు చాలా జరిగాయి. గనులైతే ప్రారంభించారు గానీ, వజ్రాలు పెద్దగా దొరకలేదు వాళ్లకి. "వజ్రాలను వెదకండి. వజ్రం దొరికితే పదోవంతు ఇచ్చేస్తాం" అని జనాన్ని ఎగదోశారు గనుల యజమాన్లు

అప్పటినించీ జనం పిచ్చెత్తినవాళ్లలా భూమిని పొరలు పొరలుగా తవ్వి జల్లించుకొంటూ, నలకంత వజ్రమైనా దొరక్కపోతుందా అనే ఆశతో బతకడానికి అలవాటు పడసాగారు. కృష్ణాజిల్లా పరిటాలలోనూ ఇదే దృశ్యం! పరిసర భూముల్లో వజ్రాలు వెదుకుతూ జనం కనిపిస్తారు.

కీ॥శే॥ సురవరం ప్రతాపరెడ్డిగారు ఆంధ్రుల సాంఘిక చరిత్రలో కోళ్లూరు పరిటాల వజ్రాల గనుల గురించి ఒక విశేషం రాశారు. ఒకసారి కోళ్లూరులో ఒక దేవుడి విగ్రహం వెలిసింది. బియ్యపు గింజలు తీసుకుని, తమ మూత్రంతో తడిపి

ఆ విగ్రహం మీద వేస్తే, ఎన్ని గింజలు వేశారో అన్ని వజ్రాలు దొరుకుతాయని జనంలో ఒక పెద్ద నమ్మకం బాగా ప్రచారం అయ్యింది. ఆ ఊళ్లో ఒక బీద బ్రాహ్మణుడు మాత్రం ఆ అపచారం తాను చేయనని మొండికేశాడు. అప్పుడు ఒక సాధువు వచ్చి, ఆ బ్రాహ్మణ్ణి, అతని కుటుంబాన్ని ఊరు బయటకు తీసుకువచ్చి, "కోళ్లూరు ఎలా వెలుగుతోందో చూడు-" అని, తగలబడ్తున్న ఊరుని చూపించి మాయమయ్యాడట !

రాబర్ట్ క్లయివుని ఇండియా నుంచి వెనక్కి పిలిపించి అతని ఆర్థిక నేరాల మీద ఇంపీచిమెంట్ చేసినప్పుడు అతను ఏ మాత్రం సిగ్గుపడకుండా గర్వంగా "There was so much to take from India. I regret that I have taken so miniscule" అన్నాడట !

దోచుకోవడానికి ఇండియాలో చాలా ఉంది, అందులో స్వల్పంగా మాత్రమే దోచగలిగినందుకు విచారిస్తున్నాను" అని !

అభివృద్ధి ఉంటేనే కదా...దోపిడీకి అవకాశం. అభివృద్ధి మూలాలు తెలిస్తే దోపిడీ మూలాలూ తెలుస్తాయి ! ❑



*అంగళ్ల రతనాలు అమ్మినారట ఇచట:: హంపీ బజార్*

# రాయలనాటి పాలనా భాష

కాకతి రుద్రమ నుండి కృష్ణరాయల దాకా నడిచిన సాంస్కృతిక పరిణామాలు తెలుగు భాషా సంస్కృతులకు కొత్త ఒరవడి నిచ్చాయి. ఒక రాజు పోవటమూ, ఆ స్థానంలో వేరొక పాలనా వ్యవస్థ వ్రేళ్ళూనుకోవటం ఆ జాతి భాషా సంస్కృతుల్ని ప్రభావితం చేస్తాయి. పరిణామ చక్రంలో ఇది ఒక భాగం. కొండ లెక్కటం, లోయల్లోకి పడిపోవటం భాషా సంస్కృతులకు సహజ పరిణామాలే !

ఎల్లకాలం ఒకే రాజ్యం సాగదు. పడినా కూడా లేచే సత్తా ఉందా లేదా అనేది ప్రశ్న. తెలుగు భాషా సంస్కృతులు ఆ సత్తా చాటుకున్నవే !

భాషా సంస్కృతుల పరంగా చూస్తే, కాకతీయుల వరకూ పాలనా పరంగా సంస్కృతభాషాధిపత్యమే కనిపిస్తుంది. సంస్కృత భావజాలం లోంచి బయటపడాలని పాల్కురికి సోమనాథాదులు 11వ శతాబ్దిలోనే చేసిన ప్రయత్నాలు ఉద్యమస్థాయి పొందక పోయినా, పాలనా పరంగా తెలుగుపదాలు చేరటం మొదలై, రాయల కాలానికి వచ్చేసరికి తెలుగులో పాలనా భాష అమలైంది.

విజయనగర కాలంలో  వివిధ ప్రభుత్వాధికారులకూ, వారి విధులకూ, విధించిన పన్నులకూ, ఇంకా అనేక పాలనాంశాలకు సంబంధించిన పరిభాషలో తెలుగుదనం పరిమళించటమే కాదు నేటి అవసరాలకూ ఉపయోగిస్తుంది. వాటిని శాసన భాషగానూ, ఫ్యూడల్ భాషగానూ ముద్ర వేసి వదిలేయ కూడదు. వాటిలో అచ్చతెలుగుదనం ఉంది. దాన్ని మనం ఉపయోగించుకో గలగాలి.

**వ్రాయసం :**

వ్రాయసం అంటే లేఖనం (writing). కాకతీయుల తరువాత అది రాయసంగా మారి, రెడ్డిరాజుల కాలంలో 'రాయసం' అనే ఉద్యోగం ఏర్పడింది. ఈ రాయస ఉద్యోగులు ప్రభుత్వ వ్రాత పనులన్నీ (Documentation) చూసే

వారు. ముఖ్యంగా ప్రభుత్వ ఉత్తర్వులను అందరికీ అర్థం అయ్యే భాషలో వ్రాయటం రాయసం గారి విధి. ఇతనికి చక్కని చేతి వ్రాతతో పాటు, ఎక్కువ భాషలు తెలిసి ఉండాలనీ, గంభీరమైన వ్యక్తిత్వం ఉండాలనీ 'సకల నీతి సమ్మతం'లో మడికి సింగన అంటాడు.

ఆనాటి ప్రతీ పదాన్నీ, ప్రతి సాంస్కృతిక అంశాన్నీ పరిశీలిస్తేనే ఆ పరిణామ క్రమం మన కళ్లకు కడుతుంది. సాహిత్యం, శాసనాలు, చరిత్ర ఆధారాలతో పాటు బుడతగీచులు (పోర్చుగీసులు), వళందులు (డచ్చి), పరాసులు (ఫ్రెంచి), ఇంగిలీజుల (బ్రిటిష్) ప్రభావం తెలుగు పరిభాషపైన అధికంగా ప్రసరించింది.

ఇప్పటి కోర్టు పరిభాష ప్రకారం దస్తావేజుల్లో గానీ, వీలునామాల్లో గానీ ఫలానా ఆస్థిని "వ్రాయించి ఇస్తున్నాను" అంటున్నాం. కానీ, క్రీశ. 1556 నాటి ఒక శాసనంలో "కంపిలి మాంగాణి స్వామ్యానకు చెల్లివచ్చే విఠలాపురం శ్రోత్రియం మడిస్థావరం మడి సహధార వోయించ్చి తామ్రశాసనం తీసియిచ్చిన విఠలాపురం గ్రామం ఒకటిన్నీ..." అని ఉంది. వ్రాయించి ఇచ్చాడు-అనటానికన్నా తీసి ఇచ్చాడనటంలో తెలుగుదనం ఉంది. ఇదీ "తెలుగు పరిభాషాయుగం"లో ఒక పరిణామం. మొఘల్ చక్రవర్తుల ప్రభావం, ఇరుగు పొరుగు రాష్ట్రాల ప్రభావాలతో పాటు యూరోపియన్ల ప్రభావం లోంచి బైటపడే చిన్నప్రయత్నం ఇది!

**వ్రాత :**

కన్నుల పండువై / కాకితమందలి వర్ణ పద్ధతులు" అనే శ్రీనాథ కవి వాక్కు (భీ. పు. అ1, ప. 74) కాకితాలపై వ్రాతకు సాక్షి. "దస్త్రాలుం మసిబుర్రలున్ కలములుం / దార్కొన్న చింతంబళుల్" అనే చాటువులో మారిన కాల రీతి కనిపిస్తుంది.

కాకితాల కట్టలు(దస్త్రాలు), మసిబుర్రలు, కలాలు శ్రీనాథుని కాలానికే హస్తభూషణా లైనాయి. మసితో చేసిన సిరాలో తూలిక లేదా కూచిక (కలం) ముంచి వ్రాసేవారు. అంతకుపూర్వం వాడిన 'గంటం' స్టెన్సిల్‌కట్టర్‌లాంటిది. తూలిక క్రోక్విల్‌లాంటిది.

మూల ద్రావిడ భాషలో 'వ్ర్' ధాతువుకి to write అని అర్థం. దాన్నిబట్టే 'వ్రాయు' అనే తెలుగు పదం ఏర్పడింది. అది 'రాయు' కాదు. రాస్తే అర్థం మారిపోతుంది. కాబట్టి వ్రాయటాన్ని గ్రాంథికం అనవద్దు.

"వెసవ సుధా స్థలంబున కవీంద్రులు కొందరు శేముషీ మషీ
రసము మనః కటాహ కుహరంబుల నించి కలంచి జిహ్వికా
కిసలయ తూలికం గొని లిఖింతురు కబ్బము లెన్నగా మహా
వ్యసనముతో నిజానన వియత్తం తాళ పలాశ రేఖలన్"

'వ్రాత గురించి చెప్పిన ఈ శ్రీనాథుని పద్యం సాంఘిక చరిత్ర నిర్మాణానికి చాలా ముఖ్యమైంది (ఆంధ్రుల సాంఘిక చరిత్ర, సురవరం ప్రతాపరెడ్డి) వ్రాయటం అనే ప్రక్రియ కాకతీయుల అనంతరం సులువయ్యింది ! కానీ, దొంగ లెక్కలు వ్రాయటం కూడా సులువయ్యిందట. కొరవి గోపరాజుగారు తన "సింహాసన ద్వాత్రింశిక" లో దొంగలెక్కల రాతగాళ్ల గురించి ఇలా వ్రాశాడు.

"వహి వారణాసి యనగా
మహి బరగిన దిందు కపట మార్గంబు నా
గ్రహమున వ్రాసిన వానికి
నిహపరములు లేవు నరక మెదురై యుండున్" దొంగ లెక్కలు రాసే వాడికి నరకం ఎదురయ్యే ఉంటుందట !

**అక్కౌంట్లు ఇలా వ్రాయాలి !**

"ఒక దెస దెచ్చిన యాయం
బొక దిక్కున చెల్లు వ్రాసి యొక దెస వ్యయ మ
ట్లొక దిక్కున జమ వ్రాసిన
బ్రకటంబుగ వాడు మిగుల పాపాత్ముడగున్"

ఇలా ఆధునికంగా అక్కౌంట్లు వ్రాసే విధానాన్ని కావ్యబద్ధం చేసిన తొలి రచన ఇది. పత్రం మీద ఒక నిలువు వరుసలో జమని రెండో నిలువు వరుసలో చెల్లింపుని వ్రాయాలని సింహాసన ద్వాత్రింశతి గ్రంథంలోని ఈ పద్యం సూచిస్తోంది.

"రాని పైడి చెల్లుట వ్రాయుట, యాయంబు
తక్కువై వ్యయంబదెక్కుడౌట
లెక్క తుడుపు వడుట లిపి సందియం బౌట
చెల్లు మరచుటయును కల్లపనులు"

రాని డబ్బుని వచ్చినట్టు చూపించటం, ఆదాయం తక్కువ వ్యయం ఎక్కువగా చూపించటం, కొట్టివేతలు తుడుపుల్తో వ్రాత అర్థం కాకుండా వ్రాయటం, చెల్లించిన దాన్ని మరిచిపోయి చూపించకపోవటం ఇలాంటివన్నీ కల్లపను లన్నాడు. కరణం నీతిమంతుడైతే మంచి ఉపకరణం అవుతాడంటాడు కవి కొరవి గోపరాజు.

పాలనా వ్యవహారాలకు సంబంధించి విజయనగర ప్రభువుల కాలంనాటి శాసనాలలో కనిపించిన కొన్ని పారిభాషిక పదాల పరిచయం ఇక్కడ అందిస్తున్నాను:

- **అంత్తరమన్నీలు :** కాకతీయుల కాలంలో 72 మంది ఉన్నతాధికారుల్ని నియోగించే అధికారం బాహత్తర నియోగాధిపతులకు ఉండేది. గణపతి దేవుడి కాలంలో కాయస్థ గంగయ, సాహిణి, రుద్రమకాలంలో జన్నిగ దేవుడు, త్రిపురాంతక దేవుడు, పోకల మల్లియ ప్రెగ్గడ మొదలైన వాళ్ళు ఈ బాహత్తర నియోగాధిపతులుగా ప్రసిద్ధులు.

  రాయల కాలానికి ఈ పదవి తన సంస్కృత రూపం వదిలి తెలుగుదనాన్ని సంతరించుకుని “అంత్తరమన్నీ”లుగా మారింది. మన్నీడు, మన్నియడు అంటే, మన్ను + ఈడు=ప్రభువు, మన్నెపుదొర దీన్నిబట్టే ఏర్పడ్డాయి.

  సుమతీ శతకకారుడు “ఎన్నడుగుడువక, కట్టక, తన్నేమరి కూర్చు ధనము ధరలో నెపుడున్, మన్నీలకు జూదరులకు, కన్నెలకును బోవుచుండు గదరా” అంటాడు. కడుపుకు తినకుండా, పన్నులు కట్టకుండా, ఏ సుఖమూ అనుభవించకుండా దాచిన డబ్బు మన్నీలకు, జూదరులకు, వేశ్యలకు పోతుందంటాడు.

  కానీ, రాయలవారి మన్నీలు మన్నన కలిగిన వారు. రాయవాచకంలో “తమ దొరల పాలిటి కర్తారు వల్లసున్న అంత్తర మన్నీలమై అరువై యేండ్ల బట్టినీ్న...” అనే వాక్యాన్ని బట్టి, ఆంతరంగికులు, నమ్మకస్తులు, ప్రభు నిర్ణయాలను ప్రభావితం చేయగల ఉద్యోగస్థుల్ని నియమించే ఉన్నత స్థాయి ఎంప్లాయిమెంటు ఆఫీసర్లను అంత్తర లేదా అంతరమన్నీ లన్నారు.

- **అడపంగారు :** రిసెప్షనిష్టు, సిఈవోని అడపాధికారి అనవచ్చు. అడ్డ సూరప్పనాయణిం గారి పేరు ఓ శాసనంలో కనిపిస్తుంది. ఆకుల్ని సక్రమంగా

ఇచ్చి, ఒప్పందాలను చట్టపరంగా, హేతుబద్ధంగా వ్రాయించి సంతకాలు చేసే లేదా చేయించే ఉన్నతాధికారి అడపంగారు,

- **ఆకు :** విజయనగర శాసనాలలో ఒప్పందాల పత్రం-దస్తావేజుని 'ఆకు' అనే వాళ్లు. ఆకుల్ని రాసుకునేందుకు తగ్గట్టుగా తయారు చేసుకునే వాళ్లు. ఈ ఆకు తాళపత్రమో భూర్జపత్రమో అయి ఉంటుంది. ఎగ్రిమెంట్ సూచకంగా తమలపాకు లిచ్చుకొనే ఆచారానికీ, దస్తావేజుని (డాక్యుమెంట్) ఆకు అనటానిగల సంబంధాన్ని ఇక్కడ గుర్తించాలి.

- **అధిష్ఠానకర్తలు :** రాయల కాలంలో ఇదొక కొత్త మార్పు. ప్రభువునే నియమించే అధికారాలు గల అత్యున్నత స్థాయీ సంఘం ఇంకొకటి ఉండేది. "అధిష్ఠాన కర్తలు" అనేవాళ్లు వీళ్ళని. "కృష్ణరాయలవారు తాము పెద్దల మైతిమి తమ మర్యాదగా రాజ్య పరిపాలనం జేసేటందుకు పట్టాభిషేకం అధిష్ఠానకర్తల్ శేయమని మంచి వేళ జూచి ముద్దుటుంగర మిచ్చినారు..." అని రాయవాచకంలో దీని ప్రస్తావన కనిపిస్తుంది. తన వారసుడిని ఎంపిక చేసి అతని పట్టాభిషేకం జరిపించ వలసిందిగా అధికారం ఇస్తూ, ముద్దుటుంగరం అంటే రాజముద్రిక ఇచ్చినట్టు ఈ వాక్యం వలన తెలుస్తోంది. ఎలక్షన్ కమీషన్ లాంటి ఏర్పాటు ఇది. ఒకప్పటి రోమన్ వ్యవస్థలోని కొల్లేజియంకు రాయల కాలంనాటి రూపం ఇది !

- **ఆరదాసు :** లిఖితపూర్వక ఫిర్యాదు.

- **అవసరంగారు :** పర్సనల్ అసిస్టెంటు (PA) లాంటి పదవి ఇది. అవసరాల ఇంటి పేరు గలవారున్నారు. ప్రభువు ఆ రోజు పాల్గొనవలసిన కార్యాలను గుర్తుచేసే అధికారి.

- **అడ్డలి :** అమానతు (deposit), ఉంచబడినది అని !

- **ఆటపన్ను :** వినోదపన్నుని (entertainment tax) ఆ రోజుల్లో ఆటపన్ను అని అచ్చతెలుగులో పిలిచారు.

- **ఆయగారలు :** ఈ పదానికి డా॥ కె విద్యావతి చక్కని వివరణ ఇచ్చారు: పురోహితుడు, కరణం, రెడ్డి, కమ్మరి, వడ్ల, కుమ్మరి, మంగలి, చాకలి, తలారి, మాదిగ, ఆనకల, తమ్మల ఇలా 12 మందిని ప్రభుత్వం నియమించి ఒక గ్రామాన్ని నిర్మిస్తుంది. ఈ 12 మందిని ఆయగార్లు లేదా ఆయగాండ్లు అంటారు. వీళ్లీ వృత్తిలో వంశపారంపర్యంగా కొనసాగుతారు.
- **ఇల్లరి :** ఇంటిపన్ను
- **కందాయం :** వాణిజ్యపన్ను
- **కట్టిగె :** వాణిజ్య పన్నుల అధికారి. "ఇమ్మడి నరసింహ్వరాయల కట్టిగె కసవి నాయని కుమారుండు నరసనాయని గారు" అనే శాసన పాఠాన్ని బట్టి కట్టిగెలు (కట్టిగలు) ప్రభుత్వాదాయాన్ని పెంచే అధికారులు.
- **కడ్డాయం :** కడ్డాయం అంటే, పన్నుకట్టి తీరాలనే శాసనం
- **కరణం :** గ్రామాల ఆదాయ వ్యయాల లెక్కలు వ్రాసే అధికారి. ఊరకరణం అనే పదం కూడా గౌరవవాచకంగా రాయలకాలం నాటి శాసనాల్లో కనిపిస్తుంది.
- **కాణాచి :** వంశపారంపర్య హక్కు. కాణాచి లేదా కాణయాచి, మిరాసి అనికూడా పిలుస్తారు, చిరకాలవాస స్థానము.
- **కైజీతం :** daily allowance, బత్తా / బత్తెం, రోజు కూలి, బేటా Dearness Allowance (పాల్కురికి సోమనాథుదు కూడా దీన్ని ప్రయోగించాదు. చిరకాలంగా వాడుకలో ఉన్న పదం)
- **గానుగరి :** నూనె గానుగ మీద విధించే పన్ను
- **గ్రామసభ :** గ్రామపంచాయితీ.
- **గౌని :** కోటప్రధాన ద్వారాన్ని గవని అంటారు. దానికుండే చిన్న ద్వారాన్ని దిడ్డి అంటారు. పదకవితల్ని దిడ్డికంతలని ఈసడించారు కదా ! ఈ గవనిని కావలి కాసే మిలిటరీ అధికారి గౌని. చీఫ్ సెక్యూరిటీ గార్డ్. 'గౌని తాతనగారు' 77 దుర్గాల మీద గౌనిగా ఉన్నాట్ట.

- **జయకమ్మ :** తీర్పు పత్రం, జడ్జిమెంటుకి ఎంత అందమైన పేరో గమనించారా? తెలుగులో పారిభాషిక పదాలు లేవనవద్దు, ఉన్న వాటిని ఎలా ఉపయోగించాలా అని ఆలోచించాలి.
- **తలారి :** గ్రామాల్లో శాంతిభద్రతల్ని కాపాడే రూరల్ పోలీస్ అధికారి.
- **తొలికట్టు :** advance payment – నిర్ణయించబడిన ధరకు అంగీకరిస్తూ ముందుగా చేసే చెల్లింపు
- **తీర్పరి / తగవరి :** తీర్పరి అంటే, న్యాయమూర్తి. కాకతీయుల కాలంలో వీళ్లని ప్రాడ్వివాకులని పిలిచేవాళ్ళు. సంస్కృత ప్రాబల్యం క్రమేణా తగ్గేకొద్దీ ఈ పారిభాషిక పదాల్లో తెలుగుదనం ఏర్పడసాగింది. తీర్పరి, తగవరి అనే పేర్లు విజయనగర కాలంలో ఏర్పడ్డాయి. "జంతఅ నాంటి వీటి అంగడినాయని నగిశెట్టి కొడుకు తీర్పరి గంగిశెట్టి.." (క్రీ.శ. 1400, S 11-6-878- శాసనం) జడ్జి, మేజిస్ట్రేట్, జస్టిస్ లాంటి పేర్లే ఇవి. వీటిని నేటి అవసరాలకు తగ్గట్టుగా ఉపయోగించవచ్చు.
- **దండు :** దండు, దండాధీశ్వరుడు, దండనాథుడు, దండనాయకుడు, దండాధికారి, దండాయి లేదా దణాయి అనేవి మిలిటరీ పదాలు. దణాయి అంటే రక్షణ మంత్రి.
- **దళం :** దళం, దళాధీశ్వరుడు, దళనాథుడు, దళనాయకుడు, దళాధికారి, దళవాయి లాంటి పేర్లను పోలీసు వ్యవస్థకు సంబంధించినవిగా భావించవచ్చు. దళవాయి ఇప్పటి హోంమంత్రికి సమానం కావచ్చు.
- **దొమ్మరికాసు :** దొమ్మరులు ఆడిన ఆటని చూసి, మెచ్చి ప్రజలు రొఖ్ఖంగా ఇచ్చిన మొత్తాన్ని "దొంబరికాసు" అన్నారు.
- **నిబాతకట్నం :** బేరాలు లేవు, fixed price, no bargain అని.
- **పడనాటిపన్ను :** ఎగుమతి దిగుమతి సుంకం,
- **పర్వత భోగం :** కొండమీద కట్టెలు కొట్టుకునేందుకు విధించే పన్ను,
- **పాలెగార్లు =** కాకతీయుల కాలంలో నాయంకరుల వ్యవస్థ ఉండేది. రాయల కాలానికి వీరి స్థానంలో పాలెగార్లు ఏర్పడ్డారు. పాలెగార్ల చేతుల్లో సైనిక

వ్యవస్థ కేంద్రీకరించి ఉండేది. సైన్యం లేదా దండు నిలిచే స్థలాన్ని పాలెం అన్నారు. పాలెగార్ల ఆధీనంలోని సైనిక బలగాలు విడిది చేసే చోటు.

- **పుల్లరి :** ఖాళీగా ఉన్న భూముల్లో పశువులను పచ్చిక మేపుకున్నందుకు చెల్లించే పన్ను
- **బొక్కసంగారు :** కోశాధికారి, బొక్కసం తిమ్మరాజనింగారు ప్రసిద్ధుడు
- **బోయసుంకం :** ప్రభుత్వ అడవుల్లో జీవించేవారు చెల్లించే పన్ను
- **బంటుబడి :** బంటు పైన విధించే ఆదాయపు పన్ను
- **మణిపైకం :** హోల్ సేల్ వర్తకం పైన విధించే పన్ను, ఇది ఈనాటి VAT తరహా పన్ను లాంటిది.
  - **మగ్గరి :** మగ్గం మీద విధించే పన్ను
  - **మడిసుంకం :** ఓడని సముద్రంలో లంగరు వేసినందుకు చెల్లించే పన్ను,
  - **మాదారిట్కం :** మేదరిపన్నుని మాదారిట్కం అన్నారు.
  - **ముద్రాయం :** ముద్ర వేసినందుకు వచ్చిన ఆదాయం,
  - **మిశానా :** జీవనభృతి,
  - **ముద్ర సుంకం :** అమ్మకానికి తెచ్చిన సరుకు మీద ముద్ర వేసినందుకు విధించే పన్ను.
  - **మాగసుంకం :** దానమివ్వబడ్డ గ్రామం గుండా సరుకు తీసుకు వెళ్ళినందుకు వ్యాపారులు ఆ గ్రామానికి చెల్లించే సుంకాన్ని మాగసుంకం లేదా మార్గ సుంకం అన్నారు. ఒక విధంగా టోల్ గేట్ లాంటి ఏర్పాటిది.
  - **ముదల :** జీవోలమీద సంతకం చేసే ప్రభుత్వ కార్యదర్శి. ముదల అంటే, An order, command, ఆజ్ఞ. అని బ్రౌన్ నిఘంటువు. ముదలపెట్టు: To command, ఆజ్ఞాపించు అని ! “రామరాజుగారి ముదల అయిన మరో అధికారినంద్యెల తిమ్మరాజు...” అనే శాసన పాఠాన్ని బట్టి ముదలపెట్టే అంటే ప్రభుత్వ ఉత్తర్వులిచ్చే అధికారిని కూడా ముదల అనే పిలిచేవాళ్లని తెలుస్తోంది.

- **రాయసం :** ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి. రాజాజ్ఞలను లిఖిత పూర్వకంగా పంపే అధికారి కావచ్చని డా॥ కె.విద్యావతి వ్రాశారు. "కృష్ణరాయ రాయసం శ్రీపతి..." అని ఒక శాసనంలో ఉంది.
- **రెడ్డి :** గ్రామపాలనాధికారి. విలేజి ఆఫీసర్
- **వహి :** "....తిరుమల రాజపురపు అగ్రహారమందు కట్టడిచేసిన వివరం: రామరాజయ్య వారికిన్ని విన్నపం చేశి 'వహి' వ్యంతరువు చేశి తామ్రశాసనంన్ను అప్పపండితులకు ఇచ్చి సిద్ధరాజు తిమ్మరాజు గారికి ఆనతిస్తేను తిమ్మ రాజయ్య వారు..." సదాశివరాయల శాసనం (డా॥ కె.విద్యావతి) వహి అంటే ఊరి లెక్కలు రాసే పుస్తకం. ఫారసీలో బహి అంటారు. బహీఖాతా అంటే, లెక్కలు రాసే చిట్టా. పారసీక బహి నుండే ఈ 'వహి' వచ్చి ఉండవచ్చు. దినవహి అంటే రోజువారి లెక్కలు రాసే పుస్తకం.
- **వాకిలి :** కావలికి సంబంధించిన అధికారి. సెక్యూరిటీ అధికారి లేదా టైమ్ కీపర్. వాకిలి అడ్డప్పనాయణి ప్రసిద్ధుడు.
- **స్థల భరితం :** దేవదాయ ఆస్తులపై విధించే పన్ను
- **సుంకాధికారి :** సుంకాలు వసూలు చేసేవాడు. సుంకమణి. బిల్లుకలెక్టరు లాంటి ఉద్యోగి
- **సువర్ణాదాయం :** రొఖ్ఖపు చెల్లింపు ద్వారా చేకూరిన ఆదాయం.
- **సిల్లఱ సుంకం :** సుగంధ ద్రవ్యాల పైన విధించే పన్ను.
- **తేవు సుంకం :** రేవుని దాటించినందుకు విధించే పన్ను,
- **సుర సుంకం :** మద్యం అమ్మకాలపై పన్ను, రంటబడి / ఏటబడి, ఎంటబడి–యేటబడి అంటే, వార్షిక పన్ను.
- **హజారం :** హజారం అంటే, కొలువు, కూటము, (a court),

* **హజారముఖము :** న్యాయమూర్తి ఉన్నతాసనం,

"విజయనగర శాసనాలు : భాషా సాంస్కృతిక సాహిత్యాంశాలు" సిద్ధాంత గ్రంథంలో డా ॥ కె.విద్యావతి పాలనాపరంగా విజయనగర శాసనాలలో తరచూ కనిపించే కొన్ని పారిభాషిక పదాల పట్టిక ఇచ్చారు.

వీటిలో : అనగ్రయాలు, అమరము, ఉద్ధార కాంశం, ఉప్పర సిద్ధాయం, ఇడిగి సిద్ధాయం, కవుల్లాయెము, కులస్వాములు, కులసిద్ధాయాలు, జాతి కట్టు, న్యంత్యాగ వర్తనలు, దొరలు, పాలు పంప్పు, పూర్వమరియాద, ప్రభుమాన్యమడి, బందెలు, భూమివారు, మాగాణీస్వామ్యం, మూల దీపాలు, మేరగాండ్లు, యేకభోగం, రామడి సిద్ధాయం, రెడ్డితనం, వీసబడి, వూడిగం, రాచభోగం, వెచ్చం, వెట్టివేములు, వొప్పమి, సకలాయం... ఇలా అనేకం ఉన్నాయి.

శాసనాల్ని చదివి ప్రయోజనం ఏమిటి...? అవి మనకు ఏ పాఠాలు నేర్పుతున్నాయి? ఈ ప్రశ్నలకు సమాధానాల్ని చరిత్రవేత్తలు జనసామాన్యానికి వివరించాలి. చరిత్ర పరిశోధనలు కేవలం చారిత్రక వేత్తలకే కాదు, ప్రజలకి కూడా !

చరిత్ర ప్రజలకోసం ! చరిత్ర చెప్పి అది నేర్పే పాఠాన్ని కూడా వివరించాలి. వాటిలోంచి మన భాషా సంస్కృతులకు ఉపయోగపడే అంశాల్ని ప్రచారంలోకి తేవలసిన అవసరం కూడా ఉంది. ❑



సింహాచలంలో రాయలవారి దానశాసనం

# రాయలవారి తిమ్మరుసు

కృష్ణదేవరాయలవారి తాతముత్తాతల మూలాలు ఎక్కడివైనా, ఆయన మాత్రం చంద్రగిరిలోనే పుట్టి పెరిగాడు. చంద్రగిరిలోనే చదువుకున్నాడు. తెలుగు, సంస్కృత భాషల మీద ఎవ్వరికీ తీసిపోనంత పట్టు సంపాదించుకున్నాడు. అదనంగా కన్నడ, తుళు, తమిళం, మళయాళం కూడా తెలిసిన వాడు.

రాయలవారి ముత్తాత తిమ్మరాజు తుళువ రాజవంశీకుడు. ఆయన మాతృభాష తుళు. వరాహపురాణంలో తుళువ రాజవంశం ప్రస్తావనలున్నాయి. ఈ తిమ్మరాజుగారు తుళు దేశాన్ని వదిలి, యవ్వన కాలంలోనే చంద్రగిరి వచ్చి ఇక్కడ స్థిరపడ్డాడు. ఆయన కుటుంబం అంతా చంద్రగిరిలో ఆంధ్రులుగా జీవించారు. ఆంధ్రుల అమ్మాయిల్ని వివాహం చేసుకుంటే వారికి పుట్టే సంతతికి మాతృభాష ఆంధ్రమే అవుతుంది కదా ! ఆ విధంగా తుళు రాజవంశీకుల సంతానంలో తెలుగు మాతృభాషగా కలిగినవారు జన్మించారు.

తుళువవంశ రాణుల పేర్లు చూస్తే ఈ విషయం స్పష్టం అవుతుంది. బుక్కమ్మ, తిప్పమ్మ, నాగమ్మ, ఓలమ్మ, తిరుమలమ్మ చిన్నాదేవి వీళ్ళంతా తుళువ రాణులే ! పదహారణాల తెలుగమ్మాయిలు.

మిగిలిన వారి సంగతి అలా ఉంచితే, నందిమల్లయ్యని ఘంట సింగయ్యని తుళు రాజులే పోషించారు. నరస రాయలు వరాహపురాణం, వరలక్ష్మీ కళ్యాణం, నరసింహ విజయం కావ్యాలను కృతి పొందాడు. చెన్నకవికి వీరనరసింహరాయలు అగ్రహారం ఇచ్చాడు. కృష్ణదేవరాయలు పారిజాతాపహరణం మనుచరిత్రలను కృతి పొందటమే కాకుండా స్వయంగా ఆముక్తమాల్యద కావ్యాన్ని తాను తెలుగులోనే రాయటాన్ని ఒక దైవాదేశంగా భావించి మరీ వ్రాశాడు. ఇది తుళువంశ ఘనత

సంస్కృత తెలుగు పదాల మిశ్రమంగా ఉన్న భాష – చెవికింపైన భాష– కాబట్టి తెలుగుని కర్ణాటభాష అన్నాడు శ్రీనాథుడు. రాజధాని భౌగౌళికంగా కన్నడ భూభాగంలో ఉంది కాబట్టి, ఐదు భాషల కూటమిగా ఉన్న విజయనగర రాజ్యాన్ని కర్ణాటరాజ్యం అని వ్యవహరించారు. ఈ రాజ్యంలో ప్రాభవాన్ని పొందిన సంగీతాన్ని కర్ణాటక సంగీతంగా వ్యవహరించారు. కర్ణాటక సంగీతానికి పుష్టినిచ్చింది తెలుగు వాగ్గేయకారులే !

**మంత్రివర్గంలో తిమ్మరుసు**

చిట్టి గంగన మంత్రి అనే గంగనామాత్యుడు తిమ్మరుసులోని మేథాశక్తిని గుర్తించి మంత్రిత్వంలోకి తెచ్చాడని చెప్తారు. నాదిండ్ల చిట్టి గంగనామాత్యుఁడు సామాన్యుడు కాదు. మహామంత్రిశేఖరుడు. మాచయగారి మల్లన కవి తన రాజశేఖర చరిత్రంలో :

“సాళువనారసింహమనుజ ప్రభుకార్యకళాదురంధరుం
డై లవణాబ్ధివేష్టిత ధరాదిపదుర్మత మంత్రమంత్రిశుం
డాలవితానకేసరి యనంగసమాన రూపరే
ఖా లలితాంగుఁ డట్టి చిటిగంగన యొప్పుగుణానుషంగుఁడై.” అనే పద్యం ఇందుకు సాక్ష్యం.

చిట్టి గంగనామాత్యుడి మరణం తరువాత తిమ్మరుసు సాళువ నరసింహ రాయల ప్రధాన మంత్రి అయ్యాడు. ప్రౌఢదేవరాయలపై తిరుగుబాటు చేయించి సాళువ నరసింహరాయల్ని రాజుని చేసిన ఘనత కూడా తిమ్మరుసుదేనని మరికొందరు చెప్తారు.

సాళువ నరసింహరాయల తరువాత అతని ఇద్దరు కొడుకులూ మనుమడూ స్వల్పకాలం రాజ్యం ఏలారు. తరువాత తుళువ నరస రాయలు తిరుగుబాటు చేసి తిమ్మభూపాలుడు, అతని తరువాత అతని రెండవ కొడుకు రాజ్యం చేశారు. చివరికి తుళువ నరసరాయలకు రాజ్యం హస్తగతం అయ్యింది. తుళువ నరసరాయల

తర్వాత పెద్దకొడుకు వీరనరసింహరాయలు, ఆయన తరువాత రెండో కొడుకు శ్రీకృష్ణదేవరాయలు రాజ్యానికొచ్చారు. ఈ అందరికీ తిమ్మరుసు మంత్రిత్వం వరుసగా అందింది.

**రాయలవారి జననం**

"వారలలోఁ దిప్పాంబ కు
మారుఁడు పరిపంథికంధిమంథాచలమై
వీరనరసింహరాయఁడు
వారాశివరీత భూమివలయం బేలెన్."
"వీరశ్రీనర సింహశౌరి పిదప న్విశ్వక్షమా మండలీ
ధారంధర్యమునన్ జనంబు ముదమంద న్నాగమాంబాసుతుం
డారూఢోన్నతిఁ గృష్ణరాయఁడు విభుండై రాజ్యసింహాసనం
బారోహించె విరోధులు న్గహన శైలారోహముం జేయఁగన్"

పారిజాతాపహరణ కావ్యంలో తిమ్మనామాత్యుడు రాయలవారి జననాన్ని ఈ పద్యాలలో వివరించాడు: నరసింహరాయలకు, నాగమాంబకు రాయలు జన్మించాడని దీని భావం. రాయలు తల్లి నాగలాంబ గండికోట పాలకుడు పెమ్మసాని నాయకుల ఆడపడచు.

విజయనగర ప్రభువుల్లో 16వ వాడు వీర నరసింహరాయలు. ఆయనకు ముగ్గురు భార్యలు. తిప్పాంబ ద్వారా వీరనృసింహ రాయలు, నాగులాంబ ద్వారా కృష్ణదేవరాయలు, ఓబాంబ ద్వారా రంగదేవరాయలు, అచ్యుతదేవరాయలు పుట్టారని చెప్తారు.

రాయల జననం ఫలానా తేదీన అనటానికి కచ్చితమైన ఆధారాలేవీ లేవు. ఎక్కువ మంది అభిప్రాయం ప్రకారం 1471 జనవరి 17న జన్మించాడని ! 1529 అక్టోబరు 17న మరణించే నాటికి 58 యేళ్లవాడు అనేది ఎక్కువ మంది ఆమోదించిన విషయం కాబట్టి రాయలవారి జననం 1471లో జరిగి ఉండాలి. ఆయన 1509లో తన 38వ యేట పట్టాభిషిక్తుడయ్యాడు.

## రాయలవారి ఇంటిపేరు

తెలుగు వారికి మాత్రమే, ఇంటిపేరు ఉంటుంది. రాయలకు ఇంటిపేరు, ఊరిపేరు ఉన్నాయి. అల్లసాని పెద్దన్న ఇలా వ్రాశాడు :

"సంపెట నరపాల సార్వభౌముడు వచ్చి / సింహాద్రి జయశిల చేర్చు నాడు
సెలగోలు సింహంబు చేరి ధిక్కృతి గంచు / తల్పుల కరుల ఢీ కొల్పునాడు..."

"సంపెట నరపాల అనటం ద్వారా రాయల ఇంటి పేరు సంపెటవారనీ, సెలగోలు సింహమంటూ, కృష్ణరాయల గ్రామం సెలగోలు అనీ, సూచించాడు. సంపెట వారు తెలుగువారు. సమ్మెట, సంబెట అని నామాంతరాలు. సమ్మెట ఇంటిపేరు క్షత్రియ, వైశ్య, వెలమ, కమ్మ ఇతర ఓబీసీ కులాలో కన్పిస్తుంది. క్రీ.శ. 1417 ప్రాంతంలో కడపజిల్లా పులివెందుల తాలూకా పేర్నిపాడు పాలించిన సమ్మెట సోమనృపాలుడు (2) కడప జిల్లా, జమ్మలమడుగు తాలూకా గుండ్లూరు పాలించిన సమ్మెట లక్కయదేవని కుమారుడు సమ్మెట రాయదేవుడు (సంగమవంశీకుడు ఇతడు) ప్రౌఢదేవరాయల సామంతులే.

వెలుగోటి వంశావళిలో పేర్కొన్న క్రీ.శ. 1361 నాటి సమ్మెట కొండ్రాజు, సాళువ నరసింహరాయల సమకాలీనులైన సమ్మెట శివరాజు, సమ్మెట వీరనరసింహరాజు (ఎర్రపాడు ప్రభువులు), సింగభూపాలుని కుమారుడు అనపోతానీడు గెల్చిన సంబెట భూనాధుడు బహుశః సమ్మెట సోమనృపాలుడు (వెలుగోటి వంశావళి – 'సంబెట భూనాథ సప్తాంగ హరణ') వీరంతా రాయల వంశీకులే.

## పట్టాభిషేకానికి ముందు...

గురజాడ శ్రీరామమూర్తి గారు తొలినాటి విమర్శకుల్లో ముఖ్యులు. ఆయన వ్రాసిన కవిజీవితములు గ్రంథంలో చాలా విలువైన విషయాలున్నాయి. పట్టాభిషేకానికి ముందు రాజ్యానికి, ప్రభువుకు విధేయుడైన ఒక యోధుడుగా కృష్ణదేవరాయలు నిర్వహించిన పాత్ర గురించి విపులంగా వ్రాశారీ గ్రంథంలో : "ఆ నరసింహ దేవరాయనికి పెద్దకుమారుఁ డైనవీరనృసింహదేవరాయల కతఁడు

పట్టాభిషేకముంజేసి కృష్ణరాయలం బిలిచి వీరనృసింహదేవరాయని చేతికి నొప్పగించి ఈ కృష్ణరాయని కూడ నుంచుకొని నీవు సకల కార్యములు నడిపింపుము. అట్లైన నీకు కీర్తి ప్రతిష్ఠలు రాఁగలవు. అనిచెప్పఁగా నరసింహ దేవరాయలును కొన్ని దినములు కృష్ణరాయని దగ్గఱ నుంచుకొని రాజ్యవ్యవహారము చేయుచు వచ్చెను. ఇట్లుండఁగా వీరనృసింహరాయఁడు బాలుఁడౌటచేతను, వ్యవహార దక్షత తక్కువయై యుండుటచేతనుఁ ఇతని తండ్రి రాజ్యకాలములో పన్నిచ్చుచు వచ్చిన రాజులీతనికి పన్నిచ్చుట మానివేసిరి.

ఇట్లుండ వీరనరసింహరాయఁడు తనతమ్ముఁడగు కృష్ణరాయని బిలిచి యిట్లనియె. మనదేశమునందుండు రాజులిదివఱకు భృత్యులై యుండి కప్పములం గట్టుచుండిరి. ఇపుడు మనము పిన్నల మవుటచేత లక్ష్యము చేయక వీరనరసింగరాయఁడు శూరుఁడని భయమున పన్నిచ్చినారము గాని యీ పిల్ల వాండ్రకుంగూడ పన్నిచ్చెదమా అని చెప్పి శఠించినారు. కావున సర్వసేనావృతులమై మనలో నొక్కఁడు శత్రువులం జయించుటకు వారిదేశములకుం బోవలయును. కావున నీరాజధానిని గనిపెట్టికొని నీ వుండుము. నేను బోయి శత్రువులం జయించి వచ్చెద నని పలికెను.

అపుడు కృష్ణరాయలు లేచి అంజలిబంధముం జేసి “నే నుండఁగ మీరు దండయాత్రకుఁ బోనేల? యోఁచించ వలయును. నేను పోయి శత్రులం జయించి కప్పములం గట్టించుకొని వచ్చెదను” అన వీరనృసింహదేవరాయలు కృష్ణరాయనితో నిట్లనియె. “నీవు చిన్న వాఁడవు. పదియాఱు సంవత్సరములే నీకైనవి. ఇట్టి నీవు యుద్ధములకుం బోఁగూడదు. నీవు కోటం గనిపెట్టి యుంట మంచి దని చెప్పగాఁ గృష్ణరాయం డందులకు సమ్మతింపక తానే యుద్ధయాత్రకై తరలెను.”

రాయల అన్నదమ్ములు రామలక్ష్మణుల్లా ఇంత అనుబంధంగా ఉన్నారన్నదే గురజాడవారి నిరూపణ. విజయనగరసామ్రాజ్యంలో రాచరిక వ్యవస్థ భిన్నమైనది. రాజును, రాజ్యపాలనను నిర్ణయించే అంతర్ మన్నీలనే హైకమాండ్ ఉన్న పటిష్టమైన పాలనా వ్యవస్థ అది. కుట్రలు, కుతంత్రాలకు కొరత లేనప్పటికి రాజు కావటానికి ఎంపిక విధానం ఒకటి ఉండేది. రాజు దానికి బద్ధుడు కూడా !

**తిమ్మరుసు జననం**

తిమ్మరుసు తల్లి లక్ష్మమ్మ నాదిండ్ల వారింటి ఆడపడుచు. చంద్రగిరిలో పుట్టాడని మాత్రమే ఎక్కువ మంది చెప్తారు. రామరాజభూషణుడి రచనలుగా భావిస్తున్న రెండు చాటు పద్యాల్లో తిమ్మరుసు తొలి జీవితం ఎంత దుర్భరమైనదో తెలుస్తుంది. ఆచార్య కె ఎ నీలకంఠశాస్త్రి Further Sources Of Vijayanagara History గ్రంథంలో కొన్ని వివరాలు ఉన్నాయి.

"గుత్తింబుల్లెలు కుట్టి చంద్రగిరిలో గూడెత్తి, పెన్గొండలో
హత్తి స్సత్రమునందు వేఁడి బలుదు ర్లాధీశు తాంబూలపుం
దిత్తుల్మోసి పదస్థులైన ఘనులన్ దీవిం....

అంటూ భట్టుమూర్తితిమ్మరుసు మీద ఒక పద్యం అంతవరకూ చెప్పగా వెంటనే తిమ్మరుసు మెడలో హారం తీసి ఆయన మెడలో వేశాడని, "........ .... ...... దీవించెదన్ / మత్తారాతి యయాతి నాగసుతున్ మంత్రీశ్వరున్ దిమ్మనన్" అని పద్యాన్ని పూరించాడనీ ఈ చాటువు చెప్తోన్న కథ, ఈ పద్యాన్ని బట్టి తిమ్మరుసు తల్లి నాగమ్మ అని తెలుస్తోంది.

"అయ్య వనిపించుకొంటివి
నెయ్యంబునఁ కృష్ణరాయ నృపపుంగవువే
నయ్యా నీ సరి యేరీ
తియ్యని విలుకాడవయ్య ! తిమ్మరుసయ్యా !" అంటూ వెంటనే మరో పద్యం చెప్పాడు.

చాటువుల్లో చరిత్ర చాటుమాటుగానే ఉంటుంది. దానిలోని విషయమే ప్రధానం. సాళువ తిమ్మరుసు గుత్తినగరంలో విస్తళ్ళు కుట్టుకుని జీవించే కుటుంబంలో జన్మించాడు. తరువాత విస్తళ్లతో పాటు భోజనం కూడా అందించే వృత్తిని చంద్రగిరిలో ప్రారంభించాడు. తర్వాత పెనుగొండలో ధర్మసత్రం నిర్వాహకుడుగా ఉన్నాడు. నెమ్మదిగా కొన్ని సంస్థానాల్లో తాంబూల కరండం అందించే అడపంగారి ఉద్యోగం

చేశాడు. వీరనరసింహరాయల దగ్గర నమ్మకమైన మంత్రిగా కుదిరాడు. రాయల వారిని రాజుని చేసి మహామంత్రి పదవిని అధిరోహించాడు. తిమ్మరుసుకు సాటి రాగల మరో మంత్రి లేనే లేదని రాయలవారితో అప్పాజీ అని పిలిపించుకున్నాడు.

ఈ చాటువును వినగానే మన పండితులు భట్టుమూర్తిని తిమ్మరుసు ఎప్పుడో అవమానించి ఉంటాడని, ఆ కోపంతో ఆకులు కుట్టుకుని బతికిన దరిద్రుడివనే అర్థంలో ఈ పద్యాన్ని మొదలు పెట్టాడనీ, తిమ్మరుసు మెళ్ళో నగ తీసి ఇచ్చే సరికి మాట మార్చి పొగుడుతూ ముగించాడనీ ఓ వక్రభాష్యం చెప్పారు. అళియరామరాజు ఏలుబడి కాలం నాటివాడు రామరాజభూషణుడు. ఆయన రామరాజభూషణు డయ్యింది వసుచరిత్ర కావ్య రచన తరువాత ! అప్పటికి తిమ్మరుసు జీవించి ఉండే అవకాశమే లేదు.

**“అరుసు” తెలుగుపదమే !**

వరిబియ్యాన్ని తెలుగులో – ‘అరిసి’ అంటారు. అరి అంటే పొట్టుతీసినదని! వరి గింజలపైన ఊక, తవుడు, చిట్టు వగైరా తీసేయగా వచ్చిన తెల్లబియ్యాన్ని అరి, అరిసి, అరిచి పేర్లతో పిలిచేవారని తిరుమల రామచంద్ర వ్రాశారు. అరిసితో చేసింది అరిసె. “అరి” ద్రావిడ భాషా పదం ! “వరి” అనేది ఆస్ట్రోనేషియన్ “ముండా” భాషాపదం కావచ్చని మైకేల్ విజ్జెల్ అభిప్రాయం. వరిని ధాన్యం (paddy) అనే అర్థంలో వాడుతున్నాం. అరి అంటే మరాడించిన బియ్యం అని ! ఇవి తెలుగు పదాలే ! వరిపంట మీద విధించే పన్నుని కూడా తెలుగులో ‘అరి’ అనే అంటారు. పన్ను కట్టే రైతు అరికాపు ! పన్ను అంటే ‘అరి’ ని కట్టలేక వచ్చే ఏడాది కిస్తీలో కడతామని బతిమాలుకుంటే, ప్రభుత్వం అంగీకరిస్తే, అది ‘అరువు’ అయ్యింది. అరువు అంటే చేబదులు అనే అర్థంలో ఈ పదం స్థిరపడింది. అరిని భారీగా కట్టగలిగే భూ యజమానిని ‘అరుసు అన్నారు. అరుసు తెలుగు పదమే ! తిమ్మయ్య అనే అరుసుగారు ఈయన. స్వచ్ఛమైన తెలుగాయన.

తిరుపతి దేవస్థానం Epigraphical Glossary on Tirumala Devasthanams in inscriptions గ్రంథంలో తిమ్మరుసు వివరాలు :

SECTION I-GENEALOGICAL TABLES (Table No. 42).

[The genealogy of minister Timmarasa (known as Pradhani Timmarasa) and his brother Säluva Govinda.]




ఈ వివరాల ప్రకారం తిమ్మరుసుకు మగపిల్లల్లేరు ! ఇద్దరు కుమార్తెలు. ఇద్దర్నీ నాదిండ్లవారి ఇంట మేనరికం ఇచ్చి పెళ్ళి చేశాడు. ఇద్దరూ కొండవీడు దుర్గానికి పాలకుడు, ఉపపాలకుడుగా నియమితులయ్యారు. వీరనరసింహ, కృష్ణదేవరాయ, అచ్యుత దేవరాయ ముగ్గురుకీ వరుసగా తిమ్మరుసయ్య ప్రధానిగా ఉండి 1536 వరకూ తన అఖండ మేధాసంపత్తితో రాజ్యాన్ని నడిపించాడు.

గజపతులు బీజాపూరు సుల్తానులపై విజయనగరం ఆధిపత్యం సాధించటంలో తిమ్మరుసు పాత్ర గణనీయమైంది. రాజ్యంలో సుస్థిరత, సుఖశాంతులు వెల్లివిరియటానికి తిమ్మరుసు ఆలోచనలు ముఖ్య భూమిక వహించాయి.

శ్రీ కృష్ణదేవరాయలు తన కుమారుడికి పట్టాభిషేకం చేశాక తాను మంత్రిగాను, తిమ్మరుసు సచివుడుగానూ వ్యవహరించారని చాగంటి శేషయ్యగారు పేర్కొన్నారు. అలాంటి వ్యక్తిమీద శిశుహత్య ఆరోపణ చేసినప్పుడు, తిమ్మరుసు ఏ ప్రయోజనాన్ని ఆశించి ఇంతటి ఘాతుకానికి వొడిగట్టాడో నిరూపించాలి కదా ! న్యూనిజ్ గానీ, అతను వ్రాసిన కథలు నమ్మిన ఇతర పండితులు గానీ కారణాన్ని ఊహించే ప్రయత్నం చెయ్యలేదు. రాయలవారు బతికుండగానే జరిగిన హత్య ఇది. కాబట్టి దీని వలన లాభం ఎవరికీ ఉండదు. అంతటి దుస్సాహసానికి తలపడటం అసాధ్యం అనాడు.

రాయలు దుఃఖసాగరంలో మునిగితే రాజ్యాన్ని తేలికగా గెలవచ్చని శత్రురాజులు భావించి ఉండవచ్చు. కానీ, అంతటి తిరుగుబాట్లు, చౌరబాట్లు భారీస్థాయిలో జరిగిన దాఖలాలూ లేవు. నమ్మకమైన సాక్ష్యం దొరికేదాకా ఇది అబద్ధమే !

**కృష్ణరాయలమరణం**

> బోరన యాచకప్రతతి భూరివిపద్దశ నొందుచుండఁగా
> నారయ శాలివాహనశకాబ్దము లద్ర్యుగాబ్ది సోములం
> దారణ వత్సరంబున నిదాఘదినంబున జ్యేష్ఠశుద్ధ ష
> ష్ఠీ రవివాసరంబున నృసింహుని కృష్ణుఁడు చేరె స్వర్గమునందలి
> ద్వారకనున్నకృష్ణుఁ డవతారసమాప్తము నొందు కైవడిన్"

ఇది కూడా చాటువే ! దీన్నిబట్టి తారణ సంవత్సరంలో శాలివాహనశకం 1437లో జ్యేష్ఠశుద్ధ షష్ఠి ఆదివారంనాడు రాయలు కీర్తిశేషుడైనట్టు ఈ చాటువు చెప్తోంది. ద్వారకలోని కృష్ణుడిలాగా రాయల అవతార పరిసమాప్తి కూడా జరిగిందంటుంది ఈ చాటువు.

పంచాంగ కర్తలు చెప్తున్నట్టు శాలివాహన శకానికి క్రీస్తుశకానికి 79 యేళ్లు తేడా అనుకుంటే ఈ చాటువు ప్రకారం, రాయలవారి మరణం 2016లో జరిగి ఉండాలి. అప్పటికి ఆయన దిగ్విజయ యాత్రల్లో ఉన్నాడు. కాబట్టి ఈ ఆధారాలేవీ ఆధారపడదగినవిగా లేవు.

కృష్ణదేవరాయల అవసాన సమయంలో గోనపనాయకుడనే వ్యక్తి గంగోదకం పోశాడని మరో చాటువు చెప్తోంది. ఆయనెవరో మహానుభావుడు…చరిత్రకెక్కాడు.

కర్ణాటక తుముకూరు జిల్లాలోని హొన్నెనహళ్లి గ్రామంలో కృష్ణాలయంలో దొరికిన శాసనం ఆధారంగా రాయలవారు అక్టోబర్ 17, 1529 న మరణించినట్టు ఎపిగ్రఫీ సంస్థ సంచాలకులు నిర్ధారించినట్టుగా 2021లో ఒక ప్రకటన వచ్చింది. నిజానికి 1529 అక్టోబర్ 21న అచ్యుతదేవరాయలు నాలుగవ తుళువ రాజవంశీకుడుగా విజయనగర సింహాసనాన్ని అధిష్ఠించినట్టు శ్రీకాళహస్తిలో దొరికిన శాసనం ఆధారంగా నిర్ధారించారు. ఈ తుముకూరు శాసనం ప్రకారం రాయలు అక్టోబరు 17న మరణిస్తే, 4 రోజుల తరువాత అచ్యుతదేవరాయలు పట్టాభిషిక్తు డయ్యాడు. కానీ అంతకు మునుపే ఆయన శాసనాలు ఉండటం అబద్ధమా? శాసన పరిష్కర్తలు ఈ తికమకని విప్పి చెప్పాలి.

ఎదురైె నచో తన మదకరీంద్రము నిల్పి
కేలూత యొసగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొను వేళ పురమేగ
పల్లకి తన కేల బట్టియెత్తె
గోకట గ్రామాద్యనేకా గ్రహారంబు
లడిగిన సీమలయందు నిచ్చె
బిరుదైన కవి గండపెండేరమున కీవ
తగుదని తానె పాదమునఁదొడిగె
ఆంధ్ర కవితా పితామహ ! అల్లసాని
పెద్దన కవీంద్ర యని నన్ను బిల్చినట్టి
కృష్ణరాయలతో దివికేగలేక
బతికి యున్నాడ జవచ్చవంబనగుచు"

రాయలవారి మరణానికి తన సంతాపాన్ని ప్రకటిస్తూ పెద్దన వ్రాసిన సంతాప (Elegy) కవిత ఇది. దారిలో ఎక్కడైనా కనిపిస్తే, తన భద్రగజాన్ని ఆపి, చేయందించి ఏనుగు అంబారి ఎక్కించుకొనే వాడనీ, మనుచరిత్ర కృతిని అందుకునే వేళ పల్లకిని భుజాన పట్టి తనను పురవీధుల్లో ఊరేగించాడని, అనేక అగ్రహారాలు ఇచ్చి గౌరవించాడని, గండపెండేరానికి నీవే తగినవాడివంటూ తన పాదానికి తొడిగాడని, ఆంధ్రకవితాపితామహా అంటూ గౌరవించాడని అలాంటి వ్యక్తితో దివికేగలేక జీవచ్ఛవంలా బతికి ఉన్నానంటూ విలపించాడు పెద్దన.

**మేకకళ్ల కథ నిజమేనా?**

నిప్పు లేనిదే పొగరాదు అనే నమ్మకంకొట్టి పారేయదగింది కూడా కాదు. తుళువ వంశం పాలకుల్లో తుళువ నరస నాయకుడు 1491-1503 దాకా పాలించి రాజ్యాన్ని తన పెద్దకొడుకు వీర నరసింహరాయలుకు అప్పగించాడు. రాజ్యంతో పాటు మిగిలిన ఇద్దరు కొడుకుల బాధ్యత కూడా అప్పగించాడు.

వీరనరసింహరాయలు ఆరేళ్లు మాత్రమే పాలించాడు. 1509 లో మరణశయ్య నెక్కాడు. కారణాలు తెలీవు. ఆ సమయంలో పసివాడైన తన కొడుక్కి రాజ్యాన్ని అప్పగించాలనే కోరిక అతనికి కలిగి ఉంటుంది. కానీ, కృష్ణదేవరాయలు తన హక్కులతో రాజ్యాధికారం కోసం గట్టిగానే వాదన వినిపించి ఉంటాడు.

పాలనానుభవం, రాజ్యాన్ని రక్షించగల ధీరత, నిర్ణయాలు తీసుకోగల పరిజ్ఞానం తనకు ఉన్నాయని రాయలు గట్టిగా నిలబడ్డాడు. కోపతాపాలు, ఆవేశకావేశాలు, కుట్రలకు హత్యాయత్నాలకూ దారి తీసి ఉండవచ్చు కూడా ! 1509 లో వీరనరసింహ రాయలు మరణించాక అనేక ప్రతిఘటనలను ఎదుర్కొని కృష్ణదేవరాయలు రాజయ్యాడు. అందుకు తిమ్మరుసు సహకారం ఉందని న్యూనిజ్ రాయటంలో అతిశయోక్తి లేదనే భావించాలి. రాయలవారిని చంపినట్లు ఋజువుగా మేకకళ్లు తెచ్చి చూపించాడన్న కథలో కొంతనిజం వుండే అవకాశం ఉంది.

పాలించినంతకాలం తన సోదరుణ్ణి కన్నబిడ్డలా చూసుకున్న వీరనరసింహ రాయలుకి ఆఖరు రోజుల్లో పిడపబుద్ధులు పుట్టడమే ఆశ్చర్యం. రాయలు తిరుగు

బాటు ప్రకటించినా లేదా రాయలవారి మద్దతుదార్లు వ్యతిరేకంగా నిలబడినా దాన్ని తాను అణచగలిగే పరిస్థితి లేదు. ఎందుకంటే రాజ్యాన్ని రక్షించగలిగే శక్తి రాయలవారికే ఉంది.

రాజుకు వారసుడు రాజుకొడుకే అని నమ్మినవారు కృష్ణదేవరాయల్ని వ్యతిరేకించి ఉండవచ్చు. వారందరినీ సమాధాన పరచటానికి రాయలు అధికారానికి వచ్చిన కొత్తల్లో కొంత కష్టపడి ఉండవచ్చు. తన అవసాన దశలో తన ఏడేళ్ళ కొడుక్కి రాజ్యాధికారాన్ని ఇచ్చేప్పుడు ఎవరూ మాట్లాడలేకపోవటం ఇందువలనే ! ఆ కుమారుడు మరణించాక తన తమ్ముడు అచ్యుతదేవరాయలకు రాజ్యాన్ని అప్పగించి రాజధర్మాన్ని పాటించాడు రాయలు.

ఒకవేళ రాయలవారి కొడుకు మరణ వృత్తాంతం అబద్ధం అయినట్లయితే, రాయల మరణం తరువాత మూడు రోజుల శౌచం అవగానే అంతర్మన్నీలు అచ్యుతరాయల పేరు ప్రతిపాదించి ఉండవచ్చు.

**తిరుమలలో తిమ్మరుసు శేషజీవితం**

తిమ్మరుసు సంస్కృతభాషలో పండితుడు. సంస్కృతంలో కవిత లల్లగలడు కూడా ! స్వయంగా 'సహృదయ చూడామణి' అనే గ్రంథం సంస్కృత భాషలోనే వ్రాశాడు. అగస్త్య విద్యానాథుడు వ్రాసిన బాలభారతం కావ్యానికి 'మనోహరి' అనే సంస్కృత వ్యాఖ్య కూడా తిమ్మరుసు వ్రాశాడట. ఆయన ఎంతటి మేధావో అంతటి యోధుడు. కొండవీడుపైన దాడికి సైన్యానికి నాయకత్వం వహించి సునాయాసంగా కోటను స్వాధీనం చేసుకున్నాడు. అందుకే మంగళగిరిలో వేయించిన జయస్తంభ శాసనంలో ప్రతాపరుద్రుడు హంసల్లాంటి యోధుల్ని కాపలా పెట్టాడని వ్రాశాడు. పిట్టల్ని కొట్టినట్టు కొట్టాడని తాత్పర్యం.

నిస్సందేహంగా తిమ్మరుసు 1537 దాకా జీవించి ఉన్నాడు. రాయల వారు మరణించాక 6-7 యేళ్లు తిరుమలలోనే ఉన్నాడు. ఆయన రాజకీయ జీవితానికి స్వస్తి చెప్పి తిరుమలలో విశ్రాంత జీవితం గడిపినట్టు టిటిడి శాసనాలు

చెప్తున్నాయి. స్వామికి దానాదులు చేసినప్పుడు ప్రసాదాల్లో కొంతభాగం వారికిచ్చేట్లు ఏర్పాటు చేసుకున్నారు. తిమ్మరుసు, అతని తమ్ముడు సాళువ గోవిందు తమ జీవికకు ప్రసాద భాగాన్ని చాలినంత ఉంచుకుని తక్కినది రామానుజ కూటానికి అందచేసేవారట. తిరుపతి దేవస్థానం Epigraphical Glossary on Tirumala Devasthanams in inscriptions గ్రంథంలో తిమ్మరుసు చివరి రోజులకు సంబంధించిన వివరాలు మరికొన్ని అందించింది.

"ప్రధాని సాళువ తిమ్మరసుగా ప్రసిద్ధినొందిన తిమ్మరుసు, కౌండిన్య గోత్రానికి చెందిన రాచిరాజు లేదా "రాచరసు" కుమారుడు. తిరుమలలో శ్రీవారికి ప్రతిరోజు సమర్పించే ప్రసాదంలో తన భాగస్వామ్యంలోంచి కొంతభాగాన్ని అన్నమాచార్యుల పెద్ద కుమారుడు తాళ్లపాక పెద తిరుమలాచార్యునికి విక్రయిస్తూ ఒక విక్రయపత్రాన్ని నమోదుచేశారు. (72, IV సంపుటం తేదీ 1536 ఫిబ్రవరి 26)

మరొక విక్రయపత్రంలో తిరుమల, తిరుపతి దేవాలయాలలోని ప్రసాదాలలో తన భాగస్వామ్యంలోంచి కొంతభాగాన్ని 3200 పణాలకు సాళువ తిమ్మరుసు ఆయన సోదరుడు గోవిందరుసు ఇద్దరూ కలిసి తాళ్లపాక పెదతిరుమలయ్యగారికే విక్రయించినట్టు (నం. 74, సంపుటం IV) నమోదు చేశారు.

1536 డిసెంబర్ 28న, తిరుమలై మరియు తిరుపతిలోని దేవాలయాలల్లో ప్రసాదాల్లో భాగస్వామ్యంలోంచి కొంతభాగాన్ని 1900 పణాలకు విక్రయించినట్టు మరో విక్రయపత్రంలో నమోదు చేశారు (93, సంపుటం IV). ఈ విక్రయపత్రాలన్నీ స్వామి సన్నిధిలోనే వ్రాసినట్టు తిరుమల శాసన పరిశోధన గ్రంథాల్లో ఉంది.

తిమ్మరుసయ్య విశ్రాంత జీవితంలో సాధుజీవితం గడిపాడు. అది పేదరికంతో బాధపడ్డ జీవితం కాదు. తిమ్మరుసు కళ్ళు పీకించటం, జైలుశిక్ష వేయటం ఇవన్నీ కట్టుకథలేనని ఈ ప్రసాదాల క్రయ శాసనాలు చెప్తున్నాయి.

కటకంపై దాడికి తిమ్మరుసు సమ్మతించలేదని, ఆవేశంలో స్వంత నిర్ణయం తీసుకుని రాయలు దండు వెళ్ళాడని ఒక అభిప్రాయం ఉంది. కటకాన్ని వదిలేసి

ప్రతాపరుద్రుడు ప్రాణభయంతో పారిపోయాడని, తిమ్మరుసు హితవుతో రాయలు అతన్ని సగౌరవంగా వెనక్కి రప్పించి అతని రాజ్యాన్ని అతనికి అప్పగించాడని. ఇద్దరూ ఒకరి మీద ఒకరు పరస్పరం దాడులు చేసుకున్నందుకు క్షమాపణలు చెప్పుకున్నారని, ప్రతాప రుద్రుడు గౌరవ పూర్వకంగానే తన కుమార్తెని రాయల వారికిచ్చి వివాహం చేశాడని ఇంకో కథనం ఉంది. "కాదంటే కటకం దాకా మనదేరా...!" అనే విజయనగర ప్రజల కోరిక నెరవేరింది. రాయలవారి పగ చల్లారింది. ఆయనకొక రాణి లభించింది. మరొక హిందూ రాజ్యాన్ని సంరక్షించాల్సిన బాధ్యతను గుర్తు చేసి గజపతుల అధికారాన్ని పునరుద్ధరించటంలో తిమ్మరుసు దూరదృష్టి వెల్లడయ్యింది.

ఒకరాజు ఎలా ఉండాలో కృష్ణదేవరాయలు అనేక సందర్భాల్లో తనను తాను నిరూపించుకున్నాడు. ఒక మంత్రి ఎంత దూరదృష్టితో ధర్మ భావనతో రాజ్య సంరక్షణ చేయగలడో తిమ్మరుసు మంత్రి ఋజువుపరచుకున్నాడు. తమ అవతార ప్రయోజనాన్ని నూరుపాళ్ళూ నెరవేర్చిన తెలుగు మూర్తులు రాయలవారూ, అప్పాజీ ! తెలుగు జాతి ఆ ఇద్దరికీ ఎంతైనా ఋణపడి ఉంది. ❑




పెనుగొండలోని తిమ్మరుసు సమాధి జీర్ణోద్ధరణ

# విజయనగర సామ్రాజ్య అవశేషం 'ఆనెగొంది'

కృష్ణాజిల్లా శ్రీకాకుళంలో 2007 ఫిబ్రవరి 9, 10, 11 వ తేదీలలో జరిగిన శ్రీకృష్ణదేవరాయ మహోత్సవాలలో ఆనెగొంది సంస్థానాధీశుడు రాజా అచ్యుతదేవరాయలు ఒక ప్రత్యేక ఆకర్షణగా నిలిచారు. ఆయనతోపాటు ఆయన ధర్మపత్ని రాణీ చంద్రకాంతాదేవి కూడా వచ్చారు. సభల మూడు రోజులూ ఆయన అక్కడ అందరితోనూ ఉల్లాసంగా గడిపారు. ఈ మహోత్సవాలలో శ్రీ కృష్ణదేవ రాయలు ఆముక్తమాల్యద వ్రాస్తున్న శిల్పాన్ని ఆంధ్రమహావిష్ణు దేవాలయ ప్రాంగణంలో ఆముక్తమాల్యద మంటపం వద్ద ప్రతిష్ఠించారు.

ఆ సమయంలో ఆకాశవాణివారు ఆ దంపతులతో ప్రత్యేకంగా ఇంటర్వ్యూ తీసుకోవలసిందిగా నాకు బాధ్యత అప్పగించారు.

అప్పట్లో రాయలవారి వంశీకుడు ఈ అచ్యుతరాయలుగారు అనగానే చాలా మందికి సందేహం కలిగింది. 500 ఏళ్ళ క్రితం నాటి ఒక వ్యక్తికి ఇప్పుడు వారసత్వాన్ని నిర్ధారించటం ఒక సమస్యే ! అందుకు కావలసిన ఆధారాలను తప్పక పరిశీలించవలసివుంది. శ్రీ అచ్యుతదేవరాయల వారితో సంభాషించినప్పుడు ఆయన అనేక విషయాలు నాతో పంచుకున్నారు.

బళ్ళారి డిస్ట్రిక్ట్ గెజిటీరు, మద్రాస్ గెజిటీరు, ఇంకా ఇతర బ్రిటిష్ రికార్డుల్లో శ్రీ అచ్యుత దేవరాయలు పూర్వీకుల్ని కృష్ణదేవరాయల వారి వారసులుగా గుర్తించినట్లు ఉంది. ఆనెగొంది సంస్థానానికి ఈ కుటుంబం ఎలా వచ్చింది? అక్కడ జరిగిన రాజకీయ పరిణామా లేమిటీ? ఆనెగొంది ఆ కుటుంబానికి జాగీర్దార్లుగా ఎలా మారారు? ఈ ప్రశ్నలకు కొన్ని చారిత్రక ఆధారాలు దొరుకుతున్నాయి.

క్రీ.శ. 1568 లో రాజ్యంలో అరాచకం ప్రబలడంతో తిరుమలరాయలు తెగించి సదాశివరాయల్ని చంపి విజయనగర సింహాసనం పైన తనని తాను రాజుగా ప్రకటించుకొన్నాడు. తిరుమలరాయలతో తుళువ వంశీకుల పాలన ముగిసి ఆరవీడు వంశీకుల పాలన ప్రారంభం అయ్యింది. క్రీ.శ. 1585 నాటికి పరిస్థితులు మరింత విషమించాయి. తెలంగాణా, కోస్తా ఆంధ్రప్రాంతాలను కోల్పోవల్సి రావడంతో తిరుమలరాయలు రాజధానిని చిత్తూరు జిల్లా చంద్రగిరికి తరలించాడు.

మధుర నాయకరాజుల తిరుగుబాట్లు, తంజావూరు నాయక రాజుల లౌక్యం, మైసూరు రాజ్యంతో శత్రుత్వం చంద్రగిరిలో అస్థిరత్వానికి కారణాలయ్యాయి. ఒకవైపు గోల్కొండ ప్రమాదకరంగా తయారయ్యింది. కాలక్రమంలో తంజావూరు ముస్లిం దళాలకు లొంగిపోయింది. మదురై నాయకరాజులు ముస్లిం దళాలకు భారీ మొత్తాలను చెల్లించుకుని రాజ్యాన్ని నిలుపుకున్నారు.

1652 నాటికి, రెండవ శ్రీరంగ రాయలుకి వెల్లూరు కోట ఒక్కటే మిగిలింది. దాన్ని కూడా గోల్కొండ దళాలు ఆక్రమించాయి. ఆ సమయంలో మైసూరు మద్దతే కొంత ఊరట. వారికి రాజ్యం లేకపోయినా మైసూరు ప్రభువు అతన్ని రాజుగా గుర్తించి శరణు ఇచ్చాడు. 1778 / 81లలో ఈ మూడవ రంగరాయలు మైసూరు రాజు రక్షణలో రాజుగానే సహజమరణం పొందాడు. అతని కొడుకు 4వ రామరాయలు కొన్నాళ్లు రాజుగా గుర్తింపు పొందాడు. కానీ, ఎక్కువకాలం జీవించలేదు అక్కడితో ఆరవీటి వంశం అంతరించింది.

విజయనగరపాలకులకు చంద్రగిరి కొత్త కాదు. విజయనగర రాజ కుమారులు కొందరు ఇక్కడే పెరిగారు. ఇక్కడే పెరిగిన తుళవ నరసరాజు రెండవ కొడుకు కృష్ణదేవరాయలు 1509 నుంచి 1530 వరకూ విజయనగర సామ్రాజ్యాన్ని పాలించాడు.

ఈ కథ ఇలా నడుస్తుండగా, విజయనగర రాజధాని చంద్రగిరికి తరలిపోవడంతో, అదనుచూసుకొని డెక్కన్ సుల్తాన్లు ఆనెగొందిని ఆక్రమించి తగలబెట్టారు. తుంగభద్రమీద రామరాయలు నిర్మించిన వంతెన మీదుగా హంపీ

విజయనగరం చేరి అక్కడి నిర్మాణాల్ని మరింత ధ్వంసం చేశారు. ఇంపీరియల్ గెజిటీర్ ఆఫ్ ఇండియా (1909) పేజీ 100 లో ఈ ధ్వంస రచన వివరాలున్నాయి. అప్పటికి ఆనెగొంది, హంపీ విజయనగరాలు పూర్తిగా నిర్మానుష్యం అయ్యాయి. హంపీ శిథిలాలకు బాధ్యులు అనేకులున్నారు. మొదట సుల్తానుల కూటము, తరువాత వరుసగా గోల్కొండ సుల్తాన్లు, టిప్పు సుల్తాన్ ఇలా అనేకుల హస్తం ఉంది.

ఈ దశలో చంద్రగిరిలోని ఆరవీటి రాజకుటుంబీకుల్లో కొందరు ధైర్యం చేసి ఆనెగొంది చేరి దాన్ని పునరుద్ధరించే ప్రయత్నం చేశారు. జనావాసాలు తిరిగి ఏర్పడసాగాయి. ఎండిన చెట్లు చిగిర్చాయి. పంటపొలాలు వికసించాయి. మళ్ళీ ఆనెగొంది రాజ్యం ప్రాణం పోసుకుంది.

ఈ సమయంలో చంద్రగిరి పాలకులు అనేక కష్టాలు పడ్డారు గానీ ఆనెగొంది పాలకులు సుఖంగానే పాలించుకున్నారు. ప్రధాన రాజవంశీకులైన చంద్రగిరి ప్రభువులకు ఈ ఆనెగొంది పాలకులు సమీప బంధువులు. అయినా, వివాహ సంబంధాలు కలుపుకోవడం ద్వారా ఆనెగొంది రాజులు సమానమైన రాజగౌరవాన్ని దక్కించుకోగలిగారు.

క్రీ.శ. 1659 లో ఆనెగొందిని ఔరంగజేబు స్వాధీనం చేసుకొన్నాడు. ఒక వంద ఏళ్ళపాటు వీళ్ళు ఢిల్లీ పాలకుల సామంతులుగా ఉన్నారు. 1750 లో మరాఠాల రాకతో ఆనెగొంది పాలకులకు కష్టాలు రెట్టింపయ్యాయి. పీష్వా బాజీరావు కాలం అది. వాళ్ళు హంపీని, ఆనెగొందిని స్వాధీనం చేసుకుని 7000 పగోడాల పన్ను విధించారు. 78 గ్రామాలను ఆనెగొంది పాలకుల ఆధీనంలో ఉంచి ఆ గ్రామాల నుండి 1,53,234 పగోడాల పన్ను వసూలు చేసి ఇవ్వాలని ఆజ్ఞాపించారట.

1775 లో హైదర్ ఆలీ ఆనెగొంది పాలకుడు తిరుమలరాయల్ని ఓడించాడు. ఆ సమయంలో రాయలవారి వారసుడు కావటమే అతనికి ప్రాణభిక్ష పెట్టిందని “ది ఇన్ బాక్స్ బోట్స్ ఎట్ ఆనెగొంది” అనే గ్రంథం పేర్కొంది. రాజ్యాన్ని స్వాధీనం చేసుకొని పన్ను రెట్టింపు చేశాడు హైదరాలీ. చాలా భయంకరంగా పాలించాడు. 1786 లో టిప్పుసుల్తాన్ అధికారంలోకొచ్చాక మతపరమైన అసహనంతో, హంపీ

నగరంలో మిగిలిన భవన సముదాయాల్ని ధ్వంసం చేయించాడు. అంతఃపురాన్ని అంతఃపురం దేవాలయాల రికార్డుల్ని తగులబెట్టించాడు. ఈ దశలో టిప్పుసుల్తాన్ మంత్రి పూర్ణయ్య చొరవచేసి అనెగొంది రాజుకు 2000 రూపాయల భరణం ఇచ్చే ఏర్పాటు చేయించాడట.

క్రీ.శ. 1790లో రెండవ నిజామ్ నిజామాలీఖాన్‌కీ బ్రిటిష్ వాళ్లకీ మధ్య కుదిరిన ఒప్పందం ప్రకారం ఆనెగొంది రాజును తిరిగి ప్రతిష్ఠించి నిజామ్ సామంతుడిగా కొనసాగేట్లు ఏర్పాట్లు జరిగాయి. క్రీ.శ. 1795 లో విలియం ఫాడెన్ అనెగొంది రాజ్యం మ్యాపు చిత్రించాడు. అందులో తుంగభద్రానదికి అటువైపు ఆనెగొంది, ఇటువైపు హంపీ విజయనగరం రెండు వైపులా ఆనెగొంది రాజ్యం విస్తరించివున్నట్లు పేర్కొన్నాడు. హొూస్పేటవరకూ విజయనగరం ఉండేది. హొూస్పట్టణం అంటే కొత్త పట్టణం అని ! విజయనగర రాజులకాలంలో రాజభవనాలు, అధికారకార్యాలయాలు హంపీ విజయనగరంలో ఉంటే, హొూస్పేటలో జనావాసాలుండేవని డా॥ అనీలా వర్గీస్ పేర్కొన్నాడు.

నిజాం రాజు పన్నులు లేని రెవెన్యూ హక్కులు (Tax Free venue Rights) ఆనెగొంది రాజుకు ప్రసాదించాడు. రాయలవారి వారసుడు కావటమే ఇందుకు కారణం కావచ్చు, క్రీ.శ. 1801 లో బ్రిటిషర్లు 1377 రూపాయల నెలవారి భరణం ఇచ్చే ఏర్పాటు చేశారు.

క్యాంప్ బెల్ ప్రకారం క్రీ.శ.1898 నాటికి ఆనెగొంది జనాభా కేవలం 1500 మంది మాత్రమే!

హంపీ విరూపాక్ష ఉత్సవాల్లో ఆనెగొంది రాజుకు రాజలాంఛనాలతో కూడిన ఆలయమర్యాదలను బ్రిటిషర్లు కొనసాగించారు. ఆ తర్వాతి కాలంలో జి.వో.నె. 413, పొలిటికల్, తేదీ 18 ఆగస్టు, 19C ద్వారా నెలకు 500 రూపాయల గ్రాంటుని బ్రిటిష్ అధికారులు ఇచ్చినట్లు బళ్ళారి డిస్ట్రిక్ట్ గెజిటీర్ పేర్కొంది.

స్వాతంత్ర్యం వచ్చాక కూడా ఆనెగొంది సంస్థానాధీశుడిని హంపీ విజయనగర వారసుడిగా గుర్తించి భరణం కొనసాగించారు. 1984 వరకూ ఆ కుటుంబానికి

భరణం కొనసాగింది. హంపీ ఉత్సవాలకు ఆనాటి ఆనెగొంది పాలకుడు కృష్ణదేవరాయలుని ప్రారంభకుడిగా ఆహ్వానించి గౌరవించారు. ఆయన తరువాత అచ్యుతదేవరాయలు తండ్రి స్థానంలో ప్రతిష్ఠితుడయ్యారు.

ఈ మొత్తం ఆధారాలలో బళ్ళారి డిస్ట్రిక్ట్ గెజిటీర్ అందించిన సమాచారం విలువైనది. 19 W.FRANCIS, ICS రూపొందించిన ఈ గెజిటీర్ పేజీ 44లో "విజయనగర సామ్రాజ్యపతనం" existing representative of the (Krishnaraya) family is the raja of Anegundi ...." అనే వాక్యం ఇక్కడ ముఖ్యమైంది.

1902లో మద్రాస్ ప్రభుత్వం ప్రకటించిన జీవో. నెం.413 ద్వారా ప్రకటించిన 500 రూపాయిలతోపాటు ఈ రాజుకు గల హక్కులు యోగ్యతలకు సంబంధించిన డాక్యుమెంట్స్ జతపరిచినట్లు అందులో పేర్కొన్నారు.

రేడియో వారికోసం అచ్యుతదేవరాయాలవారితో నేను సంభాషణ జరిపినప్పుడు ఈ చరిత్రనంతా రాజా అచ్యుత దేవరాయల వారి ముందుంచాను. ఆ వంశీకుడిగా కుటుంబపరంగా కొన్ని వాస్తవాలు వారికి తెలియవచ్చుగదా...? అని అడిగాను.

ఆయన ఆనెగొందిలోని తమ వంశవృక్షం ఫోటో కాపీ నాకు అందించారు. అందులో ఈ రాజులందరి పేర్లూ ఉన్నాయి.

కర్ణాటక ప్రభుత్వం విజయనగర సామ్రాజ్యం వారసుడిగా తనని గుర్తించిన విషయాన్ని ఆయన స్వయంగా వెల్లడించారు. తన మాతృభాష తెలుగేనని, తాను తెలుగువాడినేననీ విస్పష్టంగా ప్రకటించారు. చక్కటి తెలుగులో మాట్లాడారు. ఆయన ధర్మపత్ని రాణీ చంద్రకాంతాదేవి మధ్యప్రదేశ్ లోని పరమార సంస్థానం తమదని, తాము విక్రమాదిత్యుడి వంశీకులమని చెప్పారు. ఆమె కూడా తెలుగులోనే మాట్లాడారు. తన కోడళ్ళు కూడా తెలుగు వారేనన్నారు. వారి వలనే తనకు తెలుగు బాగా అలవాటైందన్నారు.

హంపీ ఉత్సవాలు జరిగేప్పుడు మహాద్వారం గుండా ముందుగా తనను ఆలయ మర్యాదలతో తోడ్కొని వెళ్ళి టెంకాయ కొట్టిస్తారనీ, ఆయన అనుమతించిన తర్వాతే విరూపాక్ష రథం కదులుతుందనీ పేర్కొన్నారు. మొహరం పండుగ సందర్భంగా మహ్మదీయ ప్రముఖులు ఆయన ఇంటికి వెళ్ళి కొద్దిసేపు గడుపు తారట. తర్వాత మొదటిగా సాంబ్రాణీ వేయించి ఉత్సవాలు ప్రారంభింప చేస్తారట.

వృత్తిరీత్యా న్యాయవాది అయిన రాజా అచ్యుతదేవరాయలు 70 ఏళ్ళ వృద్ధుడు. ఆయన భార్య రాణీ చంద్రకాంతాదేవి మధ్యప్రదేశ్ విక్రమాదిత్యుడు పుట్టిన పరమార వంశానికి చెందిన వ్యక్తి. మహారాజ ప్రభునాథసింగ్ కుమార్తె. అయినా చక్కని తెలుగులో మాట్లాడారామె ! తన కోడలు అనకాపల్లికి చెందిన రాణీ లలితాదేవి వలన తనకు తెలుగు బాగా అలవాటయ్యిందని ఆమె చెప్పారు.

కృష్ణదేవరాయల అల్లుడు అళియరామరాజు కుటుంబీకులమనీ, ఆనెగొంది రాజ్యాన్ని తమ పూర్వీకులు నిలబెట్టారనీ, చంద్రగిరిలో విజయనగరసామ్రాజ్యం అంతరించిపోవడంతో నిజాం ప్రభుత్వం, బ్రిటిష్ ప్రభుత్వం తమనే విజయనగర సామ్రాజ్య వారసులుగా భావించారనీ రాజా అచ్యుతదేవరాయలు చెప్తున్న విషయాలకు ఈ సాక్ష్యాలు చాలావరకూ సరిపోతున్నాయి.

విదేశీ పురాతత్త్వ పరిశోధకుడు NATALIE TOBERT వ్రాసిన" ANEGONDI, Architectural Ethnography of a Royal Village" లో కొన్ని వివరాలున్నాయి. 1856 లో Alexander & Greenlaw అప్పటి – హంపీ విజయనగరం శిథిలాల ఫోటోలు తీసి అందించిన విలువైన సమాచారాన్ని మైసూరులోని డైరెక్టరేట్ ఆఫ్ ఆర్కియాలజీ & మ్యూజియమ్స్ వారు ప్రచురించారు. జర్నల్ ఆఫ్ ది బోంబే హిస్టారికల్ సొసైటీ 1930 Vol III No. 1 లోనూ, జర్నల్ ఆఫ్ ది హిస్టారికల్ సొసైటీ ఆఫ్ ఇండియా రాజమండ్రి 1946 Vol XXIV లోనూ, మిథిక్ సొసైటీ 1992 జర్నల్లోనూ, ఎన్నో పరిశోధనాంశాలున్నాయి. ఎమ్. హెచ్. రామశర్మ "ది హిస్టరీ ఆఫ్ విజయనగర ఎంపైర్" గ్రంథం అనేక సందేహాలు తీరుస్తుంది.

క్రీ.శ. 1790 లో రెండవ నిజామ్ నిజామాలీఖాన్‌కీ ఇంగ్లీషు ఈస్టిండియా కంపెనీకి మధ్య జరిగిన ఒడంబడిక ప్రకారం ఆనెగొంది రాజును తిరిగి ప్రతిష్ఠించారు.

అంటే, ఈ విజయనగరసామ్రాజ్యపు అంతేవాసి అప్పటినించి నిజాం సామ్రాజ్యంలో ఆనెగొంది జాగీరుకి జమీందారుగా మారాడన్నమాట.

స్వతంత్ర భారతదేశానికి ఆనెగొంది సంస్థానాన్ని ఈ అచ్యుత దేవరాయల తండ్రి 'దర్బార్ కృష్ణదేవరాయలు' కి అప్పగించారు. 1984 వరకూ రాజా అచ్యుత దేవరాయలు తల్లి రాణీ లాల్ కుమారి పెన్షన్ తీసుకొంటూనేవున్నారు.

ప్రస్తుతం ఆనెగొంది 29 గ్రామాలతో కూడిన మండల పంచాయితీగా ఉంది. కొత్తగా ఏర్పాటయిన కొప్పల్ జిల్లాలో దాన్ని చేర్చారు.

రామాయణంలో పేర్కొన్న కిష్కింధ ఈ ఆనెగొందె అని కన్నడ ప్రజల నమ్మకం. ఆంజనేయస్వామి జన్మ స్థలంగా భావిస్తారు. కన్నడం వారు ఆనెగుండి అంటారు.



# ఆనెగొంది విజయనగర చక్రవర్తుల వంశవృక్షము



## ఆనెగొంది, విజయనగర చక్రవర్తుల వంశవృక్షము

తిమ్మక్షితీశుడు - దేవకీదేవి

ఈశ్వరరాజు భార్య బుక్కమ్మ

నరసింహరాజు (ముగ్గురు భార్యలు)

తిరుమలరాజు దళవాయి

వీరనరసింహరాయలు (తిప్పాజి కుమారుడు) — కృష్ణరాయలు (నాగలాంబ కుమారుడు) — రంగరాయలు (ఓబలమ్మ కుమారుడు) — అచ్యుతరాయలు (ఓబలమ్మ కుమారుడు)

తిరుమలమ్మ భర్త రామరాయలు - 1 రాక్షసి తంగడి యుద్ధంలో మృతి - 1565 — వెంగలమ్మ భర్త తిరుమల రాయలు - 1 — సదాశివరాయలు — వెంకటరాయలు

రంగరాయలు - 4 — రఘునాథరాయలు — రంగరాయలు - 2 — రామరాయలు-3 — వెంకటరాయలు

పెద్దవెంకటపతిరాయలు — చిన్నవెంకటపతిరాయలు -3 — తిరుమలరాయలు -2 — రంగరాయలు -3

వీరవెంకటరాయలు — రంగరాయలు -6 — తిరుమలరాయలు — రామరాయలు -4

రంగరాయలు

వెంకటరాయలు

రామరాయలు — తిరుమలరాయలు

వెంగమ్మ — చిన్నరాజు — రామరాయలు — రామరాయలు — గోపాలరాయలు

పెద్దదాసరాయలు — చిన్నదాసరాయలు — వీరవెంకటరాయలు

రామరాయలు — వీరవెంకటపతి రాయలు

తిరుమలదేవరాజు (మొదటి భరణందారు - 1824లో ఆమోదం) — చెల్లమ్మ వివాహం కుమార రాఘవరాజు దళవాయితో — కుమార రాఘవరాజు దళవాయి

నరసింహరాజు — 2) వీరవెంకటపతిరాజు వారసత్వం-1824 అవివాహితుడుగా 1831లో మరణం — పెద్ద పంపపతిరాజు — చిన్నపంపపతిరాజు

కేశమ్మ — రంగపతిరాజు — కుమార రాఘవరాజు

3) తిరుమలదేవరాయలు వారసత్వం-1831 మరణం 1866లో — లక్ష్మీదేవమ్మ — సదాశివరాజు — కోదండరామరాజు — కుప్పమ్మ వివాహం కృష్ణదేవరాయలు — పెద్దపతిరాజు 1888లో రాణీ కుప్పమ్మ దత్తత చేసుకుంది

6) పెద్దనరసింహరాజు వారసత్వం-1872 మరణం 1883లో

4) వెంకటరామరాజు వారసత్వం-1866 మరణం 1871 — 5) కృష్ణదేవరాయలు వారసత్వం-1871 మరణం 1872 — 9) భార్యలు రాణీ కుప్పమ్మ (మరణం 7.7.1946) (భరణం మంజూరు 19.8.1919) [illegible]మ్మ

వెంకమ్మ — 7) నరసింగమ్మ పెద్ద నరసింహరాజు (భర్త) వారసత్వం-1883 మరణం ఏప్రిల్ 1889 — 8) శ్రీ రంగదేవరాయలు (పంపపతిరాజు) మరణం 10.12.1918 (భరణం మంజూరు-జి.ఓ. 413 -1902) భార్య రాణీ నరసింగమ్మ (మరణం 1982)

శాంతకృష్ణమ్మ — తిరుమల కొండమ్మ — 10) దర్బార్ రాజాకృష్ణదేవరాయలు జననం 30.11.1911/మరణం 17.6.1966 11) భార్య రాణీ లాల్‌కుమారి భరణం మంజూరు-1970 (మరణం 4.11.1984) — తిరుమలదేవరాయలు మరణం 17.12.1996 భార్య రాణీ రాజేంద్రకుమారి మరణం 17.1.1989 — వెంకటదేవరాయలు జననం 27.4.1919 మరణం 27.11.1979 భార్య రాణీ లక్ష్మీదేవమ్మ

రామదేవరాయలు భార్య విజయకుమారి — విజయకుమారి — శంకరకుమారి — హరిహరదేవరాయలు మరణం 20.8.1987

రాజా అచ్యుతదేవరాయలు జననం 4.8.1936 (రాణీ లాల్‌కుమారికి దత్తత) భార్య రాణీ చంద్రకాంతదేవి (జననం 11.10.1946) — అచ్యుతదేవరాయలు భార్య చంద్రకాంతదేవి (రాణీ లాల్‌కుమారికి దత్తత) — శ్రీరంగదేవరాయలు భార్య లలితారాణీ — నరసింహదేవరాయలు భార్య మోహిని — రఘుదేవరాయ[illegible] మరణం 24.12.19[illegible]

కృష్ణకుమారి జననం 3.10.1966 — శ్రీకృష్ణదేవరాయలు జననం 6.10.1970 భార్య రత్నశ్రీరాయలు జననం 11.7.1975

తిరుమల వెంకటదేవరాయలు జననం 4.12.2000

# తిమ్మన - పెద్దన - రాయలు

"కొండవీడూ మనదేరా ! కొండపల్లీ మనదేరా !
కాదని వాదుకు వస్తే కటకందాకా మనదేరా !
కృష్ణానది మనదేరా ! గోదావరి మనదేరా !
కోరుకొండ మనదేరా! కోనసీమ మనదేరా !
కాదని వాదుకు వస్తే కటకందాకా మనదేరా !!"

ఇది... వీధినపోతూ దేశభక్తుడైన ఓ విజయనగర పౌరుడు పాడుతున్న పాట! మారువేషాల్లో ఉన్న అప్పాజీ రాయలవారూ అది విని తక్షణ నిర్ణయం తీసుకుని కటక్ మీదకు దండయాత్రకు సన్నద్ధమయ్యారని ఓ చక్కని కథ ! ఆ పాట పాడిన దేశభక్తుని తన వ్యక్తిగత సిబ్బందిలో ఒకడిగా నియమించారట.

దిగ్విజయ యాత్రలు పూర్తయి భువనవిజయ నిర్మాణం జరిగి కవితా గోష్ఠులతో కాలం నడుస్తున్న సమయంలో ఓ రోజు, తన సభాసదుల్ని ఉద్దేశ్యించి రాయల వారు ఒక ప్రశ్న వేశారట: "రామాయణ భారతాల్లో సోదరప్రేమ విషయంలో పాండవ సోదరులు గొప్పవారా ? రాముడి సోదరులు గొప్పవారా?" అని !

సభలో కొందరు పాండవులపక్షం, కొందరు రాముడి పక్షం వహించారు. నిర్ణయం తేలలేదు. రాయలవారి ఓటు ఎటు పడితే అటు గెలుపు అయ్యింది. శ్రీకృష్ణదేవరాయలు పాండవులే గొప్ప అన్నాడు. ఎందుకంటే బలవంతుడైన రాముడికి అతని తమ్ములు లోబడటంలో వింత లేదు. కానీ ధర్మరాజుకన్నా శక్తిమంతులైన సోదరులు ధర్మరాజు ఆజ్ఞకు బద్ధులు కావటం విశేషం అని వివరించాడట. కానీ అంతలోనే తాను ఆదికవి వాల్మీకిని కించిపరిచానా... అని సందేహంలో పడ్డారట. అప్పుడు వింజామర వీస్తున్న, 'కటకం దాకా మనదేరా'

అనే గేయం పాడిన దేశభక్తుడు కల్పించుకుని "ప్రభువులవారికి ఈ అవతారంలోనూ పాండవ పక్షపాతం పోలేదు" అన్నాడట. ఆ మాటలు సంతోషపెట్టటమే కాదు, రాయలవారిని ఆదికావ్య నింద అనే అపరాధ భావన లోంచి బైట పడేశాయి.

వెంటనే అతన్ని మెచ్చుకుని కోరిన వరం ఇస్తానని ప్రకటించాడు రాయలు. దానికి ఆ దేశభక్తుడు "దేవర ! కోటనేలుకోవాలని కోరికగా ఉన్నది" అన్నాడట. అప్పుడు తిమ్మరుసు ఆలోచించి "దేవరకోట" నేలుకొమ్మని పంపాడట. కృష్ణాజిల్లాలో ఇప్పటి  చల్లపల్లి సంస్థానమే ఈ దేవరకోట !

రాయలవారి దిగ్విజయ యాత్రకి సాహిత్యాధారాలు అనేకం వున్నాయి.

**పారిజాతాపహరణం రచనాకాలం**

నంది తిమ్మన గారి పారిజాతాపహరణం, అల్లసాని పెద్దనగారి మనుచరిత్ర గ్రంథాలలో ఏది ముందు అనేది కొన్ని చారిత్రకాంశాలను  వెల్లడి చేసే మంచి ప్రశ్న. పారిజాతాపహరణంలో ఈ పద్యం ద్వారా కొన్ని విషయాలు తెలుస్తాయి.:

"ఉదయాద్రి వేగ నత్యుద్ధతి సాధించె
వినుకొండ మాటమాత్రనె హరించె
గూటము ల్పెదరంగఁ గొండవీ డగలించె
బెల్లముకొండ యచ్చెల్లఁ జెఱిచె
వేలుపుఁగొండ యుద్వృత్తి భంగము జేసెఁ
గంబంబు మెట్లు గ్రక్కనఁ గదల్చె
బల్మికాయము కాలమట్టుల నడంచుఁ
గటకమును నింక ననుచు ముత్కల మహీశుఁ
డనుదినమ్మును వెఱచు నెవ్వనికి నతఁడు
రాజమాత్రుండే శ్రీకృష్ణరాయవిభుఁడు

ఈ పద్యంలో ఉదయగిరి, వినుకొండ, కొండవీడు, బెల్లంకొండ, ఖమ్మంమెట్టు లాంటి దుర్గాలను అవలీలగా జయించాడని నంది తిమ్మన చెప్తున్నాడు. దీన్నిబట్టి దక్షిణ దిగ్విజయ యాత్రలో మొదటి భాగం అయ్యాక పారిజాతాపహరణం రచన జరిగిందని భావించాలి.

ఈ దిగ్విజయ యాత్రలో కొండపల్లి కోట స్వాధీనం కాలేదు. రాయలవారు ధరణికోట వెళ్లి అమరావతి అమరేశ్వరుణ్ణి సందర్శించుకుని అక్కడ తులాదానం ఇచ్చినట్టు శాసనం వేయించాడు. "స్వస్తిశ్రీ మన్మహారాజాధిరాజ రాజపరమేశ్వర మూరురాయర గండ, అరిరాయనిభాడభాషిగెతప్పునరాయరగండ, అష్టదిక్కరాయ మనోభయంకర, పూర్వదక్షిణ పశ్చిమసముద్రాధీశ్వర, యవనరాజ్య స్థాపనాచార్య, గజపతినిభాడ, శ్రీ వీరప్రతాప, శ్రీకృష్ణదేవమహారాయలు విజయనగరానుండి పూర్వ దిగ్విజయ యాత్రకు వేంచేసి, ఉదయగిరి దుర్గము సాధించి తిరుమల ప్రేతరాయ మహాపాత్రుని బట్టుకుని అద్దంకి, వినుకొండ బెల్లముకొండ, నాగార్జున కొండ, తంగేడు, కేతవరము మొదలయిన గిరిదుర్గ స్థలదుర్గాలు అన్ని యేకధాటిం గైకొని కొండవీటి దుర్గము లగ్గలు పుచ్చుకుని ప్రతాపరుద్ర గజపతి కుమారుడు వీరభద్రరాయనిన్ని.... జీవగ్రహముగా పట్టుకుని వారికి అభయదానమిచ్చి ధరణికోటకు అమరేశ్వరులకై వేంచేసి స్వస్తిశ్రీ...." అది శాలివాహన శకం 1437 యువనంద సంవత్సర ఆషాఢ బహుళ 12 భానువారం.

ఆ తరువాత అహోబిలం వెళ్ళాడు. అక్కడ ఆయన వేయించిన శాసనంలో ఇలా ఉంది : "ధరణికోటకు విచ్చేసి అమరేశ్వర మహాదేవుని తులాపురుష మహాదానమున్ను చేయనవధరించి తిరిగి విజయనగరానికి విచ్చేసి రత్న సింహాసనస్థుడై సామ్రాజ్యము చేయుచున్ను, మఱి కళింగదేశ దిగ్విజార్థమై విచ్చేయుచు, అహోబిలానకు వేంచేసి దేవుని దర్శించి, శా.సం 1439 అగు నేటి యువ సం. పుష్య శుద్ధ 15 శుక్రవారమందు శ్రీ అహోబిల దేవునికి...." క్రీ.శ.1518 లేదా 1519 కావచ్చు. భువనవిజయ నిర్మాణం, పారిజాతాపహరణ పూర్తిచేసి ఉంటాడని ఈ శాసనం ఆధారంగా నిరూపించవచ్చు.

**మనుచరిత్ర రచనాకాలం**

"తొలుదొల్త నుదయాద్రి శిలఁ దాఁకి తీండ్రించు
నసిలోహమున వెచ్చనయి జనించె
మఱి కొండవీఁడెక్కి మార్కొని నలియైన
యలక సవాపాత్రునంటి రాఁజె

నట సాగి జమ్మిలోయఁబడి వేఁగి దహించెఁ
గోన బిట్టేర్చెఁ గొట్టానఁ దగిలెఁ
గనకగిరిస్ఫూర్తిఁగఱచె గౌతమిఁగ్రాఁచె
నవల నాపొట్నూర రవులుకొనియె
మాడెములు వ్రేల్చె నొడ్డాది మసియొనర్చె
గటకపురిఁ గాల్చె గజరాజు గలఁగి పఱవ
దోఁక చిచ్చన నౌర యుద్ధురతఁ గృష్ణ
రాయ బాహు ప్రతాపజాగ్రన్మహోగ్ని.
అభిరతిఁ గృష్ణరాయల జయాంకములన్ లిఖియించి తాళస
న్నిభముగఁ బొట్టునూరి కడ నిల్పిన కంబము సింహభూధర
ప్రభు తిరునాళ్లకుం దిగు సురప్రకరంబు కళింగమేదినీ
విభునపకీర్తి కజ్జలము వేమఱుఁ బెట్టి పఠించు నిచ్చలున్

ఈ పద్యంలో పెద్దనగారు కళింగ దిగ్విజయ యాత్ర ప్రతాపరుద్రుని ఓటమిని ప్రస్తావించాడు సింహాచలంలో తాటి చెట్టంత విజయస్తంభాన్ని వేయించిన వైనాన్ని కూడా పేర్కొన్నాడు. "కటకపురిని గాల్చె" అన్నాడు కాబట్టి గజపతుల రాజధాని నగరం కటకాన్ని తగలబెట్టి బీభత్సం సృష్టించాడని పెద్దనగారి నిర్ధారణ. అంటే, రాయలవారి కళింగ యాత్ర విజయవంతం అయ్యాకే మనుచరిత్రను పూర్తిచేసి రాయలవారికి కృతి నిచ్చాడని స్పష్టం అవుతోంది. మనుచరిత్ర తరువాతే పెద్దనకు ఆంధ్రకవితాపితామహ అనే బిరుదునిచ్చి గౌరవించాడు రాయలు.

సింహాచల శాసనాలు రెండు ఉన్నాయి. ".....కృష్ణదేవ మహారాయలు విజయనగర సింహాసనారూఢుడై పూర్వ దిగ్విజయ యాత్రకు విచ్చేసి ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి, రాజమహేంద్రవరము మొదలయిన దుర్గాలు సాధించిరి. సింహాద్రికి విచ్చేసి స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శా. స. 1439 అగు నేటి ధాత సంవత్సర చైత్ర బ. ద్వాదశి వారాన సింహాద్రినాథుని దర్శించి..." ఇది మొదటి శాసనంలో ఒక భాగం.

రెండవ సింహాచల శాసనం 2 ఏళ్ల తరువాత రాయలవారు వేయించారు అందులో ఇలా ఉంది: "స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబు 1441 అగు నేటి ప్రమాది నామ సంవత్సర శ్రావణ శు. 13 సోమవారాన శ్రీ మన్మహారాజాధిరాజ.... శ్రీ వీరప్రతాప కృష్ణదేవరాయలు విజయనగర సింహాసనారూఢుడై సింహాద్రినాథునికి తమ పేరిట భోగము నడిచేటందుకు ప్రతాపరుద్ర గజపతి మహారాయల చేతను పుచ్చుకున్న గ్రామాలు కళింగ దండపాటలోని గ్రామాలు, పెదగాని గ్రామం... సింహగిరి అప్పనికి....."

దీన్ని బట్టి కళింగ యాత్ర తరువాత పెద్దన మనుచరిత్ర కృతి నిచ్చినట్టు స్పష్టం అవుతోంది. కాబట్టి, పారిజాతాపహరణం తరువాత రెండేళ్లకు అంటే 1520–21 లో మనుచరిత్ర రచన పూర్తయ్యిందని అర్థం అవుతోంది.

శ్రీ కుందూరి ఈశ్వర దత్తు ఈ రెండు శాసనాలను విశ్లేషిస్తూ, మొదటి శాసనం రాయలవారు సింహాద్రిపైనే ఉండి వేయించాడని, రెండవ శాసనం ఆయన పరోక్షంలో వేయించిందని, రెండవ సింహాచల శాసనానికి దగ్గర్లో మనుచరిత్ర కృతి నంది ఉంటాడని వ్రాశారు.

**ఆముక్తమాల్యద రచనాకాలం**

కృష్ణదేవరాయలు సంస్కృతంలో జాంబవతీ కళ్యాణం, మదాలసాచరితం, సత్యవధూప్రీణనం, సకలకథాసారసంగ్రహం, జ్ఞానచింతామణి, రసమంజరి లాంటి సంస్కృత గ్రంథాలు వ్రాశాడు. తెలుగులో ఆముక్తమాల్యద లేక విష్ణుచిత్తీయం అనే గోదాదేవి కథ దివ్యప్రబంధంగా వ్రాశాడు. ఈ ప్రబంధ రచన ఎప్పుడు జరిగిందనేది కూడా పండితుల మధ్య వివాదంగానే ఉంది.

"...విజయవాటిం గొన్ని వాసరంబులుండి శ్రీకాకుళ నికేతనుండగు ఆంధ్రమధుమధను సేవింపబోయి హరిసరోపవాసర మచ్చట గావించిన పుణ్యరాత్ర చతురయామమున" అనే వాక్యాన్ని బట్టి, కుందూరి ఈశ్వరదత్తు గారు ఆముక్త మాల్యద వ్రాసిన తేదిని క్రీ.శ. 1519 జనవరి 26 వ తేదీ రాత్రి సుమారు

పదిఘడియలకు కుంభ సంక్రమణ కాలము, ఆ దినము మాఘ బహుళ ఏకాదశి నాడు రాత్రి 10 గంటలకు ముహూర్తంగా పెట్టుకుని ఆముక్త మాల్యద రచన ప్రారంభించాడని నిర్ధారించారు.

అంతకు ముందు 1517లో శ్రీకాకుళాంధ్ర మహావిష్ణు దేవాలయంలో ఆయన దీని రచనకు సంకల్పం చెప్పుకోగా దిగ్విజయ యాత్రలు పూర్తయ్యాక 1519లో తీరికగా ఆముక్తమూల్యద రచన ప్రారంభించాడు.

ఆముక్తమాల్యదని రాయలు వ్రాయలేదనే వాదనతో మన పండితులు కొన్నాళ్ళు కాలక్షేపం చేశారు. ఆయనకంత కవితాశక్తి లేదని వీళ్ల నమ్మకం. నంది తిమ్మన గారు తన కృతిని రాయలకు అంకితం ఇస్తూ, "కవితా ప్రావీణ్య ఫణీశ" అన్నాడు. నిండు పేరోలగంలో కవిపండితుల సమక్షంలో రాయలవారిని కవితా ప్రావీణ్యం కలవాడనేంత పెద్ద అబద్ధం నంది తిమ్మన ఆడాడని వీరి భావన 'అవంధ్య ప్రబంధ కృతి సంబంధ్యనుభావునకున్' (1-31) సకల కళా ధోరణికిన్ లాంటి పదాలు కవిత్వ మర్మం తెలియని వాడికి నప్పేవి కాదు. తిమ్మనని, పెద్దనని కూడా అసత్యవాదులు గా చిత్రించే ప్రయత్నంచేశారు. హతోస్మి !

రాయలవారు వ్రాయకపోతే, మరి ఎవరు వ్రాసి ఉంటారు....? ముక్త కంఠంతో అల్లసాని పెద్దనే వ్రాశాడని చాలామంది అరిచారు. దానికి కోపగించి విశ్వనాథ సత్యనారాయణ "ఆముక్త మాల్యదలో నున్నన్ని భిన్నశయ్యలు వ్రాయగలడేని పెద్దన గారు మనుచరిత్రలో నేల వ్రాయలేదు ! - అని వేయిపడగలు నవలలో ఓ పాత్ర చేత అడిగించారు.

కాదు, వేరెవడో తమిళ వైష్ణవ పండితుడు వ్రాశాడన్నవారూ లేకపోలేదు. అంత పండితుడు తన తమిళంలో అలాంటి రచనే ఎందుకు చేయలేదనేది కూడా ఆలోచించాల్సిన ప్రశ్నే !

రాయలవారి కూతురుమోహనాంగి 'మారీచీ పరిణయం' ముందుమాటల్లో "అకలుష మాధురీకలితయై యలసానికవీశు బోలె నల్లిక బిగి ముకు తిమ్మకవి లీలను ముద్దగుబల్కు పాండురంగకవిగతిన్ బదగ్రమముగల్గు కవిత్వముతోడ

విష్ణుచిత్తుకథ రచించు మజ్జనకు దోరపుబత్తి నుతించి మ్రొక్కెదన్" అని వ్రాసుకుంది. నిజంగా ఈ మోహనాంగి రాయలవారి కూతురే అయితే అప్పటికి ఇంకా పాండురంగ మహత్మ్య రచనే చేయని తెనాలి కవిని ఎలా ప్రస్తావిస్తుందీ? రామరాజభూషణుడి వసుచరిత్ర తరువాత తెనాలి రామకృష్ణుని పాండురంగ మహాత్మ్యం వచ్చింది. వీరిద్దరూ రాయల తరువాతి వారుకదా!

మొత్తం మీద రాయలవారి గురించిన కథలు, ఆయన చరిత్ర కలగాపులగం అయి, నిజాలు జల్లెడకు దొరక్కుండా పోతున్నాయి. ❑



ఆముక్తమాల్యద

# రాయలవారి కూతురు మోహనాంగి

"తెనుఁగుబాస ప్రపంచమంతటికి నాదింబొల్చి నిర్దోషలౌ
ట నిజాంచత్పదముల్ బుధాగ్రణుల్ వేడ్కన్ మౌళులం దాల్చి మ
న్నన సల్పంగ త్రిమూర్తులై వెలయు నా నన్నయ తిక్కన యె
ఱ్ఱనలన్ భావమునన్ స్మరించెదను నేనాంధ్రాభిలాషంబునన్"

**మోహనాంగి-"మారీచీపరిణయము"**

తెలుగు భాషను ప్రపంచమంతటికీ ఆదిభాషగా భావించిన ఏకైక రచయిత్రి మోహనాంగి. ఒప్పులెరిగినవారు, అచ్చమైన తెలుగు తెలిసిన మేధావులు వేడుకగా తమ నెత్తిన పెట్టుకుని గౌరవించిన భాష ఇదనీ, ఆంధ్రభాషమీద అభిమానంతో సాహితీ త్రిమూర్తులైన నన్నయ తిక్కన ఎర్రనలను మనసులో స్మరిస్తున్నానంటూ మోహనాంగి తన మారీచీ పరిణయం కావ్యంలో కవిత్రయానికి తొలుతగా వందనాలు చెప్పుకుంది.

ఏ భాషైనా అది అనేక ఇతర భాషలు రూపొందటానికి లేదా సంపన్నం కావటానికి దోహదపడితే దాన్ని 'ఆదిభాష' అనాలి. అప్పుడే అది ప్రాచీన భాష అనే గౌరవాన్ని పొందటానికి అర్హమౌతుంది. సర్వశ్రీ తిరుమల రామచంద్ర, బూదరాజు రాధాకృష్ణ, కోరాడ రామకృష్ణయ్య, మల్లాది సూర్యనారాయణశాస్త్రి ప్రభృతులు పాళీ, ప్రాకృత సంస్కృత భాషల అభివృద్ధిలో తెలుగువారి పాత్ర గురించి, తెలుగు ప్రమేయం గురించి అనేక విశేషాలు వెలుగులోకి తెచ్చారు.

'అరక' నుండి 'నాగలి' వరకూ పాళీ భాషలో మన వ్యావసాయిక పదాలు కొల్లలుగా ఉన్నాయి. సంస్కృతంలో ఉన్న పుత్ర, మీన, తాళ లాంటి తెలుగు పదాలు తెలుగులోంచి సంస్కృతంలోకి చేరాయని కోరాడ రామకృష్ణయ్యగారు 1921లోనే

వ్రాశారు. ఎఫ్.బి.జె.క్వీపర్ అనే పరిశోధకుడు ఋగ్వేదం లోంచి 360 పదాలను ఏరి ఇవి ద్రావిడ, ముండా భాషలకు చెందినవి కావొచ్చంటూ ఒక పట్టిక ప్రకటించాడు. 'క్వీపర్స్ లిస్టు' అంటారు దీన్ని. ఇందులో అనేక ద్రావిడ పదాలున్నాయి. వాటిలో అధికభాగం తెలుగులో వ్యాప్తిలో ఉన్నాయి. పాళీని, ప్రాకృతాన్ని, సంస్కృతాన్ని అభివృద్ధి చేయటంలో తెలుగు భాష పాత్ర, తెలుగువారిపాత్ర ఎంతో ఉంది.

తెలుగుభాషకు ప్రాచీనతా హోదాని నిర్ణయించినప్పుడు, ఈ భాష అనేక ఇతర భాషల అభివృద్ధికి కారకం కావటాన్ని ఒక పరిశీలనాంశంగా గుర్తించారు. 'తెలుగు భాషా చరిత్రలో ఇది ముఖ్యమైన విషయం. తెలుగు భాషని ఆదిభాషల్లో ఒకటిగా ఘనంగా ప్రకటించింది మోహనాంగి. మోహనాంగి చరిత్ర ఎలా ఉన్నా, ఆమె పేరుతో కనిపించే "తెనుఁగు బాస ప్రపంచమంతటికి నాదింబొల్చి" అనే పద్యం మాత్రం చిరస్మరణీయమైనది.

ఈమె శ్రీకృష్ణదేవరాయలు కుమార్తె అనేందుకు ఒకే ఒక్క సాక్ష్యం ఆమె వ్రాసిన మారీచీ పరిణయం కావ్యం. ఆమె చిత్రకారిణి కూడా ! సంస్కృతాంధ్ర భాషల్లో మంచి ప్రవేశం కలిగిన కవయిత్రి. ఆమె అసలు పేరు తిరుమలాంబ అనీ, కృష్ణదేవరాయలు భార్య పేరు కూడా తిరుమలదేవి కాబట్టి ఈమెను మోహనాంగి అని ముద్దుగా పిలుచుకున్నారనీ ఆరవీటి వంశీకుడు, కృష్ణదేవరాయల తరువాత విజయనగర సామ్రాజ్యాన్ని కొనసాగించిన అళియ రామరాజు భార్య అనీ కళాప్రపూర్ణ కొండూరు వీరరాఘవాచార్యులవారు మోహనాంగి పేరుతో ఒక చారిత్రక నవల వ్రాశారు.

మోహనాంగి తిరుచెంగొత్తు అర్ధనారీశ్వరస్వామి భక్తురాలనీ, ఆ అర్ధనారీశ్వరుడి సేవకే జీవితాన్ని అంకితం చేసిందని తమిళనాట బాగా వ్యాప్తిలో ఉన్న ప్రచారం. వైష్ణవ భక్తి ప్రచారంలో మునిగితేలిన కృష్ణదేవరాయల వారి కూతురు, అళియరామరాజు భార్య అర్ధనారీశ్వరుడి భక్తురాలు కావటం కూడా ఒక విశేషమే!

రాధాకృష్ణుల ప్రణయ తత్త్వం లాగే అర్ధనారీశ్వరుల ప్రణయ తత్త్వాన్ని చాటే నృత్యరూపకాలు మోహనాంగి పేరుతో తమిళంలో కొన్ని ఉన్నాయి. తమిళ మోహనాంగి, తెలుగు మోహనాంగీ ఒకరు కాకపోవచ్చు.

మారీచీ పరిణయం అనే కావ్యానికి అవతారికలో రాయలవారి వంశ చరిత్రనీ, రాయల కాలం నాటి చారిత్రకాంశాలనీ, సాంఘిక జీవనాన్నీ అనేక పద్యాలలో వ్రాసింది మోహనాంగి. ఆమెను గానీ, ఆమె వ్రాసిన చారిత్రక విషయాలను గానీ పండితులు ఏవిధంగానూ పరిగణనలోకి తీసుకోలేదు.

1829 లో కావలి వెంకట రామస్వామి మారీచీ పరిణయం కావ్యం గురించి, మోహనాంగి గురించి మొదటగా 'దక్కను కవుల చరిత్రలు' గ్రంథంలో ప్రస్తావించాడు. మెకంజీ దొరకు కైఫీయత్తుల సేకరణలో సహాయపడిన కావలి బొర్రయ్యగారి తమ్ముడు ఈ కావలి రామస్వామి. ఆయనకు చిత్తుప్రతుల్లోనో వ్రాతప్రతుల్లోనో ఈ పుస్తకం దొరికి ఉండవచ్చు.

వేటూరి ప్రభాకర శాస్త్రిగారు రూపొందించిన తెలుగు చాటుపద్యమంజరిలో మోహనాంగి గురించిన ఒక ఐతిహ్యాన్ని అందించారు. రాయలవారికి మోహనాంగి అనే కూతురు ఉన్నదనే విషయాన్ని ఈ చాటువు చాటుతోంది : కృష్ణదేవరాయల దర్శనం కోసం సంకుపాల నృసింహ కవి అనే కవిగారు చాలా రోజులు విశ్వప్రయత్నం చేస్తున్నాడు. ఆయన వ్రాసిన ఒకపద్యం ఎలానో మోహనాంగిని చేరింది. ఒక రోజు మోహనాంగి తండ్రితో చదరంగం ఆడుతుంటే రాయలవారి రెండు ఏనుగుల మధ్య తన బంటు చిక్కుకుంటే, "యుద్ధతుల మధ్య పేదకు నుండదరమె" అంటూ ఆమె తన బంటుని సమర్పించింది. రాయలవారు 'ఈ పద్యపాదం చాలా బావుంది, పూర్తి పద్యం చదువు" అన్నాడట

గీ, ఒత్తు కొనివచ్చు కటికుచోద్వృత్తిఁ జూచి
తరుణి తనుమధ్య మెచటికో తలఁగిపోయె
నుండె నేనియు గనఁబడకున్నె ! యహహా
యుద్ధతులమధ్య పేదకు నుండదరమె" అని చదివిందట. రాయలవారు ఈ పద్యం రాసిన కవి గురించి తెలుసుకుని దర్శనం ఇచ్చి సత్కరించాడని వేటూరి వారు వ్రాసిన ఐతిహ్యం. రాయల సమకాలికుడైన సంకుపాల నృసింహ కవి చరిత్ర ప్రసిద్ధుడే. అతన్ని ఏ కారణం చేతో అష్టదిగ్గజాల్లో చేర్చి చెప్పలేదు. ఇప్పటి

పండితుల వ్యక్తిగత రాగద్వేషాల ప్రభావం ప్రాచీన సాహిత్య విమర్శ పైన బాగా కనిపిస్తుంది.

**మారీచీ పరిణయ రచన**

"పుత్రిక తొల్త బుట్టుటతి పుణ్యకరంబని, నేనెఱింగి యుం
బుత్రుడు నాకొకండయిన బుట్టమి, రాజ్యమునెల్ల నేల
దౌహిత్రుడె నాకు దొల్త జనియింపగ గోరెద, గాన గబ్బపుం
బుత్రిక నీవు కాంచునెడ బుణ్యమునుం, బురుషార్థముం జుమీ" అంటూ,

తన తండ్రికి ఈ కావ్యాన్ని అంకితం ఇస్తున్నట్టు కావ్య రచనారంభంలో చెప్పుకుంది. ఆమె ఈ రచన ప్రారంభించే నాటికి రాయలవారికి పుత్ర సంతానం లేదని దీని తాత్పర్యం. ఈ కావ్యాన్ని అంకితం తీసుకుని మనుమడినే పుత్రుడుగా భావించమని కోరింది. కానీ, కావ్యం నాలుగో అధ్యాయంలోకి వచ్చేసరికి రాయలవారికి సుపుత్రప్రాప్తి కలిగింది. ఆ విషయాన్ని ఆశ్వాసాంతంలో ఆమె స్పష్టంగా పేర్కొందని ఊటుకూరి లక్ష్మీకాంతమ్మ ఆంధ్ర కవయిత్రుల్లో వ్రాశారు.

ముద్రణా యంత్రాంగం లేని రోజుల్లో రచనలలో ప్రక్షిప్తాలకు నిక్షిప్తాలకు ఎన్నో అవకాశాలు ఉండే అవకాశం ఉంది. విషయమే ముఖ్యం అనుకుంటే ఈ మారీచీ పరిణయం పరిచయ పద్యాలను తప్పక చదవాలి.

తండ్రీ కూతుళ్ళ మధ్య స్త్రీ విద్య గురించి, స్త్రీలు కవిత్వం వ్రాయటం గురించి జరిగిన ఈ సంభాషణ చూడండి:

"తండ్రి ! సమస్య పూర్తికి నెదం దలపోయుట లేదు, మీరలే
మంద్రో, మదీయ సాహసము నారసి, కావ్యమొనర్పబూనితిన్
'పీంద్రకు బాక ముండగ గవిత్వపు బాకమునేల? యంచు ని
ల్లాంద్రను గేలిసేయు జనులందఱు మెచ్చెడు నట్టి శైలితో"

"నాన్నగారూ ! మీరడిగిన సమస్యను పూరించటం గురించి కాదు నా ఆలోచన, నేను కవిత్వం చెప్తుంటే మీరేమంటారో నని ఆలోచిస్తున్నాను. సాహసించి కావ్యం వ్రాసే పనికి పూనుకున్నాను. ఈ ఆడాళ్ళకు వంటింట్లో పాకాలను చేయటం

ఉండగా ఈ కవిత్వ పాకాలతో పనేమిటి? అని ఇల్లాళ్ళను గేలి చేసే వాళ్లు కూడా మెచ్చే శైలిలో వ్రాయాలనుకుంటున్నాను" అంది మోహనాంగి.

"అన విని యెట్టెట్టా పలుకవమ్మ మఱొక్కతఱిం బ్రబంధ మీ
వౌనరుప నింతకాలమున కూహయొనర్చితె? యెంత చెప్పినన్
వినకయ యుంటి వింతదనుక వీనుల విందుగ నీదుకబ్బ మో
తనయ, వినంగ నబ్బును కదాయని, నిత్యమపేక్ష చేయుదున్"

"ఎట్టెట్టా! మరోసారి చెప్పు ! ప్రబంధం వ్రాయాలనే ఊహ ఇన్నాళ్లకు కలిగిందా? ఇన్నాళ్లనుండి ఎన్నిసార్లు ఇలాంటి ప్రయత్నం చెయ్యమని నీకు చెప్పాను...? ఇప్పటికి వీనుల విందైన గ్రంథాన్ని వ్రాయాలని పించిందా? ఎప్పుడు నీ పద్యాలను విని ఆనందిద్దామా అని ఎదురుచూస్తాను" అన్నారట రాయలవారు.

'చదువుల సరస్వతివి, నీ
మృదు కవితాశైలి స్త్రీలకే యననేలా
తుదకుం గొమ్ములు తిరిగిన
మదవత్కవి పుంగవులకు మహినిఁ గలుగునే"
"స్త్రీ లన్నంతనె చుల్క చేయుటకు కుమారీ మౌఢ్యమే సుమ్మునా
రీలోకంబున శేముషీయుతలు లేరే, పూర్యమింతేటికిన్"

"చదువుల తల్లీ ! నీ మృదు కవితాశైలి స్త్రీలకే కాదు కొమ్ములు తిరిగిన కవి పుంగవులక్కూడా నచ్చుతుంది. స్త్రీ లనగానే చులకన చేయటం మన వాళ్లలో ఉన్న కుమారీ మౌఢ్యమే సుమా ! నారీ లోకంలో అశేష శేముషీయుతలు లేరా...?" అంటూ రాయలవారు ప్రోత్సహించా రామెని ! 500 యేళ్ల నాటి స్త్రీవాదానికి ఈ ఘటన ఒక తార్కాణం.

**మోహనాంగి కల్పిత పాత్రా ?**

"మోహనాంగి వ్రాయనూ లేదు, చారిత్రక ప్రామాణికతా లేదు" పేరుతో 2-11-75 జమీన్ రైతు వారపత్రికలో ఆరుద్రగారు మారీచీ పరిణయము కావాన్ని ఒక కూట సృష్టిగా తీవ్రంగా ఖండించారు. రాయలవారికి తిరుమలాంబ అనే

కూతురు, తిరుమల దేవరాయలనే కొడుకూ ఉన్నారని అంగీకరిస్తున్నారు. పండితులు అందుకు చాలినంత ఆధారాలను సమీకరించారా? అనేది కూడా మంచి ప్రశ్నే!

ఆంధ్రకవుల చరిత్రములో కందుకూరి వీరేశలింగంగారు "కృష్ణరాయుడి కొమార్తెలును సంగీత సాహిత్యముల యందు నిపుణు రాండ్రనియు రామరాజు భార్య యైన మోహనాంగియను నామె 'మారీచీపరిణయ' మను నైదాశ్వముల శృంగార ప్రబంధము రచించెననియు ఒకరు వ్రాసి యున్నారు. గాని మాకా గ్రంథము లభింపకపోవుట చేత నిది యిట్లని నిశ్చయింప జాలకున్నాము. కృష్ణరాయని యల్లు డయిన రామరాజు భార్య పేరు మోహనాంగి యైనట్లు సైతము గానబడదు, అయినను మోహనాంగి యను పేరు తిరుమలాంబకు నామాంతరమై యుండవచ్చును" అని వ్రాశారు.

1829లో కావలి రామస్వామి ప్రచురించిన 'ది డెక్కన్ పొయెట్స్' గ్రంథంలో మోహనాంగి అనే కవయిత్రి గురించి వ్రాసిన పరిచయ వాక్యాలు ఈ వివాదం మొత్తానికి మూలకారణం

''This poet was a princess, and the Daughter of Krishnadevaraya. She received an excellent education in her infancy and was well versed in rhetoric and poetry, while in the bloom of youth she married ramarayalu, after which she still continued her studies and employed much of her time in reading those works in Telugu composed by poets at her father's Court ; by constant application she attained to considerable proficiency, in the art of verification and wrote a poem entitled 'marichi parinayam' the subject of which is taken from Mahabharat, In this poem very elegant description is given on the Marichi damsels, the work consists of five books; this princess had no issues and became unfortunately a widow in the prime of life. According to tradition, she was immolated on the funeral pile of her husband (Deccan Poets).

మారీచీ పరిణయం వ్రాసిన మోహనాంగి కృష్ణదేవరాయలవారి కూతురని, చిన్ననాడే సాహిత్యం ఇతర కళలు నేర్చిందనీ, రామరాయల్ని పెళ్లి చేసుకుందని, భువన విజయంలో కవుల రచనలను బాగా అధ్యయనం చేసేదనీ, 5 అధ్యాయాలు కలిగిన మారీచీ పరిణయ కావ్యాన్ని వ్రాసిందని, అళియరామరాయల మరణంతో సహగమనం చేసి అశువులు బాసిందనీ కావలి రామస్వామి గారు అందించిన సమాచారం.

200 యేళ్ల క్రితం పరిశోధనలు ప్రారంభ దశలో ఉన్నప్పుడు తన అన్నగారు కావలి బొర్రయ్యగారి బాటలో నడిచిన కావలి రామస్వామి వెలువరించిన పరిశోధనా గ్రంథం ఇది. ఈ రెండు వందల యేళ్ళలో అనేక నూతన అంశాలు వెలుగులోకి వచ్చాయి. అంతమాత్రాన తెలిసీతెలియక వ్రాసిన వాడిగా ఆ పరిశోధనా పితామహుణ్ణి ఆరుద్రగారు చులకనచేయటం సబబు కాదు.

అయితే మారీచుడి వృత్తాంతం రామాయణంలోది కాగా ఈయన మహా భారతం ఆధారం అనటం వలన మొత్తం మోహనాంగినే కల్పితంగా కొట్టిపారేశారు పండితులు. నిజానికి మారీచీ పరిణయం పుస్తకానికి అవతారిక పద్యాలే దొరుకుతున్నాయి. అసలు కావ్యం ఎలా ఉందో, అందులో ఇతివృత్తం ఏమిటో ఎవరికీ తెలీదు. తోకని పుచ్చుకుని ఏనుగు అనేది పాములా ఉంటుందని చెప్పిన ఐదుగురు అంధుల కథలా ఉండకూడదు విమర్శ.

**పరిష్కర్త పైన నింద**

కావలి రామస్వామి గారి తరువాత సరిగ్గా వందేళ్లకు గాజుల లక్ష్మీనరసింహ సెట్టి 1929-30 శుక్లనామ సంవత్సరం సమదర్శిని పత్రికలో తన మిత్రుడి ఇంట దొరికిందంటూ, మారీచీ పరిణయం అవతారిక పద్యాల్ని, 4 వ అధ్యాయంలో కొన్ని పద్యాల్ని ప్రచురించాడు.

“నష్టమై పోయిందనుకున్న ఒక గ్రంథం దొరికినప్పుడు సాహితీపరులు ముఖ్యంగా సాహిత్య చరిత్రకారులూ ఎగిరి గంతులు వేయాలి. సంబరపడాలి.

అందులోనూ కృష్ణరాయల గురించి కొత్త చారిత్రకాంశాలు  లభించే అవతారిక దొరికితే ఉప్పొంగి పోవాలి. అయితే చరిత్ర కారులు గాని, సాహిత్య చరిత్రకారులు గానీ ఇవేం చేయలేదు. చూసీ చూడనట్టు ఊరుకున్నారు. ఎందువల్లనంటే సెట్టి లక్ష్మీనరసింహం గారి 'విఖ్యాతి' అటువంటిది" అని ఆరుద్ర కటువుగా జమీన్ రైతు పత్రికలో మారీచీ పరిణయం అవతారిక పద్యాల్ని గాజుల లక్ష్మీనరసింహ శెట్టి కూట సృష్టి చేశాడని నిందించారు. చిలకమర్తివారు తనతో జమీందారుగారు స్వయంగా గాజుల నరసింహ శెట్టి రాస్తుండగా  చూశానని చెప్పినట్టు ఆరుద్ర తన వాదనకు సాక్ష్యంగా వేసుకున్నారు.

గాజుల వారు గతంలో శృంగార శ్రీనాథ అనే పుస్తకాన్ని ప్రచురిస్తే, చిలకమర్తివారు ఆది శ్రీనాథుడికి సంబంధం లేనిదని ఖండించారు. కాబట్టి ఇది కూడా అటువంటిదే ననే అభిప్రాయానికి ఆరుద్రగారు వచ్చి ఉండవచ్చు. కానీ చిలకమర్తివారు "మహాపురుషుల జీవితములు"  పేరుతో వ్రాసిన ప్రముఖుల జీవిత చరిత్రల్లో గాజుల వారి చరిత్రను కూడా ఘనంగా చిత్రించిన వైనాన్ని మరచిపోకూడదు. చిలకమర్తి వారి టకార ప్రయోగాలు ఆరుద్రగారికి ఆకరాలు కాకూడదు.

ఫోర్జరీ లేదా కూటసృష్టి చేసే వ్యక్తి బహిరంగంగా నలుగురికీ చూపించే వ్రాశాడంటే నమ్మలేము. ఒకవేళ ఎత్తి నకలు తయారు చేస్తుంటే జమీందారుగారు చూశాడేమో తెలీదు. శెట్టిబలిజ సామాజిక వర్గానికి చెందిన వ్యాపారుల కుటుంబం గాజులవారిది. బహుశా రాయలవారి పట్ల కులాభిమానం ఆయన్ని మోహనాంగి కావ్యాన్ని పరిచయం చేయటానికి ప్రోద్బలించి ఉండవచ్చు.

అంతమాత్రాన నిష్కళంక దేశభక్తుడు, తొలితరం జాతీయోద్యమ నాయకుడు గాజుల వారి మీద ఆరుద్రగారు నిరాధార అభాండం వేయటం, ఆయన వివేకాన్ని హేళన చేయటం బాధాకరమే అనిపించింది.

గాజుల లక్ష్మీనరసు శ్రేష్ఠి నీలిమందు, పత్తి వ్యాపారి. మద్రాసు నగరం ధనికుల్లో ఒకడు. తరువాత సంఘసేవా కార్యక్రమాల్లోకి వచ్చాడు. స్వాతంత్రో

ద్యమంలో పాల్గొన్నాడు. 1844 అక్టోబరు 2న హిందువుల స్థితిగతులు మెరుగుపరిచేందుకు ఉద్దేశించి క్రెసెంట్ పత్రికను స్థాపించాడు. మద్రాసు ప్రెసిడెన్సీలోకెల్లా భారతీయుని యాజమాన్యంలో మొదటి పత్రికగా ఇది చరిత్రకెక్కింది. మతం మారినంత మాత్రాన హిందూ వారసత్వ హక్కులు కోల్పోదని బ్రిటిష్ వారు మతమార్పిడి అనుకూల చట్టం తెస్తే, కోర్టులో పోరాడి ఆ చట్టాన్ని రద్దు చేయించాడు. స్త్రీ విద్య కోసం ఎక్కువ పాటుబడ్డాడు. మద్రాస్ ప్రావిన్సులో మరో రాజా రామ్మోహనరాయిగా ఆయన ప్రసిద్ధి పొందారు. కానీ, "ఆయన 'విఖ్యాతి' అటువంటిది" అని ఆరుద్రగారు ఆయన్ని అంత వ్యంగ్యంగా ఎందుకన్నారో, ఈ పుస్తకం నమ్మదగినది కాదని ఎలా అన్నారో నమ్మదగినది కాకపోవటానికి గాజుల వారి కూట సృష్టే కారణం అని ఎలా నిర్ధారణకొచ్చారో ఆశ్చర్యమే !

పరవస్తు చిన్నయ సూరి తండ్రి రంగరామానుజాచారి వృత్తిరీత్యా న్యాయవాది. ఆయన్ని ఈస్టిండియా కంపెనీ కేసుల విషయంలో తన న్యాయవాదిగా నియమించుకున్నారు గాజులవారు. 1836లోనే రామానుజాచార్యులవారు మరణించారు. కానీ 1853 జూలైలో శబ్దలక్షణ సంగ్రహాన్ని చిన్నయ సూరిగారు గాజుల లక్ష్మీనరసింహ శ్రేష్ఠిగారికి అంకితం ఇచ్చాదని JAHRS-XXIV సంచికలో "More Light on Gajula Lakshminarasu Setti" అనే వ్యాసంలో వై.విఠల్ రావు పేర్కొన్నారు.

ఈ గ్రంథాన్ని 1953లో ఆ అంకితం పేజీ తీసేసి కొండవీటి వెంకట కవి ప్రచురించారు. అలా ఎందుకు చేశారో తెలీదు. దానికి ముందు మాటలు వ్రాసిన వఝల చిన సీతారామశాస్త్రి ఈ రచన సూరిగారిది కాదంటూ కఱ్ఱి సాంబమూర్తి గారు చేసిన వాదనని ఖండించారే తప్ప, గాజులవారికి అంకితాన్ని ఎత్తేయటం గురించి ప్రస్తావించలేదు.

గాజులవారు పద్యాలు అవలీలగా వ్రాయగలిగిన కవిపండితుడు ఎంతమాత్రమూ కాదు. ఆయన స్వాతంత్ర సమర యోధుడు. సామాజిక వాది! హిందూ సమాజ అభ్యున్నతికి పాటు పడే వ్యక్తి. అంతే గాని కవి కానే కాదు. సాహిత్యాభిమానం ఉన్నవాడు. ఆయనే రాయలవారి చరిత్రని మోహనాంగికి

అంటగట్టి ఆ పద్యాలన్నీ వ్రాశాడనటానికి ఆధారాల్ని ఆరుద్ర సహా ఎవరూ చూపించలేదు. గాజులవారు కూట సృష్టి చేశాడన్నది నమ్మశక్యం కాని విషయం.

డబ్బున్నవాడు కాబట్టి ఎవరితోనో డబ్బిచ్చి వ్రాయించి ఉంటాడని మాటవరసకు అనుకున్నా, గాజులవారు దీన్ని ప్రచురించటానికి వందేళ్ళ ముందే ఆ పుస్తకం ఉందని కావలి రామస్వామి వ్రాసిన ఆధారం ఉంది కదా ! గాజులవారే సృష్టించారనటం తొందరపాటు అవుతుంది.

"ఒక వేళ అది ఉంటే అదీ ఇదీ ఒకటి కాదు" అన్నారు శ్రీ ఆరుద్ర. ఆ ఇంకొకటి దొరికే వరకూ గాజులవారిని కించపరచటం సబబు కాదనే నా భావన.

కూటసృష్టి చేస్తే అందువలన గాజుల వారికి ఒనగూరిన ప్రయోజనాన్ని ఆరుద్ర గారు నిరూపించలేదు.

ఒక వేళ మోహనాంగి పేరుతో ఎవరైనా ఈ కావ్యాన్ని కూట సృష్టి చేసారనుకున్నా అది కూడా 400 యేళ్ల క్రితమే జరిగి ఉండాలి. ఇటీవలి కవి ఎవరో కల్పించినదిగా భావించటం కూడా తొందర పాటేననిపిస్తుంది.

మొత్తానికి తర్కానికి నిలవనిదిగా మోహనాంగి పాత్ర మిగిలి పోయింది. ❑

# ప్రతాపరుద్రుడి కూతురు 'తుఖ్ఖాజి'

రాజుల కథలన్నీ 'అనగనగా ఒక రాజు ఉండేవాడట' అంటూ జనంలో 'ట' కార ప్రయోగంతోనే వ్యాప్తిలో ఉంటాయి. ఈ కథల్లో నిజాలకన్నా కథకుల వ్యక్తిగత అభిప్రాయాలకు ప్రాధాన్యత ఎక్కువ. వేదంలో హరిశ్చంద్రుడు మాటమీద నిలబడని అబద్ధాలకోరు. కానీ కావ్యంలోకి వచ్చేసరికి సత్యవ్రతసంజాతుడిగా కనిపిస్తాడు. కవుల చేతుల్లో పడితే ఈ కథలు మౌలిక స్వభావాన్ని కోల్పోతాయి. చివరికి అవే చరిత్రగా చెలామణీ అవుతాయి కూడా !

కృష్ణదేవరాయలు గజపతిని ఓడించి, అతని కూతుర్ని పెళ్ళాడాడనే కథ కూడా అలా అనుమానించాల్సిన కథే ! తుఖ్ఖాదేవి అని, అన్నపూర్ణఅని, వరదమ్మ అని ఆమెకు అనేక పేర్లున్నాయి. తుఖ్ఖ – తుర్మ– తూర్క అనేవి దుర్గమ్మకు తెలుగు రూపాలు. ప్రతాపరుద్రుడు దుర్గమ్మ భక్తుడని, దుర్గ వరప్రసాది అని ఆయనకు బిరుదు కూడా ఉన్నదని చెప్తారు.

"కృష్ణరాయవిజయము" వ్రాసిన కుమార ధూర్జటి (ధూర్జటి గారి మనుమడు) రాయలు పెళ్ళాడిన గజపతి కూతురు పేరు 'తుఖ్ఖాజి' అని, రాయవాచకంలో జగన్మోహిని అనీ, టైలరు దొర "రుచీదేవి" అనీ, కొన్ని విజయనగర కడితాల్లో లక్ష్మీదేవి అనీ, "నరపతి రాజుల చరిత్రం'లో లుఖాదేవి అనీ, నాదిండ్ల గోపమంత్రి ప్రబోధ చంద్రోదయంలో సుభద్ర అనీ వ్రాశారు.

వారి వివాహం జరిగింది రాయలు పొట్టునూరు జయించాక అనీ, కనిగిరిని జయించాక అనీ భిన్నాభిప్రాయాలున్నాయి. రాణీ చిన్నాదేవి మరణానంతరమే అన్నపూర్ణాదేవితో వివాహం జరిగిందని కొందరు వాదిస్తారు. కీర్తిశేషురాలైన పెద్దరాణి చిన్నాదేవి స్థానాన్ని అన్నపూర్ణా దేవి భర్తీ చేసిందనే వాదన కూడా ఉంది. ఆ

అన్నపూర్ణ గురించి కృష్ణరాయలు, తన ఆముక్తమాల్యదలో ప్రస్తావించటాన ఈ వివాహం యుద్ధాలు ఆగి శాంతి కుదిరాకే జరిగిందని, అప్పుడే రాయలవారు ఆముక్తమాల్యద రచన ప్రారంభించి ఉంటారని భావించవచ్చు.

గజపతితో రాయలవారి యుద్ధం 1517లో జరిగింది. శా.శ.1442 (క్రీ.శ. 1521), నాటి తిరుమల శాసనం ప్రకారం పట్టపు రాణి తిరుమల దేవి శ్రీ వేంకటేశ్వరస్వామికి విలువైన ఆభరణాలు సమర్పించుకుంది. ఆ సమయంలో అన్నపూర్ణ లేదా తుఖ్ఖా అక్కడ లేరు. కాబట్టి వీరి వివాహం యుద్ధం తరువాత చాలాకాలానికి జరిగి ఉండాలి.

ఈ అన్నపూర్ణాదేవి గజపతి కుమార్తే అనటానికి విదేశీ యాత్రికుల వ్రాతలు కొంత ఆధారం, ఈమె అసలుపేరు తుఖ్ఖా లేక జగన్మోహిని అని ఉండగా, వివాహానంతరం ఈమెకు అన్నపూర్ణాదేవి అనే నామకరణం చేశారనే వాదన కూడా ఉంది.

పిల్లనిచ్చిన మామగారు ప్రతాపరుద్ర గజపతా లేక అతని సోదరుడు వీరరుద్ర గజపతా అనే విషయంలో కూడా వివాదం ఉంది. ఆ ఇద్దరూ తండ్రీ కొడుకులని, ప్రతాపరుద్రుడే లొంగిపోయి తానే కూతుర్ని ఇస్తానన్నాడని ఇంకో కథనం, రాయలే బలవంతంగా వీరరుద్ర గజపతి కూతుర్ని ఎత్తుకు పోయాడని, మరో కథనం ఉన్నాయి.

సెట్టి లక్ష్మీనరసింహం గారు ఉగాది కానుకలు పేరుతో వీరి వివాహం పైన ఒక చక్కని కథ రాశారు. వీరరుద్ర గజపతి కుమార్తె అన్నపూర్ణాదేవిని రాయలు వివాహం చేసుకున్నాడని, కానీ, అది మాయా వివాహం అనీ, వేరే వ్యక్తికి ఆమె వేషం వేసి  కూతురు వివాహం జరిపించి శోభనం రాత్రి బావిపైన వదులు మంచం వేసి రాయలవారిని చంపాలనే కుట్ర జరిగిందని వ్రాశారాయన. “పానుపు వెలితి” అని అన్నపూర్ణ ఓ సందేశం ద్వారా రాయల్ని హెచ్చరించటంతో ఆ ప్రమాదం నుండి రాయలు బైటపడ్డారు.

“పడకటింటను నోప్రభూ ! పాన్పు వెలితి
పేరటాండ్రు నారులు గారు, వీరకులము
తొందరించిన పను లెల్ల తోన చెడును
సావధానత నే హాని జరుగబోదు” అని, “పానుపు వెలితి” సందేశం గురించిన ఓ చాటుపద్యం కూడా ఉంది.

**కపిలేశ్వర గజపతితో వైరం ప్రారంభం**

ప్రతాప రుద్రగజపతి ముత్తాత కపిలేశ్వర గజపతి. చంద్రగిరి, ఉదయగిరి, కొండవీడు, కొండపల్లి, రాజమహేంద్రవరం ఖమ్మం ఓరుగల్లు కోటల్ని విజయనగరం రాజుల్నుంచి గెలుచుకుని తన సామ్రాజ్యాన్ని రామేశ్వరం, శ్రీరంగం దాకా విస్తరించిన గొప్ప యోధుడు. కపిలేశ్వర గజపతి కొడుకు పురుషోత్తమ గజపతి (1470–1497) కంచిని పాలించే రాజుగారి కుమార్తెని తనకిమ్మని అడిగాడట.

గజపతి మౌలికంగా శివభక్తుడు. కానీ, పూరీ జగన్నాథుడి విషయాని కొచ్చేసరికి విష్ణుభక్తిని కూడా ప్రదర్శించేవాడు. భక్తికొద్దీ రథం తిరిగే ప్రాంతాన్ని స్వయంగా ఊడ్చేవాడట. కంచి రాజు విష్ణుభక్తుడు. కాబట్టి, శైవులకు తన పిల్లనివ్వనన్నాడు. పైగా, వీధులు ఊడ్చే వాడికి అసలివ్వనన్నాడు. దాంతో కోపించి పురుషోత్తమ గజపతి కంచిని జయించి, రాకుమారిని బంధించి తీసుకుపోయి, ఆమెని వీధు లూడ్చే వాడికే ఇచ్చి పెళ్ళి చేస్తానని శపథం చేశాడు.

అంతలో, పూరీ జగన్నాథ రథోత్సవం వచ్చింది. యథావిధిగా రాజు భక్తికొద్దీ రథ మార్గాన్ని ఊడ్చి శుభ్రం చేస్తున్నాడు. ఆ సమయంలో కంచి రాకుమారిని అక్కడకు తెచ్చి, వీధులూడుస్తున్న గజపతి ప్రక్కన నిలబెట్టి, అతని మంత్రి “ఈమెను ఇప్పుడు పెళ్ళాడితే, వీధులూడ్చే వ్యక్తికిచ్చి పెళ్ళిచేస్తానన్న మీ శపథం, ఈమెను పెళ్ళాడాలనే మీకోరికా తీరతాయి” అని సూచించాడట.

ఆ పురుషోత్తమగజపతి మనుమడు ప్రతాపరుద్రగజపతి. కులనిందకు గురైన అనుభవం ఉన్న కుటుంబమే ! అతను రాయల కులాన్ని ఈసడించారంటే నమ్మబుద్ధికాదు. ఒరియా చరిత్ర కారులు తుఖ్ఖాజీ రాయలవారి భార్యల్లో ఒకరని,

ఆమెను రాయలవారు ఏ కారణం చేతో పరిత్యజించారనీ ఒప్పుకుంటారు. కానీ పానుపువెలితి కథని ఖండిస్తారు. ఎవరి ఇంటి గొడవలు వారివి.

Epigraphical Glossary on Tirumala Tirupati Devasthanams Inscriptions గ్రంథంలో ప్రతాపరుద్ర గజపతి వంశావళి గురించిన వివరాలు ఇలా ఉన్నాయి.

[The genealogy of Pratäparudra Gajapati.]

|

Timmaraja

|

Prataparudra (the king of Utkala)

m. the daughter of Pusapati Rachiraja

| |

| | |
|---|---|
| Prince Virabhadra<br>Annapurna | (alias Tukkadavi)<br>(m. Krishnaraya) |

Parvatarahutta (alias Tirumalarähutla)

On 25th October 1515 A. D., Krishnaraya captured alive this Virabhadraraya, son of Prataparudra Gajapati along with Naraharideva, the son of Kumara. Hamvirapatra, Rachüri Mallukhan, Uddaudakhan, Janyala Kasavapätra and other chiefs after the occupation of the fort of Udayagiri, Addanki, Vinikonda, Bellamkonda, Nagarjunikonda, Tangeda, Ketavaram and other forts in one single attack during his eastern expedition

1515 అక్టోబర్ 25న కృష్ణదేవరాయలు ఉదయగిరి, అద్దంకి వినుకొండ, బెల్లంకొండ, నాగార్జునకొండ, తంగెడ, కేతవరం, కోటల్ని జయించి ప్రతాపరుద్ర గజపతి కుమారుడు వీరభద్రరాయ గజపతిని, హంవీరపాత్ర గజపతి, నరహరిదేవ గజపతి, రాచూరి మల్లుఖాన్, ఉద్దొదఖాన్, జన్యాల కసవపాత్ర ఇంకా ఇతర అధికారుల్ని బంధించాడు. ఇవన్నీ ఒకే దెబ్బతో వశం అయ్యాయని ఉంది. దక్షిణ దిగ్విజయ యాత్ర నుండి కటక్ విజయం వరకూ ఏడున్నర ఏళ్ళపాటు

ప్రతాపరుద్రుడితో రాయలవారు పోరాడినట్టు ఒడియా రికార్డులు చెప్తున్నాయి. ఉదయగిరిని జయించినప్పుడు అక్కడ భూమిలో రాయలవారి కొక బాలకృష్ణుని విగ్రహం దొరికిందట. దాన్నిబైటకు తీయించి గుడి కట్టించి పూజలు చేయించాడని కూడా ఒరియా గ్రంథాల్లో ఉంది.

పోర్చుగీస్ యాత్రికుడు నూనిజ్ వ్రాసిన విషయాన్నే ఒరియా చరిత్రకారులూ స్వీకరించారు. రాయలవారికీ ప్రతాపరుద్రగజపతికీ మధ్య ఒప్పందం ప్రకారం కృష్ణానది వరకూ గజపతి తన అధికారాన్ని కొనసాగించేందుకు రాయలు అంగీకరించాడు. విజయనగరంలో బందీలుగా ఉన్న గజపతి రాణీని ఇతర అధికారుల్ని విడుదలచేశాడు. కానీ, ప్రతాప రుద్రదేవుడు తన కూతుర్ని రాయల కిచ్చి వివాహం చేయక తప్పింది కాదట !

ప్రతాపరుద్ర గజపతి కుమారుడు వీరభద్రుడు తన విజేత కృష్ణదేవరాయల ఆదేశం మేరకు వివాహ పన్నుని రద్దు చేసినట్టు చిత్తల్‌దుర్గ జిల్లాలోని దేవనాగరి తాలూకాలో ఒక శానం ఉందని ఒరియా చరిత్రకారులు వ్రాశారు.

రాయలవారి మొదటి భార్య తిరుమలాదేవి శ్రీరంగపట్నం పాలకుడు కుమార వీర శ్యామరాయని కుమార్తె. వారి వివాహం రాయలు పట్టాభిషిక్తుడు కాక మునుపే జరిగింది. రెండవరాణి చిన్నాజి. ఆమె కుటుంబ వివరాలు తెలియవు. రాయలు ఆమెని పట్టాభిషిక్తుడయ్యాక వివాహమాడాడు. 1517లో రాయల దిగ్విజయ యాత్ర సమయంలోనో పూర్తయ్యాకో ఆమె మరణించింది, చిన్నాదేవి మరణం తరువాతే కటకం జయించిన రాయలు ప్రతాపరుద్రగజపతి కుమార్తె అన్నపూర్ణ / తుఖ్ఖాదేవిని వివాహ మాడాడు” అనేది ఎక్కువమంది పరిశోధకుల అభిప్రాయం.

ఊటుకూరి లక్ష్మీ కాంతమ్మగారు ఆంధ్రకవయిత్రుల చరిత్రలో ఈ తుఖ్ఖాదేవే చిన్నాదేవి అనీ, హత్యాయత్నంలో పాల్గొన్నది ఆమేనని భావించారు. రాయలవారి నిరాదరణతో, ఆమె పుట్టింటికి పోకుండా కడప దగ్గర ఆగిపోయింది. అక్కడే వంటరిగా జీవించింది. అక్కడ గ్రామీణులతో కలిసి పోయి వారి బాగోగులు చూసుకుంటూ బతుకు వెళ్ళదీసుకుందనేది వాదన.

అక్కడ నాలుగు కొండల మధ్య ప్రజల అవసరార్థం ఒక చెరువు త్రవ్వించే బాధ్యత తీసుకుంది. ఎంత ప్రయత్నించిన పనులు ముందుకు సాగటం లేదు. దాంతో ఒక ముసలావిడ ఈ తటాకం నరబలి కోరుతోందేమో అంది. అందరూ ముఖాలు చూసుకున్నారు. అప్పుడా ముసలమ్మే అంది... ఊరుకు మంచి జరగాలని కోరుకుంటున్నాను. తటాకం పూర్తవ్వాలంటే, నరబలి జరగాలి నా ఇద్దరు బిడ్డలు పెదకంబయ్య, చిన కంబయ్యల్ని బలి ఇవ్వటానికి నేను సిద్ధమే అంది. అలా, ఆ తటాకానికి అటూఇటూ పెదకంబం, చినకంబం అనే రెండు ఊర్లు ఆ ఇద్దరి పేరునా వెలిశాయని ఐతిహ్యం.

నిజానికి, రాయలకూ ఈమెకీ మధ్య వైరం ఈమె తండ్రి గజపతి వలనే కలిగింది. కూతురు ద్వారా రాయలును అంతం చేయ దలిచాడు గజపతి. కానీ, రాయలు ఆ హత్యాయత్నంలోంచి తప్పించుకున్నాడు. ఫలితంగా రాయలే ఆమెను వదిలేశాడో, లేక కులం తక్కువ వాడని ఆమే రాయల్ని వదులుకున్నదోగానీ, ఆమె కడపజిల్లా కంబం దగ్గర ఉండిపోయింది.

కొంత ఆవేశకావేశాలు చల్లారాక తుఖ్ఖాపంచకం లేదా భృంగపంచకం పేరుతో ఐదు శ్లోకాలు వ్రాసి రాయలకు పంపింది. రాయలు తనను నిర్లక్ష్యం చేసిన ఆవేదన, దానితోపాటు ఆమెలో కలిగిన పరివర్తన ఇందులో కనిపిస్తాయి. ఆ ఐదుశ్లోకాలూ ఇవి :

1. చరన్వనాంతే నవ మంజరీషు న షట్పదో గంధఫలీ మజిఘ్రత్
   సాకిం నరమ్యా న చ కిం న రంతా బలీయసీ కేవల మీశ్వరాజ్ఞా"

ఈ అడవిలో పూలగుత్తులమీద వ్రాలే తుమ్మెద సంపెంగ పువ్వు మీద కూడా వాలింది గానీ, దాన్ని ఆఘ్రాణించటంలేదు, సంపెంగపువ్వుకు మంచి రంగు, రుచి సువాసన కూడా ఉన్నాయి. అయినా తుమ్మెదకు దాని మీద ఆసక్తి లేకపోవటానికి విధి కారణం. ఈశ్వరాజ్ఞ ఆవిధంగా ఉంది.

2. "మా కింశుర 'ప్రకటయాత్మ నిమేషమాత్రం మన్మస్తకే విహర తీతి మధు వ్రతోయమ్
   కిం మాలతీ విరహవేదనయా త్యదీయమ్ దృష్ట్వా ప్రసూన మచిరా దనలభ్రమేణ"

ఓ మోదుగ పువ్వా! ఈ తుమ్మెద తలమీదే తిరుగుతోందని విసుక్కుని ముకుళించాలని చూడకు. ఒక్కక్షణం ఆగు! మాలతి వలన విరహాగ్నిని పొందిన తుమ్మెద నిన్ను చూసి అగ్ని అనుకుంటుంది.

3. "భ్రమర భ్రమతా దిగంతరాళే క్వచిదాస్వాదిత మీక్షితం శ్రుతంవా
వద సత్య మపాస్య పక్షపాతం యది జాతీకుసుమానుకారి పుష్పమ్"

ఓ తుమ్మెదా! దిగంతరాళాలన్నీ తిరుగుతుంటావు కదా! ఎక్కడైనా జాతికుసుమం(జాజిపువ్వు) లాంటి పువ్వుని చూశావా? విన్నావా? ఆస్వాదించావా? పక్షపాతం లేకుండా నిజం చెప్పు.

4. "కుసుమాని లిఖంతే నామ చిత్రే కతిచిత్కారువిశేషరూఢ శిక్షాః
సురభిత్వ మమూని కిం న లభన్తే కిముచైతేషు రసం పిబన్తి భృంగాః"

బొమ్మలు గీసే చిత్రకారులు ఎన్నెన్నో పువ్వుల్ని అందంగా చిత్రిస్తారు కదా! కానీ ఆ పూలకు పరిమళం ఉంటుందా? ఆ బొమ్మ పూలలో తేనెని తుమ్మెదలు తాగగలవా?

5. "కిం మాలతీం మాయసి మాం విహాయ చుచుంబ తుంబీకుసుమం షడంఘ్రిః
లోకే చతుర్భి శ్చరణైః పశు స్స్యాత్ స షడ్భి రత్యన్త పశు ర్నకింస్యాత్"

ఆరు కాళ్ళున్న తుమ్మెద మాలతీ పుష్పాన్నీ, నన్నూ వదిలేసి తుమ్మి పూలను ముద్దాడుతోంది. ఆ తుమ్మెదకు కొంచెమైనా బుద్ధి ఉందా ! నాలుగు కాళ్ళున్న వాటిని పశువులంటారు. ఈ ఆరుకాళ్ల తుమ్మెద అంతకంటే అధమం.

"వీనినిగూర్చి విమర్శింపవలె నన్న నెంతేని చేతినిండ పని కలుగగలదు. కాని యివన్నియు తుఖ్ఖాదేవీకృతములు కావనియు, రెండు వల్లభ దేవుని సుభాషితాలయందును, ఒకటి ముకుళభట్టు అభిధావృత్తి మాతృక యందును కనబడుచున్న వనియు శ్రీ ఆంధ్ర శేషగిరిరావు ఆంధ్రవిదుషీమణులలో బయల్పరచిరి. ఇక రెండు మిగిలినవి. స్త్రీ కర్తృకము లగునో కాదో యని సందియమున కెడమిచ్చిన వీని విమర్శనకే కాలము వ్యయింపనేల? ఎప్పటికై న కాలము నిర్ణయించునని యోపిక వహింతము" అన్నారు లక్ష్మీ కాంతమ్మ.

కృష్ణదేవరాయల పుట్టుక, కులం, భాష, పెళ్ళిళ్ళు, పరిపాలనకు సంబంధించిన కథలన్నీ ఇంచుమించు పుక్కిటి పురాణాలుగానే కనిపిస్తాయి. ఈ కల్పిత గాథల్లో రాయలు తుఖ్ఖాల సంసార వ్యవహారం కూడా ఒకటి.

సౌర వంశానికి చెందిన రాజ వంశస్థుడిననే భావన ప్రతాపరుద్రదేవుడిలో ఉండి ఉంటుంది. తన అహాలన్నీ చంపుకుని చైతన్యమహా ప్రభుకు సాష్టాంగపడి, తనని తానే సమర్పించుకున్న ఆ చక్రవర్తికి తాను సూర్యవంశ క్షత్రియుణ్ణనే అహం మిగిలి ఉన్నదా... అంటే ఆశ్చర్యమే ! రాయలవారి చుట్టూ ఆవరించి ఉన్న కట్టు కథల్ని ఆయనా నమ్మి ఉండవచ్చు. కృష్ణదేవరాయలు అన్ని విధాలా శూద్రుడు, తక్కువ కులానికి చెందిన సైన్యాధిపతి మరియు దాసి (సేవకురాలు) యొక్క ప్రణాళిక లేని సంతానం. లాంటి కథలు ఆయన బుర్రలో బలంగా నాటుకుని ఉండవచ్చు.

కృష్ణదేవరాయలు, ప్రతాపరుద్రగజపతి ఇద్దరు గొప్ప విష్ణు భక్తులే ! రాయలు రామానుజ సిద్ధాంతాలకు, ప్రతాపరుద్రగజపతి చైతన్యమహాప్రభు సిద్ధాంతాలకు అంకితమైన భక్తులు. ఇద్దరూ సాహితీ కళా ప్రియులు. కవులు కూడా !

కృష్ణదేవరాయల కథలన్నీ ఆయన చుట్టూ పరిభ్రమించాయి. ఆయన్ని భోజుడితో సమానంగా ఆంధ్రభోజుడని కీర్తించాయి. కానీ, ప్రతాప రుద్రుడి కథలు చైతన్య మహాప్రభు చుట్టూ పరిభ్రమించాయి.

ప్రతాపరుద్రుడు చైతన్యమహా ప్రభును అమితంగా ఆరాధించాడు. చైతన్యప్రభువు పూరీ నుండి బృందావనానికి వెళ్ళినప్పుడు, ప్రతాపరుద్రుడు ఎంతగా విరహం పొందాడంటే, అప్పటికప్పుడు చైతన్యుని విగ్రహాన్ని తయారు చేయించి, గుడికట్టించి, 54 మంది పూజారుల్ని నియమించి పూజలు చేయించాడు, అలాగే దాని నిర్వహణ కోసం పెద్ద భూమి ఇచ్చాడు. ఇప్పటికీ ఈ దేవాలయం పూజలందుకుంటోంది. ఇంతగా దాసోహం కావటాన ప్రతాప రుద్రుడి యశస్సు చైతన్యుడి ముసుగులో మరుగునపడిపోయింది.

1532లో చైతన్యమహాప్రభు మరణం తరువాత దుఃఖంలో కూరుకుపోయి, ఆ విషాదంలో రాజ్యాన్ని పాలనా వ్యవస్థనూ నిర్లక్ష్యం చేసి చివరికి గజపతి

సామ్రాజ్యానికి చిట్టచివరి ప్రభువుగా మిగిలిపోయాడు ప్రతాపరుద్రగజపతి. రాయలవారు కూడా తన కుమారుడి మరణంతో దుఃఖసాగరంలో మునిగి మరణించాడు. శక్తి, జ్ఞానం, ప్రతిభ మూడూ ఉన్నప్పటికీ ఈ రాజులిద్దరూ అంతిమ ఘడియల్లో స్వీయ నియంత్రణ కోల్పోయారు.

రాయలవారు ఆముక్తమాల్యదలో విష్ణుభక్తి ప్రచారం కన్నా సామాజిక చిత్రణ, పటిష్టమైన పాలనా వ్యవస్థ నిర్మాణాలకు అధిక ప్రాధాన్యత నిచ్చాడు. రాజనీతి గురించి రాయలవారు చెప్పిన పాఠాలు ఈ నాటికీ ప్రభుత్వాధినేతలు, మంత్రులు రాజకీయ నాయకులు తమ కార్యాలయాలో గోడలమీద రాసి పెట్టుకోవాల్సినవి. వాటికి బహుశా రాయలు జీవించి ఉండగానే అమిత ప్రాచుర్యం వచ్చి ఉండాలి! రాయలు జీవించి ఉన్నంత వరకూ ఆయన యశస్సు దేశ విదేశాల్లో పరివ్యాప్తం కావటం వలన వాణిజ్యంలో ఆయన ఆధిక్యత కొనసాగింది.

ప్రతాపరుద్రుడు కూడా సాహితీ ప్రియుడే ! అతని రచనలుగా చలామణిలో ఉన్న వాటిలో సరస్వతీవిలాసం, ప్రతాప-మార్తాండ, కౌస్తుక-చింతామణి, నిర్ణయ-సంగ్రహం వగైరా ఉన్నాయి. కానీ, ఒరిస్సా చరిత్రకారులు వీటిలో సరస్వతీ విలాసం గ్రంథాన్ని లొల్ల లక్ష్మీధర పండితుడు వ్రాసిందేనని అంగీకరించారు. లక్ష్మీధర కవి తెలుగువాడు, గుంటూరుజిల్లా వాడు. ఆయన తన ఇతర రచనల్లో సరస్వతీ విలాసాన్ని తన రచనగానే పేర్కొనటం తిరుగులేని సాక్ష్యం అయ్యింది.

రాయలతో సమానంగా రాజనీతిని వ్రాయగలనని అనిపించుకోవాలనే భావన ప్రతాపరుద్రుడిలో ఉండి ఉండటాన, ధర్మశాస్త్ర గ్రంథం అయిన ఈ సరస్వతీ విలాసాన్ని తన రచనగా ముద్ర వేయించుకునే ప్రయత్నం చేశాడు ప్రతాపరుద్రగజపతి. ఇవన్నీ ప్రతాపరుద్రుడు రాయలవారిపట్ల అసూయాగ్రస్థంగా ఉన్నాడనటానికి సాక్ష్యాలు.

సరస్వతీవిలాసం వ్రాసిన లొల్ల లక్ష్మీధరుడు ప్రతాపరుద్రుని ఓటమి తరువాత కృష్ణదేవరాయ ఆస్థానంలో చేరాడు. తుఖ్ఖాదేవితో పాటు అరణంగా వచ్చాడనేది ఒక ఐతిహ్యం !

ఈ వైరాలమధ్య అమాయకురాలు తుఖ్ఖాదేవి బలిపశు వయ్యిందనిపిస్తుంది. ఆముక్తమాల్యదలో రాయలవారు ప్రస్తావించిన మూడవరాణి అన్నపూర్ణ ఈ తుఖ్ఖాజీ ఒక్కరే అయినట్లైతే వారి కథ సుఖాంతం అయినట్టే !

తుఖ్ఖా పంచకంవ్రాసినంత మాత్రాన శ్రీ రాముడు సీతాదేవిని అడవులకు పంపినట్టు తుఖ్ఖాదేవిని రాయలవారు పరిత్యజించారనే వాదానికి చాలినంత తార్కాణం కాదు. ప్రతాపరుద్రగజపతి తెలుగు నేలపైన తన ఏలుబడిలో ఉన్న కోటలన్నింటినీ తుఖ్ఖాదేవికి పెళ్ళి కానుకగా ఇచ్చేశాడని ఒకకథనం ఉంది. కాబట్టి, ఆమె రాయలవారి సామంతురాలే !

రాయలవారు తుఖ్ఖాజీ కలుసుకున్నారో లేదో తెలీదు. అంతలో తెలుగు ప్రజలంతా ప్రమాన్పడేలా రాయలవారు కాలం చేశారన్న వార్త హఠాత్తుగా వచ్చింది. కృష్ణరాయలు చచ్చిపోయిన విషాదంలో విజయనగరం ఉన్నప్పుడు సుల్తాన్లకన్నా ముందే ప్రతాపరుద్ర గజపతి విజయ నగరం మీదకు దాడి వచ్చాడని, ఈ తుఖ్ఖాజీయే తండ్రిమీదకు సైన్యాన్ని నడిపించి వీరపత్ని అనిపించుకుందని ఒక చాటువుంది. అంతఃపుర గాథలు జనంలో యథాతథంగా ఉండవు. గొప్పవారి గోత్రాల గురించి జనం అల్లుకునే కథలే ఎక్కువ ! వాటిలో రాముడూ–రజకుడూ కథలూ ఉంటాయి.

❑

# ఆముక్తమాల్యదలో ఆహారం

మనుషులు రోజూ తాము తినే ఆహారాన్నే తమ దేవుడికి నైవేద్యంగా పెడతారు. కాబట్టి, నైవేద్యాలే ప్రజల ఆహార చరిత్రకు ఆధారం అని రాహుల్ సాంకృత్యాయన్ వ్రాశారు.

శీతాకాలంలో, వానాకాలంలో, వేసవికాలంలో, అతిథి దేవుళ్లకు ఆ కాలానికి తగ్గ వంటకాలు తయారుచేయించి విష్ణుచిత్తుడు తన అతిథి దేవుళ్లకు వడ్డించినట్టు రాయలవారు ఆముక్తమాల్యద కావ్యంలో వర్ణిస్తారు.

కృష్ణదేవరాయలు మాతృభాష తెలుగేనని, అతని బాల్యం యవ్వనం చంద్రగిరి లోనే ఎక్కువగా గడిచాయని, చరిత్రవేత్తల అభిప్రాయం నిజమే నన్నట్టు ఆముక్తమాల్యద తెలుగు కావ్యంలో తెలుగుదనం ఎంతో స్పష్టంగా కనిపిస్తుంది. ఇది కవి స్వీయానుభూతి. అద్దె కవులు వ్రాయగలిగేది కాదు. కూలికి పలికే పలుకులు కావు. రాయలవారు సహజ కవి. సాహిత్య ప్రయోజనం ఎరిగిన కవి. సామాజిక స్పృహ కలిగిన మహాకవి.

**శీతాకాలం నులివెచ్చని భోజనం**

"పునుగుం దావి నవోదనంబు మిరియంపుం బొళ్ళతో జట్టి చు
య్యను నాదారని కూర గుంపు ముకు మందై యేర్చునావం జిగు
ర్కొను పచ్చళ్ళును బాయసాన్నములు నూరుంగాయలున్ జే సురు
క్కనునేయుం జిరుపాలు వెల్లువుగ నాహారం బిడున్సీతునన్"

శీతాకాలంలో ఇంటికొచ్చిన అతిథులకు విష్ణుచిత్తుడు ఎలాంటి భోజనం వడ్డించాడో శ్రీకృష్ణదేవరాయలవారు ఆముక్తమాల్యద లోని ఈ పద్యంలో చెప్తున్నాడు. శీతాకాలంలో ఎలాంటి పదార్థాలు తినాలో ఒక సూచన ఇందులో కనిపిస్తుంది.

- పునుగుం దావి నవోదనంబు : అక్కుళ్లు, మసూరీలు, బాసుమతి ఇలా అనేక ధాన్యాలు ఇప్పుడున్నట్టే ఆ రోజుల్లో పునుగుదావులనే ఒక రకం బియ్యం ఉండేవి. ఇవి కొంచెం వేడిని కలిగిస్తాయి కాబట్టి, చలికాలంలో వాటితో వండిన వేడి అన్నం తినటం మంచిదని రాయలవారి అభిప్రాయం.
- మిరియంపుం బొళ్ళతో జట్టి చుయ్యను నాదారని కూరగుంపు: మిరియాలపొడితో చట్టి (కుండ)చుయ్యనే తాలింపు చప్పుడు ఆగకుండా వండిన కూరగుంపులు అంటే రకరకాల కూరలు
- 'ముకుమందై యేర్చునావం జిగుర్కొను పచ్చళ్ళు' : కొద్దిగా ఆవపిండి లేదా ఆవాలపిండి చేర్చి, కొద్దిసేపు ఊరిన తరువాత తింటే మూర్ధన్యాలు అదిరేంత ఘాటురుచి కలుగుతుంది. క్యాబేజీ, క్యాలీఫ్లవర్, బూడిదగుమ్మడి, సొర, పొట్ల, బీర, కంద లాంటి కూరల్ని ఉడికించి అందులో పెరుగు, ఆవపిండి కలిపి తాలింపుపెట్టి, కొత్తిమీరతో గార్నిష్ చేస్తే దాన్ని ఆవపచ్చడి అంటారు. ఘాటైన ఈ ఆవపచ్చడి జలుబు రొంప బాధలకు ముక్కుమందు లాగా ఉపయోగిస్తుందని శీతాకాలంలో ఇలాంటివి తినాలంటారు రాయలు.
- పాయసాన్నములు : రకరకాల పాయసాలు
- ఊరుంగాయలు : వేసవికాలం ఊరుగాయల సీజన్. జాడీలకు వాసెనగట్టి ఊరుగాయల్ని 3-4 నెలలు మాగనిచ్చి అప్పుడు తినేవారు. ఊరుగాయల్ని శీతాకాలంలో తినటం కోసమే పెట్టుకునేవాళ్లు. మనం వేసవిలోనే తిని పొట్ట పాడు చేసుకుంటున్నాం.
- చే సురుక్కను నేయుం : చేతిపైన పడితే చురుక్కనేలా బాగా కాచిన వేడివేడి నెయ్యి. అరచేతిని గుంటలా పట్టి అందులో నెయ్యి వడ్డించుకుని అన్నం మీద ధారగా పోసి కలుపుకునేవాళ్లు. పాడి పంటల్ని ఈసడించే ఈ కాలీయులకు ఆ భాగ్యం ఎక్కడిది?
- చిరుపాలువెల్లువుగ : సగం మరిగేంత వరకూ చిక్కగా కాచిన పాలను

చిరుపాలంటారు. శీతాకాలపు భోజనంలో మిరియాల పొడి వేసి కాచిన చిరుపాలను వెల్లువగా వడ్డించేవాళ్లట. బహుశా, శీతాకాలంలో పెరుగు బదులు పాలు, పంచదార అన్నంలో కలుపుకుని తినటం అలవాటుగా ఉండేదేమో !

ఈ చిరుపాలనే 'ఆనవాలు' అని కూడా తెలుగులో పిలుస్తారు. 2–3 పొంగులు రానిస్తూ చల్లార్చి మళ్ళీ పొంగిస్తూ కనీసం సగం పాలు మరిగేంత దాకా కాయటం వలన పాలలో వుండే చెడ్డ బాక్టీరియా నశించి పోతుంది ఇలా కాయటాన్ని పాశ్చురైజేషన్ అంటారు. లూయీ పాశ్చర్ పేరుతో బాక్టీరియా లేని శుద్ధ క్షీరాన్ని పాశ్చురైజ్డ్ మిల్క్ అంటారు. అవే చిరుపాలు లేదా ఆనవాలు అంటే. ఈ పాలలో బాక్టీరియా ఆనవాలు లేకుండా పోతుందన్నమాట. పాలు తాగటం అంటే అవి చిరుపాలుగా ఉండాలని రాయలవారి సూచన.

**వానాకాలపు భోజనాలు**

"గగనము నీరు బుగ్గకెనగా జడివట్టిననాళ్ళు భార్య క
న్బొగ సొరకుండ నారికెడపుం బొఱియల్దవులించి వండ న
య్యగపల ముంచిపెట్టఁ గలమాన్నము నొల్చినప్రప్పు నాలుగే
న్బొగిపిన కూరలు న్వడియము ల్వరుగు ల్పెరుగు న్ఘృతప్లుతిన్"

**గగనము నీరు బుగ్గకెనగా జడివట్టిననాళ్ళు :** ఆకాశం నీటిబుగ్గలాగా ఉండి, ముసురుపట్టి, జడివానలు కురిసే కాలంలో **భార్య కన్బొగ సొరకుండ నారికెడపుం** బొఱియల్దవులించి వండ నయ్యగపల : వానలకు కట్టెలు తడిసిపోయి సరిగా మండకపోతే, తన భార్య కంట్లోకి పొగ దూరకుండా ఉండాలని ఎండిన ఎడనీటి కొబ్బరి బోండాల్ని పొయ్యిలోపెట్టి వంట చేయించాడట.

**కలమాన్నం :** ఆరు నెలలపాటు పండిన వరి ధాన్యం "కలమ". దీన్నే ఆరునెలలసంబావు ధాన్యం అని కూడా పిలుస్తారు. కలమతోవండిన అన్నం కలమాన్నం.

**ఒల్చినపప్పు :** కందులు లేదా, పెసలను విసిరి పొట్టు వల్చిన కంది,పెసర బేడలతో వండిన పప్పు. బేడ అనేది బైదళ (ద్విదళ) బీజానికి తెలుగు రూపం.

**నాలుగేన్బొగిపిన కూరలు :** నాల్గైదు పొరటిన కూరలంటే ఉడికి తడారేలా వేగిన ఇగురు కూరలు

**వడియములు :** మినపపప్పు మిరియాలు ఇంగువ వగైరా చేర్చి రుబ్బి, బిళ్లలుగా పోసి ఎండించిన వటకాన్ని వడియం అంటారు. అప్పడాలు, వడియాలను సలసలాకాగే నూనెలో వేసి వేయిస్తే అవి విషపదార్థా లౌతా యని, వాటి సుగుణాలు సగానికి తగ్గిపోతాయనీ ఆయుర్వేదశాస్త్రం చెప్తుంది. వీటిని నిప్పు సెగమీద దోరగా వేగేలా చేసి, కూర, పులుసుల్లో వేసి ఉడికిస్తారు. లేదా, కొద్దిగా నూనెవేసి పైపైన వేయిస్తారు.

**వరుగులు :** ఎండబెట్టిన లేదా వరగలించిన కూరగాయలు లేదా చేపల్ని వరుగులంటారు. వరుగుల్ని డబ్బాలో మూతబెట్టి భద్రపరుస్తారు. కూరగాయలు దొరకని రోజుల్లో వీటిని తీసి నానించి కూరగా వండుకునేవారు. లేదా వడియాల్లాగా కొద్దిగా నూనె వేసి పైపైన వేయించి అన్నంలో నంజుకునేవాళ్లు.

**పెరుగు :** భోజనం చివరిగా తినే ద్రవ పదార్థం పెరుగు.

వర్షాకాలపు ఆహారం గురించి ఇలా వివరించారు: ఆకాశం నీటిబుగ్గలాగా ఉండి, ముసురుపట్టి, జడివానలు కురిసే కాలంలో వానలకు కట్టెలు తడిసిపోయి సరిగా మండకపోతే, తన భార్య కంట్లోకి పొగ దూరకుండా ఉండాలని ఎండిన ఎడనీటి కొబ్బరి బోండాల్ని పొయ్యిలోపెట్టి వంట చేయించాడట. కలమాన్నం, పెసర పప్పు, నాల్గైదు ఇగురు కూరలు, వడియాలు, వరుగులు, పెరుగు సిద్ధం చేయించాడట.

**రాయలవారి వేసవి భోజనం**

> "తెలి నులివెచ్చ యోగిరము దియ్యని చారులు దిమ్మనంబులున్
> బలుచని యంబళు ల్చెరకు పాలెడనీళ్ళు రసావళు ల్ఫలం
> బులును  సుగంధి శీత జలముల్వడ పిందెలు నీరు జల్లయు
> న్వెలయగ బెట్టు భోజనము వేసవి చందన చర్చ మున్నుగన్"

వేసవికాలంలో ఇంటికి వచ్చిన అతిథులకు విష్ణుచిత్తుడు వడ్డించిన వంటకాలను రాయలవారు ఆముక్తమాల్యద కావ్యంలోని ఈ పద్యంలో వివరించారు:

తెలి నులివెచ్చ యోగిరము= నులివెచ్చగా ఉన్న తెల్లన్నం అంటే వరి అన్నం. తేలికగా అరుగుతుంది. వడకొట్టదు.

దియ్యని చారులు=తియ్యని చారు అంటే, చింతపండు వెయ్యని రసం. తమిళనాడులో దీన్ని 'టిక్కాచారు' అంటారు

తిమ్మనంబులు= చల్లపులుసు

పలుచని అంబలి= వరి లేదా జొన్న నూకల జావ (porridge). అంబకళము, పులియంబళకము ఇలా అంబలిని పులియబెట్టి తయారు చేసేవి కూడా ఉన్నాయి. ఇవి వడదెబ్బ తగలకుండా చేస్తాయి.

చెరకుపాలు = చెరకు రసం. వేసవి తాపానికి విరుగుడు పానీయం ఇది.

రసావళుల్ఫలంబులు = బాగారసం నిండిన తియ్యమామిడిపండ్లు

సుగంధిశీతజలాలు = ధనియాలు, జీలకర్ర, దాల్చినచెక్క లాంటి సుగంధ ద్రవ్యాల పొడిని నీళ్లలో వేసి కాచి, చల్లార్చి కుండలో పోసిన చల్లని నీళ్లు. తమిళనాడు, కేరళలలో పచ్చి మంచినీళ్లకు బదులుగా జీరావాటర్, ధనియావాటర్, దాల్చినివాటర్, వాంవాటర్ లాంటివి ఈనాటికీ త్రాగే అలవాటుంది. వడదెబ్బకు విరుగుడు పానీయాలివి.

వడపిందెలు = లేతమామిడి పిందెలు. వగరుగా ఉంటాయి వీటిని తరిగి ఉప్పు వేసి ఊరబెట్టి, మిరియాలపొడితో అన్నంలో తింటారు. వడపిందెలు వడకొట్టకుండా కాపాడతాయి.

నీరుచల్ల = బాగా చిలికి 3 రెట్లు నీళ్లు కలిపి కనీసం 5-6 గంటలు కదల్చకుండా ఉంచిన మజ్జిగ నీటిని 'నీరుచల్ల' అంటారు.

దీన్నిండా ఉపయోగకరమైన బాక్టీరియా ఉంటుంది. చలవనిచ్చి, పేగులను సంరక్షిస్తుంది. ఉత్తమ వేసవి పానీయం.

ఎండలో పడి వచ్చిన అతిథికి ఇవి స్వాగతపానీయాలు (welcome drinks). చందనచర్చ అంటే మంచిగంధం పూసి వడదెబ్బ నుండి సేదతీర్చి, అప్పుడు భోజనం పెట్టేవాడన్నమాట.

ఇంటికొచ్చిన అతిథి షుగరు రోగి అయినా, బలవంతంగా స్వీట్లు పెట్టి, ఏం పర్వాలేదు, ఇంకో మాత్ర అదనంగా వేసుకోండని ఉచిత సలహాలిచ్చే 'అతిమర్యాదలు' విష్ణుచిత్తుడు చేయలేదు. కాలానికి తగ్గ ఆహార పదార్థాలను ఇంపుగా వడ్డించే వాడాయన.

కావ్యాలు చదివితే కలిగే ప్రయోజనం ఏమంటే, చెయ్యవలసినవి, చెయ్యకూడనివి రెండూ తెలుస్తాయి. శ్రీకృష్ణదేవరాయలు ఈ పద్యంలో వేసవిలో వడకొట్టనీయని ఆహార పదార్థాల పట్టిక ఇచ్చాడు. వాటిని మనం అవశ్యం గమనించాలి.

**తేమనం / తిమ్మనం**

ఈ 'తెలి నులివెచ్చ యోగిరము' పద్యంలో రాయలవారు తిమ్మనం అనే వంటకాన్ని ప్రస్తావించారు.

తేమనం అంటే, తేమ (ద్రవత్వం) కలిగేలా చేయటం. ప్రాకృతంలో 'తీమణ' అంటారు. తింట, తిన్న, తిమిత, తిమ్యతి, తీమయతి,

తీమన, తేమ, తేమన, తేమయతి, తైమ్య... ఇవన్నీ తేమని, ద్రవపదార్థాల్ని సూచించే సంస్కృత పదాలు. 'తేమనం' వాటిలో ఒక భాగం. "తేమనం న పరివేషితవతి ఏవ" అంటే, అన్నంలో సాంబారు ఇంకా వడ్డించ లేదని అర్థం.

పెరుగుని చిలికి అందులో సంబారాలన్నీ వేసి తాలింపు పెట్టిన మజ్జిగపులుసుగా దీని వర్ణన క్రీశ.200నాటి గుజరాతీ లావణ్య సామి రూపొందించిన 'బిమలప్రబంధంలో కనిపిస్తుంది. గుజరాతీలు ఇందులో చిట్టి గారెలు గానీ, చిన్న ఉండల్లాంటి పునుగులుగానీ నానబెట్టు కొని తింటారు. ఒక రకం ఆవడల్లా ఉంటాయి.

ఈ తేమనం 'ఖాదీ' లాంటిదేనని 'బిమల ప్రబంధం' గ్రంథంలో పేర్కొన్నట్లు కె. టి. అచ్చయ్య తన 'ఇండియన్ ఫుడ్' పుస్తకంలో ఉదహరించారు. ఖాదీ అంటే

తినేదని ! తెలుగువాళ్లకూ చల్లపులుసులో బియ్యప్పిండిలో సంబారాలు కలిపి చిన్న చిన్న ఉండలు వేసి ఉడికించి ఆ ఉండల్ని ఇవతలకు తీసి తినే అలవాటుంది. 15వ శతాబ్ది నాటి 'వరణకసముచ్చయ' గ్రంథంలో 'ఖాదీ'ని ఇంగువ తాలింపు పెట్టిన పెరుగు పచ్చడిగా పేర్కొన్నారు. వెలగపండుని కాల్చి గుజ్జు తీసి అందులో పెరుగు కలిపి తాలింపు పెట్టిన పెరుగు పచ్చడిని ఖాదీ అంటారని చరకుడు పేర్కొన్నాడు. ఈ 'వెలగ పెరుగుపచ్చడి' 2000 ఏళ్ళ దన్నమాట.

నులివెచ్చగా ఉన్న అన్నం, చింతపండు రసం లేకుండా కాచిన తియ్యచారు, తిమ్మనం అంటే మజ్జిగపులుసు, పలుచని అంబలి, చెరకు రసం, మజ్జిగతో చేసిన లస్సీలాంటి పానీయాలు, పండ్లరసాలు, వాము, జీలకర్ర లేదా దాల్చిన చెక్కలాంటి సుగంధ ద్రవ్యాల్లో ఏదో ఒకదానిని వేసి కాచిన నీళ్ళనే మంచి నీళ్ళుగా ఇచ్చాడట. నీరుచల్ల అంటే గ్లాసు పెరుగుకు 3 గ్లాసుల నీళ్ళు కలిపిచిలికిన చల్ల.

తేమనం, తిమ్మనం ఈ రెండింటికీ ఒక రకమైన ద్రవ వంటకం (సాస్) అని సంస్కృత నిఘంటు అర్థం. తెలుగు నిఘంటువులు తేమనం అంటే మజ్జిగ పులుసు అని వ్రాసాయి.

వేదం వారు ఈ పద్యానికి, వ్యాఖ్య వ్రాస్తూ, తిమ్మనం అంటే మజ్జిగపులుసు అంటూనే, బియ్యప్పిండి, కొబ్బరి, అల్లం, మిరియాలు, వాము వగైరాలను పాలతో ముద్దగా కలిపి చిన్న ఉండలుగా చేసి మరుగుతున్న మజ్జిగపులుసులో వేసి ఉడికిస్తే అవి 'తిమ్మనలు' అన్నారు. తేమనంలో ఉడికిన ఉండలు తిమ్మనలు. ఇవి విడిగా తినటానికి కూడా బావుంటాయి. వేసవిలో చలవనిస్తాయి. తిమ్మనాన్ని కూడా తేమనం లేదా చల్లపులుసు అనే అర్థంలోనే వాడటం ఉంది.

బ్రౌన్ నిఘంటువు తిమ్మనము అంటే a sort of flummery, made of milk, flour and sugar. పాలు, పిండి బెల్లమువేసి వండినది, అని వ్రాసింది. శబ్దరత్నాకరం పాయసం అని పేర్కొంది.

దామెరల వెంగళభూపాలుడు బహుళాశ్వ చరిత్రం కావ్యంలో "కందబజ్జి సమర్పించెఁ గందకబరి? పాలతిమ్మన మిడియె శంపాలతాంగి" అని పాలతిమ్మనల

గురించి పేర్కొన్నాడు. అమరకోశంలో "స్యాత్తేమనం తు నిష్ఠానమ్" తేమనాన్ని నిష్ఠానం అంటారని పేర్కొంది. తేమనం అంటే – తిమష్టిమి ఆర్ద్రీభావే. ఆర్ద్రమై అంటే పలుచగా ద్రవంలా ఉండేది అని వివరణ ఇచ్చింది. నిష్ఠానం అనే పేరు ఎలాగంటే, "తిష్ఠంత్యస్మిజ రసా ఇతి నిష్టానం" – ఇందులో రసాలుంటాయి కాబట్టి ఇది నిష్ఠానం అని పేర్కొంది.

మొత్తం మీద తేమనంలో రసాలు ఉండి అది పలుచగా ఉంటుందని మాత్రమే దీన్ని బట్టి మనకు తెలిసింది. అది తీపో, కారమో తెలీదు. రెండురకాలు గానూ వండే అలవాటు మనకుంది !

'పాక తిమ్మనం' = బెల్లం, బియ్యప్పిండి కలిపి పాకం పట్టిందని !

పాలతిమ్మనం = పలుచగా రుబ్బిన బియ్యప్పిండిని ఒక మందపాటి బట్టలోవడగడితే చిక్కని పాలలాంటి ద్రవపదార్థం దిగుతుంది. బియ్యంపాలు అనవచ్చు ఈ ద్రవాన్ని ! బెల్లాన్ని దంచి, ఉడికిస్తూ, పాకానికి రాగానే అందులో ఈ బియ్యంపిండి పాలను కలిపి గరిట జారుగా చేసిన వంటకాన్ని తిమ్మనం అని కొందరు పిలుస్తారు. ఏలకులు, జీడిపప్పు లాంటివి పాయసంలో కలుపుకొన్నట్టే ఇందులోనూ కలుపుకోవచ్చు. పాలు పోయని పాయసం ఇది ! దీన్ని విడిగా తినవచ్చు, అప్పచ్చుల్లో నంజుకోవచ్చు.

తాలతిమ్మనం : 'తాల తిమ్మనం' అంటే తాలింపు పెట్టిందని ! సంస్కృత నిఘంటువులు తేమనాన్ని సాంబారు / లేదా పప్పుచారుగా భావించాయి.

**రాయలవారి చాపట్లు**

ఎసఁగు కట్టా విక్రియ నావి రెగయ బగటి
యెండ యుడుకాఱకుండు భూమండలమునఁ
దొలిచె మాపటఁ బండు వెన్నెల చకోర
పోత వితతికిఁ జాపట్టు వోసినట్టు... (ఆముక్తమాల్యద)

పగలంతా ఎండ మాడ్చేసింది. సాయంకాలం అయి మసకచీకట్లు కమ్ముకుంటున్నా భూమి వేడి చల్లారలేదు. అంతలో చీకటి ముసురుకుని వెన్నెల

వచ్చేసింది అయినా భూమి వేడినే వెలిగక్కుతోంది. ఇది ఎలా ఉందంటే, పెనం మీద చాపట్లు పోసినప్పుడు పెనం ఆవిర్లు గక్కినట్టుగా ఉంది. వర్షపు నీటికోసం ఎదురుచూసే  చకోరపక్షుల పిల్లల కోసం ప్రకృతి వేడినేల అనే పెనం మీద చాపట్లు పోసినట్టుగా వెన్నెల ఉందనేది ఇందులో అంతరార్థం.

చీకటి పడ్డాక కూడా ఎండవేడి తగ్గలేదు అంటాం మనం. అదే కవితాత్మకంగా చెప్పటానికి కాలే పెనం మీద అట్టు పోసినప్పుడు ఆవిర్లు ఎగసినట్టుంది వెన్నెల అనీ, ఈ వెన్నెల ఏ మాత్రం చల్లదనం ఇవ్వట్లేదని వర్ణించాడు రాయలవారు. భూగోళం ఆకాశం చాలా విస్తారమైనవి కాబట్టి. ఎండతీవ్రత కూడా అంతకన్నా విస్తృతంగా ఉంది కాబట్టి ఆయన చాపరాయి మీద పెద్ద చాపట్టు పోసినట్టుంది అన్నాడు. ఈ చాపట్లంటే ఏవి?

చాపట్లు పోసుకునే అలవాటు శ్రీనాథుడి (365-44) కాలానికే తెలుగువారికుంది. పలు సందర్భాల్లో చాపట్లను, దోసియల్ని, రొట్టేల్ని వేర్వేరుగా ప్రస్తావించాడు.

16వ శతాబ్దికి చెందిన గణపవరపు వేంకట కవి ప్రబంధరాజ వెంకటేశ్వర విజయవిలాసము కావ్యంలో కొన్ని వంటకాల పట్టికని వచనంలోనే వ్రాశాడు.

“దోసెలు నిప్పట్లు రొట్టెలు వడ లతిరసంబులు యప్పములు వెన్నప్పములు సుకియ లమృత కలశంబులు లాగులు చక్కెరబూరు లుక్కెరలు కరిజలు పొరివిళంగాయలు తిమ్మనంబులు పాలకాయలు చక్కిలంబులు మోరుండలు మనోహరంబులు గారెలు బూరెలు మండెంగ లంగరొల్లెలు మణుగుఁబువ్వులు ఫేణీ లొబ్బట్టు కడియపుటట్లు చాపట్టు లిడ్డెనలు తేనెతొలలు గురుగు లేలకికాయలు వెన్నమెఱుఁగులు నిడికుండుకలు, లడ్వాలు ముత్తెపుఁజిప్పలు చంద్రకాంతంబులు మణతలు సారసత్తులు...” అంటూ పేర్కొన్న అనేక వంటకాలలో చాపట్లున్నాయి. “వండిన వలిపెంపుం జాఁపట్లు:” అని శృంగార నైషధంలో శ్రీనాథుడు చాపట్లను ప్రస్తావించాడు.

"కలవంటకములు బూరెలు దేనెతొాలలు చాపట్లు మండెంగ లొాబ్బట్లు వడలు" అంటూ పింగళి సూరన కళాపూర్ణోదయంలో కొన్ని ఆహారపదార్థాల పట్టిక ఇచ్చాడు. వాటిలో చాపట్లున్నాయి.

"చాపట్లు నెంత్రీలు చంద్రకాంతంబులు" అని "బ్రహ్మోత్తర ఖండం"లో 'పట్టమెట్ట సోమనాథ సోమయాజి' గారు కూడా చాపట్లు సహా అనేక వంటకాల్ని ప్రస్తావించాడు.

3వ శతాబ్ది నుండీ 17-18 శతాబ్దాల దాకా చాపట్లను ఘనంగానే తెలుగువారు తిన్నారు ఆతర్వాతే, ఆ పేరు మాయమైంది. పేరు మాయమైతే, ఇప్పటి మన వంటకాలలో దేన్ని ఆనాడు చాపట్టు అన్నారో తెలుసుకోవటం కష్టం కదా !

అప్పటికప్పుడు రుబ్బిన పిండి పులవకుండా చాపలా దీర్ఘచతురస్రాకారంలో వేసిన పెద్ద రొట్టె అని పదబంధ పారిజాతం పేర్కొంది. లక్ష్మీనారాయణీయ నిఘంటువు అప్పడము వంటి యొక దినుసు పిండివంట' అంది. మొత్తం మీద చాపట్టు అంటే పెద్ద దోసె లేదా రొట్టె అనే నిర్ణయానికి మనం రావచ్చు. 'చాప' అంటే, బల్లపరుపుగా (anything flat) ఉండేదని అర్థం. హోటళ్లవారుగానీ, కేటరర్లు గానీ పెద్ద నాపరాయి లేదా ఇనుప పెనం మీద దోసెలు, పరోటాలు, చపాతీలు కాలుస్తారు. ఈ రాయిని 'చాపరాయి' అంటారు.

చాపన్నం, చాపవంటకం, చాపంఅట్టు ఈ చాపరాయి మీద కాలినవే !

సంస్కృతంలో 'చర్పట:' అంటే చాచిన అరచెయ్యి, మందంగా కాల్చిన రొట్టె అని రెండు అర్థాలున్నాయి. తమిళంలో చప్పట్టాయ్, కన్నడంలో చప్పటె, తెలుగులో చప్పి, చప్పిడి ఇవన్నీ flatness ని సూచించే పదాలు. 4-5 అడుగుల పొడవైన అట్టుని మనం ఇంట్లో చిన్నపెనం మీద కాల్చలేం. దానికి చాపలా పెద్దదిగ ఉన్న పెనం కావాలి. అలాంటి పెనాన్ని చాపరాయి అంటారు. 'చాపరాయి అనే పెద్ద పెనం మీద కాల్చిన మందపాటి అట్టు'ని చాపట్టు అంటారు.

పెనం మీద కాల్చినప్పుడు తడి ఆవిరై అట్టగడుతుంది. కాబట్టి, దాన్ని 'అట్టు' అన్నారు. ఐతే, చాపలా చుట్టేది చాపట్టు అని కొందరి అభిప్రాయం. పలుచని దోసెల్ని మందపాటి చపాతీల్ని కూడా మధ్యలో కూర పెట్టి చాపలా చుట్టి తినటం ఉంది కదా ! రోల్స్ అంటూంటారు.

చాపరాయి, చాపట్లు అనే ఊళ్లపేర్లు, ఇంటిపేర్లు కూడా ఉండటం తెలుగు నేలపైన చాపరాయి ప్రాచీనతని, అలాగే చాపట్లంటే మనకు గల ఇష్టతని చాటుతోన్నాయి. ఇప్పుడంటే ఇనుప పెనాలు వాడ్తున్నారు గానీ ఒకప్పుడు పెద్దనల్లరాయినే పెనంగా వాడేవారు. చాపరాయి మీద కాలిన అట్టు, రాచ్చిప్పలో (రాతిగిన్నె)లో కాగిన పప్పుచారు సాటిలేని రుచిని కలిగి ఉంటాయి.

చపాతీలు, పుల్కాలూ, పూరీలు నార్థిండియన్ ఫుడ్స్ అని ఒక ముద్రవేశారు. వాటిని మనం వారినుండి అరువు తెచ్చుకున్నాం అనే అపోహ బలంగా ఉండటాన చపాతీ సృష్టికర్తల్లో తెలుగు వారు కూడా ఉన్నారేమో ఆలోచించే అవకాశం లేకుండా పోయింది.

మన వంటకాలు, వాటికి తెలుగు పేర్లు ఇతరులు స్వీకరించిన సందర్భాలు అనేకం ఉన్నాయి. ఉదాహరణకు మోరుండ అనేది ఉత్తరాదిలో ప్రసిద్ధమైన మరమరాల ఉండ. చక్కని తెలుగు పేరు. తెలుగు నేలమీద ఆ పేరు వాడకంలో లేకుండాపోయింది. ఇప్పుడెవరైనా మోరుండ అంటే అది యూపీ నుండి వచ్చిందనేస్తారు.

**ఐదాకుల వేపుడుకూర**

"గురుగుం జెంచలిఁ దుమ్మి, లేఁదగిరిసాకుం, దింత్రిణీపల్లవో
త్కరముం గూడఁ బొరంటి నూనియలతోఁ గట్టావికుట్టారుగో
గిరము ల్మెక్కి, తమిం బసుల్పొలము వోఁ గ్రేఁవు ల్మెయి న్నాక, మే
కెరువుం గుంపటి మంచ మెక్కిరి ప్రభుత్వైకాప్తి రెడ్లజ్జడిన్." (ఆముక్తమాల్యద)

రెడ్డి అనే బిరుదు కలిగిన భూస్వామి రైతుల గురించి రాయలవారు ఈ పద్యంలో ప్రస్తావిస్తున్నాడు.

- గురుగు ఆకు : ఇది తోటకూర, పాలకూర లాగా ఒక ఆకుకూర. రుచికరంగా ఉంటుంది. జీర్ణశక్తిని పెంచుతుంది. అన్నహితవు కలిగిస్తుంది. పైత్యాన్ని తగ్గిస్తుంది. చలవనిస్తుంది. బలకరమైనది.
- చంచలికూర : రుచిని, ఆకలిని పెంచుతుంది. బలకరం. జ్వరాలు, ఉబ్బసం, కరోనాలాంటి వ్యాధుల్లో వండిపెట్టడం మంచిది. చర్మవ్యాధుల్ని తగ్గిస్తుంది. వీర్యకణాలను, లైంగిక సమర్థతను పెంచుతుంది. ఆకురసం తేలువిషాన్ని హరిస్తుంది.
- తుమ్మి ఆకులు : ఇవి చిరుచేదుగా ఉంటాయి. అందుకని పులుపు కలిపి వండుతారు. కడుపులో నులిపురుగుల్ని చంపుతుంది.

  పాము కాటుకు విరుగుడుగా దీన్ని ఇస్తారు. ఎలర్జీ వ్యాధులున్నవారికి దీన్ని తరచూ వండిపెడితే మేలుచేస్తుంది.

- లే తగిరిశ ఆకులు : వాతవ్యాధుల్లో ఇది బాగా పనిచేస్తుంది. కీళ్లనొప్పులు, గౌట్ వ్యాధి, నడుంనొప్పి, ఎలర్జీ వ్యాధులు, దురదలు, మొలలవ్యాధి, నీరుపట్టటం లాంటి లక్షణాల్లో ఇది ఔషధం. మామూలు ఆకుకూరలకన్నా శక్తిమంతమైనది.
- తింత్రిణీ పల్లవాలు : చింతచిగురుని ఈ నాలుగు ఆకుకూరల్లో కలపాలి. చింతాకుల్లో ఇనుము ఉంటుంది. లివరుని బలపరుస్తుంది.
- నూనియలతో పొరంటి : ఈ ఆకులన్నింటినీ ఒక భాండీలో వేసి బాగా నూనెపోసి వేయిస్తారు. ఎక్కువ నూనె వెయ్యాలనటానికి 'నూనియలు' అన్నాడు. పొరటు అంటే తడిలేకుండా వేగిందని. ఇది కమ్మటి వేపుడు కూర.
- కట్టావి కుట్టారు గోగిరము ల్మెక్కి : కట్టావి=కదుంఆవి= బాగా ఆవిరి (వేడి) మీద ఉడికించిన(కుక్కర్లో ఉడికించినట్టు), కుట్టారుగ= పొట్టి ఆరుగ ధాన్యపు, ఓగిరం= అన్నం. చిన్న ఆరుగులనే ధాన్యం ఆ రోజుల్లో బాగా పండేవి

కాబోలు. ఈ ధాన్యాన్ని ఆవిరిమీద ఉడికించి తినేవాళ్లని రాయలవారి ఈ పద్యం ఓ కొత్త విశేషాన్ని చెప్పింది.

పాలేర్లు పశువుల్ని మేపటానికి పొలాలకు తీసుకుపోయారు. దూడలు మాత్రం ఇంటిదగ్గరే ఉన్నాయి. వాటిని మంచాలకు కట్టేశారు. అది కుంపటిమంచం. అంటే, మంచానికి కింద కుంపటి అమర్చి ఉంటుంది. ఆ కుంపట్లో మేక ఎరువు (ఎండిన పెంటికల్ని) వేసి నిప్పు రాజేస్తారు. కుంపట్లోంచి వెచ్చదనం మంచం మీద పడుకున్నవారికి తగులుతూ ఉంటుంది. అలా చలికాగుతూ మంచాల మీద పడుకున్న రైతుల కాళ్లను దూడలు నాకుతున్నాయిట. ఇదీ ఆ పద్యంలో కనిపించే ఓ సంక్షిప్త శబ్దచిత్రం.

ఒక్క పద్యంలో గ్రామీణ జీవితాన్ని అద్భుతంగా ప్రతిఫలింపచేశాడు మహాకవి శ్రీకృష్ణదేవరాయలు !!

**పొరివిళంగాయలు**

"భక్తిఁ ద్రోవకు సాధ్వి పరికరంబులు వెట్టి కట్టిన / పొరివిళంగాయ గమియున్..." శ్రీకృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద కావ్యంలో అలవోకగా ప్రస్తావించిన ఒక తెలుగు వంటకం పొరివిళంగాయ.

శ్రీవిల్లిపుత్తూరు నుండి విష్ణుచిత్తుడు పాండ్యరాజు దర్శనార్థం బయల్దేరినప్పుడు దారిలో తింటానికి ఆయన ఇల్లాలు కొన్ని పొరివిళంగాయలు పొట్లాం కట్టి ఇచ్చిందట.

"చక్కెర బుగుడలు, నుక్కెరలు కరిబాలు పొరివిళంగాయలు తేమనంబులు" అంటూ హంసవింశతి కూడా ఈ పొరివిళంగాయల్ని పేర్కొంది.

11వ శతాబ్దపు మానసోల్లాస గ్రంథంలో బియ్యం, పెసలు వేగించి విసిరిన పిండిని బెల్లం పాకం పట్టి చేసిన చలిమిడి ఉండల్ని పొరి విళంగాయలన్నట్టు ఆహార శాస్త్రవేత్త కె. టి. అచ్చయ్య వ్రాశారు.

'పొరి' అంటే మూల ద్రావిడభాషలో వేగించటం అని ! తమిళంలో పొరియల్=వేగించటం, వేపుడు వంటకం. తెలుగులో అది పొరటు అయ్యింది.

వేగించిన వాటిని కన్నడంలో బురుగులు, తెలుగులో బొరుగులు అంటారు! 'పొరి విళంకాయ్' అంటే వేగించిన పెసల పిండిని పాకం పట్టిన ఉండలని తమిళ లెక్సికాన్ అర్థాన్నిచ్చింది.

తమిళనాట ఇప్పటికీ ''పొరివిళంగాయ్ ఉరుండాయ్'' పేరుతో పొరివిళంగాయల ఉండల్ని వండుకుంటున్నారు. కప్పు బియ్యం, అరకప్పు గోధుమలు, అరకప్పు పెసరపప్పు, అరకప్పు శనగపప్పు, రెండు చెంచాలు కొబ్బరి కోరు వీటిని కొద్దిగా నెయ్యివేసి విడివిడిగా వేగించి అన్నింటిని మిక్సీ పట్టిన పిండిని బెల్లం పాకంలో కొద్దికొద్దిగా కలుపుతూ నేతితో చలిమిడి చెయ్యాలి. ఈ చలిమిడి ఉండలే పొరివిళంగాయ ఉండలు.

తెలుగువారి 'పోక ఉండలు' కూడా ఇలాంటివే ! పోక (వక్క) చెట్టు కాయల ఆకారంలో చిన్నవిగా చేస్తారు కాబట్టి, వీటిని "పోక ఉండ" లన్నారు. 1904లో అచ్చయిన 'వంటలక్క' అనే పుస్తకంలో 'పోక ఉండలు' తయారీ వివరంగా ఉంది: "వేగించిన బియ్యప్పిండిని, నువ్వు పప్పు, కొబ్బరి తురుముల్ని బెల్లం పాకంలో కలిపి, నేతితో చలిమిడి చేసి చిన్న చిన్న ఉండలు కట్టుకోవాలి. పెసరపప్పు బియ్యం కలిపి నానబోసి గరిటజారుగా రుబ్బిన తోపు పిండిలో ఈ ఉండల్ని ఒక్కొక్కటే ముంచి నూనెలో వేసి పూర్ణాలమాదిరి వేగిస్తారు. వీటిని పోక పూర్ణాలంటారు. కొందరు తోపుపిండిలో ముంచకుండా నేరుగా నూనెలో వేగించి పోక ఉండలు చేస్తున్నారు. ఇవి బూరెల్లా ఉంటాయి".....అని ఈ గ్రంథం వివరించింది.

అస్సామీ వాళ్ళకీ 'పోక మిఠాయి' అనే వంటకం ఉంది. వాళ్లు నేతి చలిమిడి చేసి చిన్న ఉండలు కట్టి నూనెలో వేగించకుండా పొడి బియ్యప్పిండిలో పొర్లిస్తారు. ధనికుణ్ణి 'ఆసామి' అంటాం కదా... అస్సామీ ధనికుడిని బట్టే ఈ 'ఆసామి' పదం వచ్చిందని చెప్తారు. ఒకప్పుడు అస్సామీయులు దేశం అంతా విస్తరించిన ధనిక జాతే! అందుకే, దేశంలో అందరి వంటకాలూ వాళ్లకు తెలుసు. అస్సామీ నిఘంటువులో 'పోక' అంటే, ఒక పురుగు అనే అర్థం కనిపించింది. కానీ, అస్సామీయులు ఈ స్వీటుని మన పోకఉండల్ని బట్టే, 'పోక మిఠాయి' అన్నారు.

**మామిడిముక్కలతో చేపల పులుసు**

తారుణ్యాతిగ చూత నూత్న ఫలయు క్తైలాభిఘార స్వన
ద్దారా ధూపిత శుష్యదంబు హృత మాత్స్య చ్ఛేద పాకోద్గతో
ద్గారంపుంగన రార్చు భోగులకు సంధ్యా వేళలం గేళి కాం
తారాభ్యంతర వాలుకాస్థిత హిమాంత ర్నారి కేళలాంబువుల్.

వేసవి కాలంలో లేత మామిడికాయల ముక్కలతో చేపల కూర గురించి శ్రీకృష్ణదేవరాయలు ఈ పద్యంలో వర్ణించాడు. నిజానికి, వింత వంటకాల్ని వర్ణించటంలో రాయలవారు శ్రీనాథుణ్ణి ఒకింత మించిన వాడనే చెప్పాలి. భోజన వర్ణనలు చేశాడని శ్రీనాథుణ్ణి భోజన ప్రియుడన్నారు. భోజనం లేకపోతే మనుగడే లేదు కదా !

మనుషులంతా భోజన ప్రియులే ! కానీ, రాయలవారిని అంతమాట అనే ధైర్యం మన పండితులకు లేదు. శ్రీనాథుడైనా, రాయలవారైనా తమ భోగాన్ని కాదు, ఆహారాన్ని ఆస్వాదించే జనాల భోగాన్ని వర్ణించారు.

ఈ పద్యంలో రాయలవారే 'భోగులు' అనే పదం వాడాడు. భోగులంటే ఎవరు? భోజనాన్ని రుచిమంతంగా, ఆరోగ్యదాయకంగా వండుకుని ఆస్వాదిస్తూ, తినేవాడు భోగి. అనుభవం, సుఖం, భోజనం అని భోగానికి మూడు అర్థాలున్నాయి. ఆహారాన్ని ఆహా...ఓహో అంటూ ఆస్వాదిస్తూ తినాలి ! మౌనంగా భుజిక్రియ అయ్యిందనిపించటం భోగం కాదు.

మండు వేసవిలో ఆకాశం నిప్పులు కక్కుతుంటే, ఇంట్లో చల్లగా కూర్చుని భోగులు తరుణ దశ దాటిన తాజా లేత మామిడి కాయ ముక్కల్ని అలాగే, నీళ్ళు ఎండి, వట్టిపోతున్న చెరువుల్లోంచి తెచ్చి తరిగి శుభ్రపరచిన చేప ముక్కలతో కలిపి ఉడికించి, కమ్మని తాలింపు పెట్టి ఆస్వాదిస్తూ తిన్నారట,

విస్తట్లో అన్నీ వడ్డించాక, ఆఖర్న నెయ్యి తెచ్చి అన్నం మీద కొద్దిగా వేయటాన్ని అభిఘారం అంటారు. ఈ పద్యంలో కొద్దిగా నూనెని అభిఘరించి తాలింపు పెట్టినట్టు

రాయలవారు వ్రాశారు. కొద్దిగా నూనెలో తాలింపు గింజలు అటూ ఇటూ కదుపుతూ వేగిస్తారు కాబట్టి సాతాలింపు, తాలింపు అన్నారు. గవ్వలాటలో గవ్వల్ని అటూ ఇటూ కదిల్చి వేయటాన్ని తాలించటం అంటారు. ఇది వంటగదిలోంచి వెళ్ళిన పదమే కావచ్చు. తాలించి కూర, పప్పు, పులుసు, పచ్చడి వగైరా వంటకాల మీదకు వంచగానే పొగలు వస్తాయి కాబట్టి పొగపు, పోపు, అన్నారు. అలా పొగచిన పోపుని వంటకం మీద తిరగపోస్తారు కాబట్టి తిరగపోత, తిరగబోత అన్నారు. తిరగబొయ్యగానే చుయ్యిమనే మోత వస్తుంది కాబట్టి, తిరగమోత అనీ, వెంటనే మూతపెడతారు కాబట్టి తిరగమూత అనీ పిలుస్తారు.

"తిరిగి వచ్చిన భార్య, తిరుగబోత వేసిన కూర బహు రుచి" అని తెలుగు సామెత !

అసలే ఎండ. తిన్నదేమో చేపల కూర. దాంతో సాయంత్రం అయ్యే సరికి ఉద్గత ఉద్గారాల కనరు అంటే విపరీతంగా కారపు త్రేన్పులు రావటం మొదలెట్టాయట. ఈ కారానికి గ్రామాల్లో అప్పటికప్పుడు దొరికే విరుగుళ్లు కొబ్బరి నీళ్లు.

ఎండ తగలకుండా నీడ ఉండే స్థలంలో పెద్ద గొయ్యి తీసి కొంత ఇసుక నింపి, దాని పైన కొబ్బరి బోండాల్ని పరిచి వాటి పైన మళ్ళీ ఇసుక పోసి మూయటాన్ని ఇసుక పాతర వెయ్యటం అంటారు. ఈ ఇసుకని మాటిమాటికీ నీళ్ళతో తడుపుతుంటే కొబ్బరి బోండాలలో నీళ్లు చల్లబడతాయి. రెఫ్రిజిరేటర్లు, ఐసు తయారు చేసే యంత్రాలేవీ లేని ఆ రోజుల్లో చల్లదనానికి గ్రామీణులు ఆశ్రయించిన పద్ధతి ఇది.

అప్పుడే టెంకె పట్టున్న మామిడికాయని 'తారుణ్యాతిగ చూత నూత్న ఫలం' అనీ, చెరువు ఎండిపోతుంటే ఆఖరున మిగిలిన చేపల్ని 'శుష్యదంబు హృత మాత్స్య' అని, చుయ్యని మోగేలా వేసిన తిరగపోతని అలాగే, నూనె తాలింపుని 'తైలాభిగార స్వనద్వారా ధూపితం' అనీ వర్ణించి, పాణింధమములు లాంటి పదాలు వాడిన శ్రీనాథుణ్ణి మించి పోయారు రాయలవారు.

భోజనం ఒక భోగం, ఒక యోగం కూడా ! ❑

# రాయలనాటి సమాజం

## రాయలవారి రైతు

కాలునిదున్న నందినయి గంటలు దున్నక మంటి నా మహో
కాలుని నంది దున్న నయి కర్దమమగ్నత లేక మంటి నా,
హాలికులెన్నండుం దెగనియౌరులచేలును, జాకుమళ్లుమం,
గా, లలి వేరు సాంగి రిలc గల్గుపసింగొని పేద మున్నుగ్గ"

ఓ రాజుగారికి పొలంలో పనిచేసుకునే రైతుల కష్టసుఖాల గురించి ఇంత వివేచన, ఇంత పరామరిక ఉంటుందా అని ఆశ్చర్యం కలుగుతుంది... ఈ పద్యం చదివితే !

వ్యవసాయం మీద పన్నులు వేయటమే తెలుసు గానీ వ్యవసాయ పనుల గురించి ప్రభువులకే కాదు ప్రభుత్వాధికారులకు మాత్రం ఏం తెలుస్తుంది...? అనుకుంటాం ! కానీ, రాయలవారి విషయంలో అది నిజం కాదు. సమకాలీన కవులలోకెల్లా రాయలవారి సామాజిక స్పృహ ఎన్నదగినిదిగా కనిపిస్తుంది. ఆయన ప్రతీ పద్యంలోనూ ఎంతో కొంత సమాజం కనిపిస్తుంది.

వానల సమృద్ధి వలన నాగలికి పని తగ్గుతుంది. రైతుకీ శ్రమ తగ్గుతుంది. అహల్యంగా అంటే దున్నకుండా వదిలేసిన భూములకూ జీవకళ వస్తుంది. వ్యవసాయం తొలి దశనాటి జీవనానికి అహల్యాశాప విమోచన వృత్తాంతం ఒక సాక్ష్యం. శ్రీరాముడు నాగలిని పరిచయం చేసి, రాయీ రప్పలతో అహల్యంగా(దున్నని రాళ్ళనేల) ఉన్న భూమిని పునరుత్పత్తికి దోహదపడే వ్యవసాయ క్షేత్రంగా మార్చాడని ఈ కథ మనకు చెప్తోంది.

రైతు కాలు స్పర్శ తగిలితే రాయి ఆడదయ్యిందనటం వెనుక లోతైన అర్థమే ఉంది. రైతు ప్రాధాన్యతని చాటిన కథ ఇది. ఒక ఋషి కుటుంబ వ్యవహారంగా మాత్రమే చూస్తే ఈ కథలో తెలుసుకో గలిగేదేమీ ఉండదు.

రాయలవారి బాల్యం చంద్రగిరిలోనే అధికంగా జరగటం వలన చంద్రగిరి చుట్టూ ఉన్న గ్రామీణుల జీవితాలతో ఆయనకు ఎక్కువ పరిచయం ఉంది. పరిచయాన్ని కవిత్వీకరించి కావ్యం చేయటం గొప్ప విషయం. ఇది కూడా యుద్ధంలో గెలిచినంత పరిశ్రమే ! అందుకే ఆయన సాహితీ సమరాంగణ సార్వభౌముడయ్యారు.

ఈ పద్యంలో రాయలవారు వానలు బాగా కురిస్తే రైతుకు ఏ విధంగా మేలు జరుగుతుందో వివరిస్తున్నాడు : పనిలో పనిగా కొన్ని వ్యావసాయిక పదాలను కూడా ఈ పద్యంలో పరిశీలన చేద్దాం :

- **కాలుని దున్ననందినయి :** వానలు సమృద్ధిగా ఉంటే మొదట సంతోషించేది కాలుని దున్న ! యముడివాహనం అయిన దున్నపోతుకీ వానకీ సంబంధం ఏమిటీ...? దున్నే పోతు కాబట్టి దున్నపోతు అయ్యింది. "దున్నపోతు మీద వాన కురిసినట్టు" అనేది తెలుగు సామెత. వానని పట్టించుకోని దున్నపోతుకి ఈ వానని చూస్తే సంతోషం అయ్యిందట.
- **గంటలు :** తెలుగులో గంట అనేది వ్యావసాయిక పదం. గడియారపు గంట కాదు, గంట అంటే, గడ్డి దుబ్బు. గంటలు అంటే దున్నక పోవటం వలన బీడు పడి అవురుదుబ్బులుగా గడ్డి పెరిగిన మెట్టచేలు అని ! 'పైరు బాగా గంటకట్టు కొస్తోంది' అంటే, రాయలసీమలో వరిమొక్కలు విస్తారంగా పెరిగాయని ! గంటాలమ్మ అనే దేవత బహుశా ఈ వ్యావసాయిక దేవతే కావచ్చు కూడా !
- **మంటి :** మంటి అంటే, మట్టి లేదా మన్ను అనే కాదు–మను, మనుగడ, బతకటం అనే అర్థం కూడా ఉంది. మంటినాను అంటే, హమ్మయ్య కడతేరాను, బతికి పోయాను అని ! ఇంత వాన కురవటం వలన ఈ గడ్డి

దుబ్బు నేలని కష్టపడి చదును చేసే శ్రమ తప్పిందని సంతోషపడింది కాలుని దున్న.

- **కర్దమ మన్నత :** ఇదొక చక్కని సంస్కృత పదబంధం. కర్దమం అంటే అదుసు లేదా బురద. భూమిని బాగా తడిపి దమ్ము చేయటానికి దున్నపోతుల్నే ఉపయోగిస్తారు. ఆవులు, ఎడ్లు బురదను ఇష్టపడవు. కాబట్టి, బురదలో పనులకు దున్నపోతులే తగినవి. ఈ వాన వలన కాలుని దున్న కూడా తనకు బురదమర్యాద తప్పిందనుకుందట. రాజకీయ నాయకులు ఒకరిమీద ఒకరు బురదజల్లుకోవటం కూడా ఇలాంటి కర్దమమన్నతే...!
- **మహాకాలుని నందిదున్న :** పరమేశ్వరుడి నందిదున్న అంటే ఎద్దు. వ్యవసాయ పనుల్లో ఎడ్లనే పొలాలు దున్నటానికి ప్రముఖంగా వాడతారు.
- **కర్దమమగ్నత :** బురదలో పొర్లటం; పొలం దున్నేప్పుడు ఎడ్లకూ తడి మట్టి అంటుతుంది. బురద అంటడాన్ని కర్దమ మగ్నత అన్నారు రాయలవారు. బట్టలకు మట్టి అంటితే ఎక్కడ బురదలో పొర్లి వచ్చావని అడగటం లాంటిది. బురదంటే ఎద్దుకి ఎంత అసహ్యమో ఈ పదబంధం ద్వారా వ్యక్తపరిచారు రాయలవారు.
- **హాలికులు :** హలం (నాగలి) వలన జీవించేవారు.
- **ఔరుల చేలు :** ఔరు అంటే అవురుగడ్డి పెరిగిన భూమి. వ్యవసాయ యోగ్యత లేకుండా ఉండిపోయిన బంజరు భూమి. బంజరు అనేది హిందీ పదం. తెలుగులో ఔరుచేలు అంటారు. ఈ పదాన్ని మరచి పోయి హిందీ పదానికి అలవాటు పడిపోయాం.
- **జౌకుమళ్లు :** జౌకు లేదా జవుకు అనేది కూడా వ్యావసాయికపదమే. ప్రస్తుతం వాడకంలోంచి తప్పుకుంది. అది తప్పుకో లేదు, మనమే వాడటం మానేశాం. జౌకునేల లేదా జౌకు మడి అంటే ఊటనేల (swampy ground) ... ఊసర క్షేత్రాలు కూడా ఊట భూములుగా మారినందుకు

సంతోషించాయట. వానవలన రైతులు, పశువులతో పాటు నేల కూడా ఆనందించిందంటారాయన.

రాజుగారు సుపాలన అందిస్తే వర్షాలు సమృద్ధిగా కురిసాయని నిరూపించటానికి రాయలవారు ఇన్ని ఉత్ప్రేక్షలు ప్రయోగించారు. "నెల మూడు వానలు నింగి కురిసె" అని మనుచరిత్రలో పెద్దనగారు రాయలవారి పాలన గురించి రాశారు ఇలాగే !

**రైతు పండితులకు గండపెండేరం**

వరcజుబడి రొంపిc ద్రొక్కం
జరణంబులc జుట్టి పసిcడి చాయకడుపులం
బొరి నీరుకట్టె లమరిమ
బిరుదములు హాలికులు దున్నcబెట్టిరొ యనగcన్" ఈ చిన్న కందపద్యంలో రైతుపాదానికి రాయలవారు గండపెండేరం తొడిగారు..

రొంపి తొక్కటం అంటే, అడుసుతొక్కటం. నేలను దమ్ము చేయటం. అలా ఆ బురద తొక్కుతున్నప్పుడు ఆ బురదనేలలో ఉండే చిన్నచిన్న బురద పాములు రైతుల కాళ్లకు చుట్టుకుంటూ ఉంటాయి. అవి ప్రమాదం లేని పాములు వాటిని నీరుకట్టె లన్నారీ పద్యంలో రాయలవారు. నీటిపాములన్నమాట. రైతుపాదాలకు చుట్టుకున్న ఈ నీటిపాములు పసిడిచాయలో ఉండి రైతు పండితుల కాళ్ళకు కట్టిన బిరుదులు అంటే గండపెండేరాల్లా అనిపిస్తున్నాయట. వ్యవసాయ పాండిత్యం కలిగిన రైతుకు రాయలవారిచ్చిన గౌరవ భావన ఇది.

ఈ పద్యంలో వరజుబడి అంటే, పొలంగట్లవెంబడి అని ! 'వరజు' మూలద్రావిడ పదం. తమిళంలో వరంపు, వరప్పు వరై–కన్నడంలో బర, బరె, వరి, వరె– తెలుగులో వరజు = సరిహద్దుగా వేసిన పొలంగట్టు (DEDR 5261). 'గనిమ' అనీ అంటారు.

మూలతెలుగు (Proto-Telugu) శబ్దం var – అంటే అడ్డుకట్ట లేదా హద్దుగా పోసిన కట్ట. తెలుగులో వర్జుగాను, వ్రప్పిగానూ వాడకంలోకి వచ్చింది. ఈ వర్

‘వర’గా తెలుగులో స్థిరపడింది. ‘అంత వర–కు ఆగండి’, దాని వరకు వెళ్ళండి అంటే ఆ హద్దు దాకా అనే ! మేర అనేది దీనికి సమానార్థకం. ‘ఆ మేరకు’, ‘అంత మేర’ లాంటి ప్రయోగాలు ఇప్పటికీ వాడకంలో ఉన్నాయి.

పదాల మూలాలు తెలిసినప్పుడు దాని వాడకానికి వన్నె తేగలుగుతాము. కానీ, వరజు అనేది వాడకంలోంచి తప్పుకుంది. ఇతర ద్రావిడ భాషల్లో సజీవంగా ఉండి ఒక పదం తెలుగులో మరణించటం మనకు ఘనమైన విషయం కాదుకదా!

**బీరపువ్వు లాంటి రాగి నాణాలు**

వాద మొనరించి గెలిచి తత్త్వంబు దెలుపు
వాని కని బీరపువ్వులఁ బోని టంక
సాల వాటులు నించి యాస్థానిఁ గట్టం
గాల సర్పము గతి నలు జాలెం జూచి”

ఆముక్తమాల్యద కథలో పాండ్యరాజు దైన్యంలో మునిగిపోయి ఉన్నాడు. రోజువారీ రాజవ్యవహారాల పట్ల ఆసక్తి చూపించ లేకపోతున్నాడు. అన్ని కార్యక్రమాలనూ వాయిదా వేసి, కాసేపు కవి పండితులతో గడిపితే మనశ్శాంతైనా ఉంటుందని భావించి రాజ్యంలో అందుబాటులో ఉన్న కవుల్ని పిలిచాడు. వాళ్లలో వాళ్ళకే పోటీ పెట్టాడు. తర్కంలో ఎవరు గెలిస్తే వాళ్లకి అప్పుడే కొత్తగా టంకశాలలో ముద్రించిన పచ్చని బీరపువ్వుల్లాంటి బంగారు నాణేలను బహూకరిస్తానన్నాడు. ఇంకా చలామణిలోకి వెళ్ళని నాణాలు కాబట్టి చాలా ప్రత్యేకమైనవి. వాటిని ఒక సంచీలో మూటగట్టి సభాస్థలి మధ్యలో వ్రేలాడ కట్టించాడు.

రాయలవారి కాలంలో కూడా రాగి కలవని దీనారాలు చెలామణిలో ఉండేవని దీన్నిబట్టి అర్థం చేసుకోవచ్చు.

ఈ పద్యంలో బంగారు నాణాలను బీరపువ్వుతోనూ, నాణాల సంచీని కాలసర్పంతోనూ పోల్చారు. పచ్చని బీరపూలు మేలిమి బంగారు రంగులో ఉంటాయి. రాగి ఏమాత్రం కలవని 24 కేరెట్ల స్వచ్ఛమైన బంగారు నాణాలని చెప్పటానికి

పచ్చబీర పూల ప్రస్తావన తెచ్చాడు రాయలవారు. మరి, కాలసర్పం మాటేమిటీ ? తరువాత జరగబోయే కథతో ముడిపడిన అంశం అది.

శ్రీ విల్లిపుత్తూరులో విష్ణుచిత్తుడు మంచివాసనగల తులసి దండను అష్టాక్షరి జపిస్తూ స్వామి విగ్రహం మెడలో వెయ్యబోగా, స్వామి విష్ణుచిత్తుడితో "పాండ్యరాజు మోక్షాసక్తిలో మునిగి ఉన్నాడు. పండితులకు తర్కపరీక్ష పెడ్తున్నాడు. ఇదే సమయం. ఆ పండితుల గర్వం అణచి, తర్కంలో గెలిచి నా మహిమను ప్రకటించు. ప్రభువు ఇచ్చే సత్కారం స్వీకరించు..." అని చెప్తాడు.

విష్ణుచిత్తుడనే భక్తుడు స్వామి అనుగ్రహంతో వస్తున్నాడు. ఈ సభలో ప్రతి ఒక్కరినీ ఓడిస్తాడు అని చదువుతున్న మనకు అర్థం కావటానికి సభలో ఆ పండితులకు బంగారు నాణాల మూట కాలసర్పంలా కనిపిస్తోందన్నాడు.

**ఎండాకాలంలో ఓ రోజు**

"అతివృష్టిన్ మును వార్ధి గూర్చునెడ కాఁడౌటన్ దమిన్ గూర్చున
న్మతి లంచంబుగ హేమటంకములు మింటన్ బొల్చు పర్దన్యదే
వతకీ నెత్తిన కేల నాఁ బొలిచె, నిర్వారిస్రవంతి న్భయ
శ్చ్యుతి నగ్రమచ్ఛద దృశ్యకర్ణికములై యున్నాళ నాళీకముల్"
కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యద కావ్యంలో వ్రాసిన పద్యం ఇది.

వానలు బాగా కురిసేటువంటి ఆ రోజుల్లో, మనుషుల్లో కొద్దిగా నైనా పాపభీతి ఉండేది. మొక్కలు నరకటం, నీటిని వృథా చేయటం, అన్నం పారేయటం ఇలా చాలా విషయాల్లో పాపభీతి వెన్నాడేది. మనుషుల్లో మంచితనం వలన వానలు కొన్నయినా కురిసేవి. ఇప్పుడు మనకి ఎండాకాలం ఒక్కటే నడుస్తోంది. వాన కురిసినంత సేపే వానాకాలం ! అలాగే, చలి వేసిన ఆ కొద్దిసేపూ శీతాకాలం. మిగలిందంతా ఎండాకాలమే ! మునిమాణిక్యం వారన్నట్టు మనది ఎండామండిత ప్రదేశం !

వానలు లేక అలా ఎండిన ఒక జలాశయంలో కృష్ణదేవరాయలు తామరపూలు

వడలి పోతున్న ఒక దృశ్యాన్ని చూశాడు. అప్పటిదాకా నీళ్ళమీద తేలియాడిన తామర మొక్కల బతుకు బజార్న పడిందని అనిపించిందాయనకి ! మనుషుల్లో నిజాయితీ చచ్చిపోతే ప్రకృతి కన్నెర్ర జేస్తుందని పరోక్షంగా హెచ్చరించాలనుకున్నాడు.

తామరతూళ్ళు నిట్టనిలువుగా జొన్నదంటుల్లా నిలబడ్డాయి. అంతరిక్షంలో ఎగిరే పళ్ళాల్లాగా విహరించిన తామర పూరేకులు ఎండకు మాడి వడలి వాలి పోయాయి. తామరపూల మధ్యన ఉండే కర్ణికలు పచ్చగా పొడుచు కొచ్చినట్టు ఉన్నాయి. ఈ కర్ణికల్ని తామర దుద్దులు అంటారు. చెవులకు పెట్టుకునే బంగారపు దుద్దులు కూడా వీటిలానే గుబ్బలాగా ఉంటాయి కాబట్టి, వాటిని దుద్దులన్నారు. తామరపూల మధ్య అమ్మవారు ఈ మెత్తని దుద్దుమీదే కూర్చుంటుంది. వేసవి తాకిడికి ఆ దుద్దులు ఎండి వడిలాయి. ఇదీ అక్కడి దృశ్యం.

నదులు వెళ్ళి సముద్రంలో కలుస్తాయి. దీన్ని కవులు సాగర సమాగమం అని కూడా అంటారు : ప్రేయసీ ప్రియుల సమాగమం లాంటిదని ! నదిని సముద్రంతో కలిపే వాడు పర్జన్యుడు. అంటే, ఉరిమే మేఘం ! మామూలు భాషలో అమ్మాయిని అబ్బాయి దగ్గరకు చేర్చటాన్ని తార్చటం అంటారు. తమని సముద్రానికి తార్పులాదే మేఘుణ్ణి మంచి చేసుకోవటానికి నదులు సహజంగా ప్రయత్నిస్తాయి. అందుకు ప్రతిఫలంగా ప్రవాహాలు లంచం ఇచ్చుకున్నాయని రాయల వారంటారు. ఇప్పటి భాషలో దాన్ని బ్రోకరేజీ, కమీషన్ అని గౌరవంగా పిలుస్తున్నారు. రాయలవారు దీన్ని లంచం అనే అన్నారు. దిగువ స్థాయిలో ప్రభుత్వ కార్యాలయాలు ఎలా పనిచెస్తున్నాయో నాకు తెలుసనే హెచ్చరిక రాయలు చేస్తూ ఉండవచ్చు కూడా! దీన్ని ఇలాగే చెప్పి ఊరుకుని ఉంటే ఇందులో కవిత్వం ఏమీ లేదు. దీన్ని లోకానికి అన్వయించి చెప్పాలి. అది జనం మీద ప్రభావాన్ని చూపించాలి. కావ్య ప్రయోజనం అలా సిద్ధించాలని ఆశించారాయన.

మేఘుడి వాటా మేఘుడి కిచ్చేస్తే, వానలు కురిపించి తమని త్వరగా సాగరా నికి చేరుస్తాడని నదుల ఆశ. అప్పటికే వడలిన తామర తూళ్ళు ఆ ఎండు జలా శయాన్ని చేతులుగానూ వాడి వాలిపోయిన తామర పూలను చేతివ్రేళ్ళుగానూ

ఆయన భావించాడు. పూల మధ్యన ఉండే కర్ణికలు అంటే తామర దుద్దులు లంచం ఇవ్వటానికి అరచేతిలో పట్టుకున్న హేమటంకాల్లా (బంగారు నాణేలు) ఉన్నాయంటాడు. కృశించిన తన చేతుల్ని బారచాచి, నదులు తమ చేతుల్లో బంగారు నాణాలు చూపిస్తూ, 'ఇవి తీసుకుని వాన కురిపించ వయ్యా' అని మేఘుణ్ణి అడుగుతున్నట్టుగా ఉందట. అవినీతి, లంచగొండి తనాలు ప్రపంచ పరివ్యాప్తం. వానలు కురవాలంటే మేఘాలకు లంచం మేపాలన్న మాట. లంచగొండుల్ని ఒక కంట కనిపెడుతూనే, ప్రభుత్వ యంత్రాంగాన్ని నడిపించాలనేది రాయలవారి అభిప్రాయం !

**దొంగస్వాములు**

"అక్షర పక్షపాతమున నర్థము నూళ్ళ నొనంగ నుబ్బునన్
భిక్షు జటాధరాధికులు భిన్న నిజవ్రతులౌదు, రైన దు
ర్భిక్ష రుజా శిశు చ్యుతులుపెక్కగు, భక్తియు చాలు, దానఁద
త్పక్షుభితత్వమే యఘముఁ దార్పదు శంక దలంగుమయ్యేదన్"
(ఆముక్తమాల్యద 4.242)

ప్రభుత్వానికి అక్షర పక్షపాతం ఉండకూడదని కృష్ణదేవరాయలు బల్లగుద్ది భజాయించి మరీ చెప్తున్నాడీ పద్యంలో ! చదువుకున్న వాడు తిన్నగా ఉంటే "సాక్షరా" అవుతాడనీ, బుద్ధి వికటిస్తే సర్వం తిరగబడి "రాక్షసా" అవుతాడనీ ఓ చాటువుంది. దీన్ని దృష్టిలో పెట్టుకునే, చదువుకున్నాడు కదా అని పురస్కారాలు, గౌరవాలు, వంగి దణ్ణాలు పెట్టకుండా ముందు జాగ్రత్తగా ఆలోచించు. ఆ పేరుతో జటాధరాధికులు అంటే మతతత్త్వ వాదులు "ఉబ్బుతారు" అంటాడు. అంటే, ఒళ్ళు పొగరెక్కి వ్యవహరిస్తారన్నమాట. సాక్షరులు రాక్షసు లౌతారు. కాబట్టి అక్షర పక్షపాతం లేకుండా అగ్రహారాలు వగైరా ఆలోచించి ఇవ్వాలన్నారు రాయలవారు.

సాధు సన్యాసులక్కూడా లోకోత్తరమైన, లోక హితాన్ని కోరే బాధ్యత లున్నాయి. వాళ్ళ బాధ్యతల్ని వాళ్లు ప్రతిఫలాపేక్ష రహితంగా నెరవేర్చాలి. ప్రధాన మంత్రులూ, ముఖ్యమంత్రులూ, మంత్రులూ, అధికారులూ అదేపనిగా మఠాలు,

బాబాల ఆశ్రమాలను సందర్శించటం వలన, “శాంక్టిటీ ఆఫ్ శాంక్టోరం (ఆలయ పవిత్రత) అంటామే అది దెబ్బతింటుంది. లోకానికి దారి చూపించవలసిన వ్యక్తులు చెడిపోతే లోకానికి అపకారమే కదా ! అందువలన అరాచకం ప్రబలుతుంది. దుర్భిక్షం ఏర్పడుతుంది. రోగాలు వ్యాపిస్తాయి. మనుషులు అర్ధంతర చావులు పొందుతారు...” అని హెచ్చరించాడాయన.

“భక్తియు చాలు” అన్నాడు రాయలవారు. ప్రభుత్వాధిపతుల మద్దతు వలన బాబాల చుట్టూ మాఫియాలు చేరతారని రాయల వారు ఆనాడే ఊహించాడు. అనుచితమైన భక్తిని ఈ భక్తిబేహారుల పట్ల పెంచుకోవద్దన్నాడు. అందువలన తూరీయాశ్రమ ధర్మాలకు తిలోదకాలిచ్చి సర్వసంగ పరిత్యాగులు సంచీలు నింపు కునే పనిలో పడతారు. రాజసన్మానం మితిమీరితే ఎంత అపకారం జరుగుతుందో తెలుగు నేలపైన ఉదాహరణలకు కరువు లేదు.

**రాయలనాటి రెస్టారెంట్లు అక్కలవాడలు**

“అక్కలవాడల నరకూళ్ళు మెక్కి” అనే దానికి “వీధులలోనికి పోయి, ‘అక్కా.. అమ్మా...’ అని స్త్రీలను మంచివారిని చేసుకుని, బతిమాలుకుని సగము గడుపున కన్నము తిని” అనే అర్థాన్ని వేదం వారు రాశారు. చాలామంది ఈ వ్యాఖ్యానంతో ఏకీభవించలేదు.

రాయల వారి కాలంలో అక్కలవాడలూ అందులో నక్షత్రాల హొటళ్ళు చరిత్ర ప్రసిద్ధి చెందినవే ! అక్షవాడ అంటే మల్లయుద్ధం జరిగే ప్రదేశం. దాన్నే అక్కలవాడ అనేవారు తెలుగులో ! వసతి, భోజనం ఇంకా అన్ని ఇతర సౌకర్యాలు కలిగిన హొటళ్లలాంటివి అక్కలవాడలో ఉండేవి. వ్యాయామం చేసుకునేందుకు జిమ్, అరువాటిక అంటే జూదం, తాగుడు ఉండే బార్ లాంటివి ఈ అక్కలవాడలో ఉండేవి ఆరోజుల్లో.

మనవాళ్లని చూసే పోర్చుగీసులు, ఫ్రెంచివాళ్లూ రెస్టారెంట్లను నెలకొల్పారు. అద్దె చెల్లిస్తే పడక వసతులు, పడక సౌఖ్యాన్నిచ్చే పడతులు, భోజన హోటళ్లు,

మసాజ్ సెంటర్లు ఒకటేమిటీ అన్నీ దొరికే అక్కవాడలు రాయల యుగంలో రాజధాని నగరంలో ఉండేవి.

అద్దెకు విశ్రాంతి 'రెస్ట్-ఎ రెంట్' అనే వ్యవస్థ రెస్టారెంట్ అనే ఫ్రెంచి పదానికి మూలం కావచ్చు ! restaurant అనేది ఫ్రెంచి క్రియాపదం restaurer తనని తాను తిరిగి సన్నద్ధం చేసుకోవటం అనే పదం లోంచి పుట్టిందని చెప్తారు. ఫ్రాన్సులో అన్నీ దొరికే రెస్టారెంట్ల వ్యవస్థ 1789 ఫ్రెంచి విప్లవం వరకూ మొదలు కాలేదు. కానీ, విజయనగర సామ్రాజ్యానికి అతిథులుగా వచ్చే విదేశీయుల కోసం రాజధాని నగరం అక్కవాడల్లో 15వ శతాబ్దినాటికే రెస్టారెంట్లు నిర్వహించినట్టు సాహిత్యాధారాలు పుష్కలంగా ఉన్నాయి.

కన్నడంలో "అక్కజం"అంటే అనురాగం. కానీ తెలుగులో ఇది "అవసరం"గా మారింది. అక్కజము గొను = ఆశించడం. అక్కజ తీర్చు = కోర్కె తీర్చడం. అక్కజ గత్తె = తీవ్రవాంఛ గల జాణ ! అక్కజగండడు - అవసరం తీరాక దులుపుకు పోయేవాడు. వీళ్ళంతా అక్కలవాడలో దర్శనం ఇస్తారు.

హరివంశం వ్రాసిన గౌరనకవి రాయలవారికి ముందుతరం వాడు. అందులో అక్కరగండడనే పెద్ద వడ్డీవ్యాపారిని ప్రస్తావిస్తాడు. అతను పరమ నిర్దయుడు. కాబూలివాలా లాంటివాడు. అక్కరగండడికి అక్కలవాడలో పనేమిటంటే, జూదగాళ్లకి, విటులకీ అవసరం తీరటానికి అప్పులిచ్చి ఆదుకునేవాడన్నమాట. "అక్కరకు రాని చుట్టము" అనే సుమతి శతకం పద్యంలో "అక్కర" అక్కలవాడలో అక్కర లాంటిది కాదు. అది శుభకార్యమే ! కానీ "అక్కర తీరాక అల్లుడు గతి" అనే సామెతలో అక్కరకు కొంచెం లోతెక్కువే ! ఆ శోభనం ఏదో జరిపించేస్తే అమ్మాయి మోజులో చెప్పుకింద తేలులా పడివుంటాడని అంతరార్థం !

'అకారకరభ' అనే వనమూలిక ఉంది. ఇది తక్షణం లైంగికోత్తేజాన్ని "పెంపొందించేందుకు ఉపయోగపడ్తుంది. దీన్ని తెలుగులో "అక్కలకర్ర లేదా అక్కరకర్ర అనడంలో తెలుగువారి కొంటెతనం తేలికగానే అర్థం అవుతోంది.

పేదరాసి పెద్దమ్మకథలు పూటకూళ్ళ హోటళ్లలోనే ఆ రోజుల్లో పుట్టాయి. పరదేశీయులు, పరాయి వాళ్లు కూడా రాచనగరికి వచ్చినప్పుడు ఈ పూటకూళ్ళమ్మే వాళ్ళకు కడుపు నింపేది. వాళ్లు ఊరి సంగతులడిగితే ఆమె చెప్పే కథలే పేదరాశి పెద్దమ్మ కథలు.

ఆముక్తమాల్యదని చేత్తో పుచ్చుకుంటే 500 ఏళ్లనాటి తెలుగు గ్రామాలలోని సాంఘిక జీవనం యావత్తూ మన అరచేతిలో కొస్తుంది. నేటి కాలపు పాలకులకు గోడకుర్చీ వేయించి చెవిమెలిపెట్టి చెయ్యి తిరిగేలా పాలనావ్యవహారాలు నేర్పించే పాఠాలు ఇందులో ఎన్నో ఉన్నాయి. ఇక్కడ ఇచ్చినవి మచ్చుకు కొన్ని ! ❑

# భువనవిజయ కవులు

రాయలవారు కొలువు దీరే సభా ప్రాంగణం భువనవిజయం. రాయలవారు నివశించే ఇంటి పేరు మలయకూటం. మలయకూటం నుండి భువనవిజయానికి వచ్చి రాచకార్యాలు నిర్వహించేవాడు శ్రీకృష్ణదేవరాయలు.

“శ్రీసదన లోచనాబ్జ ద
యాసార మరంద పోషితార్థి భ్రమరో
ల్లాసగుణ మలయకూట
ప్రాసాదనివేశ ! కృష్ణరాయమహీశా !”

“మలయకూట ప్రాసాదనివేశి’యని పారిజాతాపహరణంలో ముక్కు తిమ్మన రాయల వారి నివాసానికి మలయకూటం అనే పేరుందని వ్రాశాడు.

కృష్ణరాయలి నేత్రాలు సౌభాగ్య కలితాలైన తామరల్లా ఉంటాయని, తామర ల్లోని తేనె లాగా ఆయన కళ్ళు దయా రసాన్ని వర్షిస్తాయని, ఆ మకరందంతోనే ఆయన ఆశ్రితులైన కవుల్ని కళాకారుల్ని పోషిస్తున్నాడనీ దీని భావం. సమకాలీనుడు విన్నవో కన్నవో కాకుండా ప్రత్యక్షంగా చూసి వ్రాసిన సాక్ష్యం ఇది. అల్లసాని పెద్దన కూడా మనుచరిత్రలో మలయకూట ప్రస్తావన చేశాడు.

“తిరుమల దేవీ చరణో
దరలాకూ కల్పకల్పిత స్థలకమల
స్ఫుర దిందీవర బంధుర
హరిహయమణి మలయకూట హర్మ్యవిహారీ” అంటూ పెద్దనగారు ‘హరిహయమణి మలయకూట హర్మ్యవిహారీ’ అని సంబోధించాడు. భువనవిజయం రాయలవారి మానసపుత్రిక. ఇష్టపడి మనసుకు నచ్చినట్టు కట్టించుకున్నాడు. ఇది

గొప్ప సంసద్భువనం. ఇక్కడనుండి తెలుగు సారస్వతం రాయలవారి నేతృత్వంలో కనీసం 15 ఏళ్ళ పాటు రాజ్యం చేసింది.

భువన విజయానికి పెద్దనగారి మనుచరిత్ర, తిమ్మన గారి పారిజాతాపహరణ కావ్యాలకూ సంబంధం ఉంది. ఈ రెండు గ్రంథాలనూ ఇందులోనే రాయలవారికి, రాయలవారు ఆముక్తమాల్యదను శ్రీవెంకటేశ్వరునకీ అంకితం ఇవ్వటం ఈ భువనవిజయం సాక్షిగానే జరిగాయి.

"భువనవిజయాఖ్య సంస
ద్భవన స్థిత భద్రపీఠి బ్రాజ్ఞులగోష్ఠిన్
గవితామధురిమ డెందము
దవులన్ గొలువుండి సదయతన్ నను బల్కెన్"

అని పెద్దనగారు భువన విజయం అనే ప్రసిద్ధి పొందిన సంసద్భువనంలో జరిగే ప్రాజ్ఞుల గోష్ఠి సమయంలో కవితా మధురిమ గుండె నిండా నింపుకుని సదయతతో రాయలవారు తనతో ఇలా పలికాడంటాడు ఈ పద్యంలో పెద్దనగారు. పారిజాతాపహరణంలో నంది తిమ్మన గారు కూడా ఇలాంటి పద్యమే వ్రాశారు.

"భువనవిజయాఖ్య సంప
న్నవరత్న విభాప్రభాత నలినాప్త ! రమా
ధవచరణ కమలసేవా
ప్రవణసుతీ ! వీరరుద్రపర్వత వజ్రీ !"

భువనవిజయ సభాభవనము నవరత్న ఖచితం అనీ, ఆ నవరత్నాలకి బాలసూర్యుడి లాంటివాడు రాయలవారంటాడీ పద్యంలో ! బాలసూర్యుడు రత్నాల్ని ప్రకాశింప చేస్తాడు. కృష్ణరాయమహారాజు భువనవిజయం అనే పేరుగల తన కొలువులోని రత్నాల్లాంటి సభాసదుల హృదయాలను వికసింప చేస్తాడని భావం.

పెద్దన, తిమ్మన ఇద్దరూ భువనవిజయంలో అష్టదిగ్గజాలుండేవారని ఎక్కడా ప్రస్తావించలేదు. అష్టదిగ్గజాలనే భావన ప్రజల్లో ఉన్నదే గానీ వాస్తవంలో ఎంత ఉన్నదీ తెలీదు.

1938లో పురావస్తుశాఖవారు సౌతిండియా యాన్యువల్ రిపోర్టులో ఈ అష్టదిగ్గజాలనేవారు తెలుగు కవులనీ, అల్లసాని పెద్దన, నంది తిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు, ధూర్జటి, మాదయగారి మల్లన, పింగళి సూరన, రామరాజ భూషణుడు, తెనాలి రామకృష్ణుడు వీళ్లే అష్టదిగ్గజాలని ఉంది. ప్రచారంలో ఉన్న కథనాన్నే ఈ పురావస్తు శాఖ ప్రచురించింది గానీ, అందుకు తగిన సాక్ష్యాల్ని ఇవ్వలేదు.

రాయలవారు అష్టదిగ్గజాలను ఏర్పరచారో లేదో తెలీదు గానీ, తరువాత రాజ్యానికొచ్చిన రాయల సంబంధీకులు మాత్రం జనంలో ఉన్న నమ్మకాన్ని నిజం చేస్తూ అష్టదిగ్గజాలను తమ ఆస్థానాలలో కొనసాగించారనేది వాస్తవం.

అష్టదిగ్గజాల గురించి విశేషమైన ఆలోచన చేసినవారిలో ప్రముఖులు వీరే !

| | | |
|---|---|---|
| గురుజాడ శ్రీరామమూర్తి | 1893 | కవిజీవితములు |
| కందుకూరి వీరేశలింగము | 1895 | ఆంధ్రకవులచరిత్ర ; |
| చిలుకూరి వీరభద్రరావు | 1903 | జీర్ణకర్ణాటరాజ్య చరిత్ర ; |
| కొమర్రాజు వేంకట లక్ష్మణరావు | 1915 | మహమ్మదీయమహాయుగము ; |
| వేటూరి ప్రభాకరశాస్త్రి | 1922 | చాటుపద్య మణిమంజరి |
| నేలటూరి వేంకట రమణయ్య | 1935 | Studies in the History of the Third-Dynasty of Vijayanagara |
| చాగంటి శేషయ్య | 1950 | ఆంధ్రకవితరంగిణి |

ఇంకా నిడుదవోలు వేంకటరావుగారు, గాడిచర్ల హరి సర్వోత్తమరావుగారు, కుందూరు ఈశ్వరదత్తుగారూ ఇలా ఎందరో విజయనగర చరిత్రని విశ్లేషించే ప్రయత్నం చేశారు.

అష్టదిగ్గజాలంటే కేవలం కవులేనా? ఇతర రంగాల్లో దిగ్గజాలు ఉండరా?

అని పింగళి లక్ష్మీకాంతంగారూ ప్రశ్నించారు. పింగళివారు ఈ కవి దిగ్గజాలంతా తెలుగు కవులే ననటాన్ని ఆమోదించలేదు. ఆరుద్రగారు ఈ ఎనిమిదిమంది కవులెవరో వారి పేర్లేవో నికరంగా చెప్పలేమనీ, సంకుసాల నరసయ్య కూడా ఈ అష్టదిగ్గజాల్లో ఒకడు కావచ్చునీ అన్నారు. వేటూరివారు అష్టదిగ్గజాల్లో అయ్యలరాజు రామభద్రకవి ఒకడు కానేకాదన్నారు.

క్రీ.శ. 1520 లో రాయలు కడపమండలం తిప్పలూరు అను గ్రామాన్ని సర్వాగ్రహారముగా అష్టదిగ్గజ కవీశ్వరులకు దానం చేసినట్లు శాసనం ఉంది. కానీ అందులో ఆ దిగ్గజాలు ఎవరో పేర్లు లేవు. వీరి వివరాలతో రాయలు వేయించిన శాసనం ఒక్కటీ దొరక లేదు.

మైసూరు దగ్గర నందిదుర్గలో సోమేశ్వరాలయం ఉంది. అక్కడ ఉన్న కృష్ణదేవరాయల శాసనంలో అష్టదిగ్గజ ప్రశంస ఉందంటూ ఆ శాసనంలోని ఈ శ్లోకాన్ని వేటూరి ప్రభాకరశాస్త్రి గారు ప్రచురించారు :

యత్కీర్తి ర్భువనైక భూషణ మభూ ద్యస్యప్రసాదా న్నరా
స్సర్వే రాజసమానతా ముపగతాః, సంప్రాప్య విత్తం బహు
యు స్యాష్టౌ కవిదిగ్గజాః పృథు యశోభారా జగచ్ఛోభనా
యద్ధానోదక సామ్య మేవ సరితా మాసేతుశీతాచలమ్'

అష్టదిగ్గజాల గురించి కేవలం తెలుగువారిలోనే ప్రచారం ఉంది. ఇతర భాషా సాహిత్యాల్లో వాళ్ల ప్రస్తావన లేదు. తెలుగు వారికే పరిమితమైన సాంప్రదాయం ఇది. విజయనగర సామ్రాజ్యానంతరం కూడా ఈ సాంప్రదాయం ఆంధ్రదేశంలో కొనసాగింది.

ఆంధ్రరాజులైన తంజావూరు నాయకరాజులు, తరువాతి కాలంలో పెద్దాపురం, కార్వేటినగరం, గద్వాల లాంటి సంస్థానాలు ఈ సాహితీ సాంప్రదాయాన్ని కొనసాగించాయి. గోల్కొండ నవాబుల యేలుబడిలో ఉన్న సంస్థానాల్లో స్థానికంగా ప్రముఖులైన అష్టదిగ్గజ కవులుండే వారని నిడుదవోలు వేంకటరావుగారు వ్రాశారు.

రాయలకాలంలో అష్టదిగ్గజాల గురించి జనంలో ప్రచారంలో ఉన్న కథలు తప్ప గట్టి సాక్ష్యాధారాలు లేకపోవటం చేత అష్టదిగ్గజాలంటే రాజ్యం మొత్తంలో ఎనిమిది దిక్కులా వివిధ రంగాలకు చెందిన ప్రముఖులకు కల్పించిన ఒక ఉన్నత గౌరవంగానే భావించారు ! ఎనిమిది మంది సభ్యులతో కూడిన ఒక కమిటీ లాంటి వ్యవస్థ ఇది అయ్యే అవకాశమే లేదు. ఆనాటి తెలుగు కన్నడ, తమిళ, మలయాళ ప్రాంతాలకు చెందిన ప్రముఖులందరికీ భువనవిజయం సముచిత గౌరవాన్ని కల్పించి ఉంటుందని మనం తప్పక భావించాలి.

అష్టదిగ్గజాలంటే great Poets from Eight corners of the empire రాజ్యం అష్టదిక్కులనుండీ వచ్చిన మహాకవులకు ఈ భువన విజయ సభా భవనం అపారమైన గౌరవ సత్కారాలందించిందని అర్థం చేసుకోవాలి. తన సువిశాల సామ్రాజ్యంలోంచి దిగ్గజాలను ఏరాలంటే దక్షిణభారతదేశం ఎనిమిది దిక్కుల్నీ ఆయన జల్లెడ పట్టి మహాకవుల్ని, కళాకారుల్ని గుర్తించవలసి ఉంటుంది.

1. అఘోరశివాచార్యులు = నంది తిమ్మన, సంగయ్యలకు గురువు. 1449 వాడు. రాయలవారికి సన్నిహితుడు.

2. అభినవవాది విద్యానందుడు = కన్నడ కవి

3. అల్లసాని పెద్దన= ఈయన నిస్సందేహంగా రాయల సమకాలికుడే ! అష్టదిగ్గజాలనే వారున్నట్లైతే వారిలో మొదటి వాడు కూడా !

4. ఆచార్య దీక్షితుడు= రాయలవారికి సన్నిహితుడైన సంస్కృత కవి. తెలుగువాడు. ఈయన మనుమడే “తెలుగువాడుగా పుట్టటం తపఃఫలం” అని పేర్కొన్న అప్పయ్యదీక్షితులవారు. రాయలవారు కంచి వరదరాజ స్వామిని దర్శించుకోవటానికి దేవేరితో కలిసి వెళ్లినప్పుడు ఈ ఆచార్యదీక్షితులవారు ఆశువుగా ఓ శ్లోకం చెప్పారు= “కాంచి త్కాంచన గౌరాంగీం వీక్ష్య సాక్షాదివ శ్రియం / వరద సంశయాపన్నః వక్షస్థల మవేక్షత” అని ! స్వామివారి ఎదురుగా భక్తిగా నిలుచున్న రాణిగారిని చూసి తన వక్షస్థలం పైన ఉండాల్సిన

లక్ష్మీదేవి ఎదురుగా నిల్చున్నదేమిటా అని ఆశ్చర్య పోయి వరదరాజస్వామి తన వక్షస్థలాన్ని తొంగి చూసుకున్నాడట. స్వామి వక్షస్థలం మీద శ్లోకం చెప్పినందుకు ఆచార్య దీక్షితుల్ని స్వామి సన్నిధిలోనే సత్కరించి రాయలవారు "వక్షస్థలాచార్య" అనే బిరుదు నిచ్చి గౌరవించాడని అప్పయ్యదీక్షితుల జీవిత చరిత్రలో ఉంది.

5. ఈశ్వరదీక్షితులు = రాయల ప్రోత్సాహమున వాల్మీకి రామాయణమునకు లఘు గురు వ్యాఖ్యలు వ్రాశాడు.

6. ఊరి దేచమంత్రి = తిమ్మరుసు మేనల్లుళ్ళ పాలనలో ఉన్న కొండవీడుకు మంత్రిగా ఉన్నాడు. "శివపంచస్తవి"కి సంస్కృత వ్యాఖ్య వ్రాశాడు. తెనాలిరామలింగకవి "ఉద్భటారాధ్యచరిత్ర" గ్రంథాన్ని అంకితం తీసుకున్నాడు.

7. ఎడపాటి ఎర్రన = మల్హణ చరిత్రము, కుమార నైషధం కర్త

8. కందుకూరి రుద్రకవి= వేటూరి ప్రభాకర శాస్త్రిగారు, నేలటూరి వెంకటరమణయ్యగారు, నిడుదవోలు వెంకట్రావుగారు కందుకూరు రుద్రకవిని అష్టదిగ్గజ కవిగా లేదా రాయల సమకాలికుడిగా చాలామంది అంగీకరించినా కొందరు అంగీకరించలేదు.

9. కనకదాసు : 1509లో జన్మించాడు. హరిదాసుగా ప్రసిద్ధుడు.

10. కవిరాట్టు= వేటూరి ప్రభాకర శాస్త్రిగారు ఈ తెలుగు కవిని అష్టదిగ్గజాల్లో ఒకడిగా భావించారు.

11. కుమార సరస్వతి తమిళ కవి

12. కుమార డిండిమ కవిసార్వభౌమ= బహుభాషావేత్త. కవిరాజరాజు, కృష్ణరాయల ఆస్థానంలో ఉన్నాడు. "వీరభద్రవిజయం" కర్త.

13. జ్ఞానప్రకాశర్ = తమిళ కవి

14. చాటు విఠలనాథుడు = కన్నడ కవి

15. చింతలపూడు ఎల్లన = రాధామాధవకవి అంటారీయన్ని. రాయల సమకాలికుడు. నిడదవోలు వెంకటరావుగారు ఈయన అష్టదిగ్గజంలోని వాడుగా భావించారు.

16. చైతన్య మహాప్రభువు= ప్రతాప రుద్రగజపతికి గురువు. రాజమహేంద్రవరం తదితర తెలుగు ప్రాంతాలను సందర్శించాడు. రాయలవారి సమకాలికుడు. కానీ, రాయలవారికి ఆయనతో ఎంత సంబంధం ఉండేదో తెలీదు.

17. తత్త్వప్రకాశకవి = తమిళకవి

18. తాళ్లపాక తిమ్మక్క = అన్నమాచార్యుని భార్య. అన్నమయ్య 1424–1503 మధ్యకాలంలో జీవించాడని వేటూరివారు నిర్ధారించారు. కాబట్టి, ఈమె కాలం కూడా అదే నని మన కవి జీవిత చరిత్ర కారులంతా వ్రాయగా ఊటుకూరు లక్ష్మీ కాంతమ్మగారు ఈమె మొల్లకన్నా ముందునాటిదని భావించారు. మొల్లమాంబ 1440–1530 మధ్యకాలంలో జీవించింది. ఆమె రామాయణ రచనా కాలానికి ప్రబంధ యుగం ఇంకా ఆరంభం కాలేదు. తిమ్మక్క వ్రాసిన సుభద్రాపరిణయం ప్రబంధ పోకడలు కలిగిన కావ్యం. కాబట్టి తొలి కవయిత్రి మొల్లమాంబే కావచ్చు. భారతదేశంలోనే ఆమె మొదటి కవయిత్రి కూడా ! సంగమ కాలంనాటి అవ్వయ్యార్, సూఫీ కవయిత్రి లల్ల లాంటి మహిళామణులు ఉన్నప్పటికీ కావ్యరచన మొల్లతోనే ప్రారంభం అయ్యిందని పరిశీలకుల అభిప్రాయం.

19. తిమ్మణ్ణభట్టు = వ్యాసరాయలు(వ్యాసతీర్థులు) = ప్రసిద్ధ కన్నడ కవి

20. తిరుమల తాతాచార్యులు = తమిళ వైష్ణవుడు. పంచమతభంజనం అనే ప్రసిద్ధ గ్రంథం వ్రాశారు. రాయలవారికి గురువు.

21. తిరుమలాంబ = 'వరదాంబికా పరిణయం' చంపూ కావ్యం వ్రాసింది.

రాయలవారి తమ్ముడు అచ్యుతదేవరాయలు, వరదాంబిక పెళ్ళి కథ ఇందులో ఇతివృత్తం.

22. తుఖ్ఖాదేవి = ప్రతాపరుద్రగజపతి తనయ, రాయలమహిషి. సాంసారికానందము ననుభవింప నోచుకొనని యభాగ్యురాలు. "తుఖ్ఖాపంచకం" కర్త అని చెప్తారు.

23. తెనాలి రామకృష్ణకవి = అష్టదిగ్గజాల వివాదం తెనాలి రామకృష్ణుడితోనే మొదలయ్యింది. రామరాజభూషణుడి వసుచరిత్ర తరువాతే రామకృష్ణుడి పాండురంగ మహాత్మ్యం వెలువడిందని ఎక్కువ మంది భావిస్తున్నారు. భట్టుమూర్తి అళియరామరాజు కాలంలో రామరాజభూషణుడిగా గుర్తింపు పొందాడు. కాబట్టి రామకృష్ణకవి నిస్సందేహంగా రాయల అనంతర కాలం వాడు. బహుశా చంద్రగిరికి రాజధాని మారిన తరువాతి కాలం వాడు కావచ్చు.

24. దివాకరుడు = ఈ తెలుగు కవి కూడా లొల్ల లక్ష్మీచధర పండితుడితో పాటే ప్రతాపరుద్ర గజపతి ఆస్థానం నుండి రాయలవారి దగ్గర చేరాడు. అనేక గ్రంథాలు వ్రాశాడు. పారిజాతాపహరణ నాటకం కూడా వ్రాశాడు.

25. ధూర్జటి = అష్టదిగ్గజంలోని వాడేనని దాదాపుగా అందరూ అంగీకరించారు. ధూర్జటి రాయల ఆస్థానంలో ఉన్నట్టు కొన్ని "చాటువులున్నాయి. "కృష్ణరాయవిజయ" కావ్యంలో కుమార ధూర్జటి కృష్ణరాయలు ధూర్జటిని ఆదరించినట్టు వ్రాశాడు. కానీ, "రాజుల్ మత్తులు, వారి సేవ నరక ప్రాయంబు" అని ధూర్జటి రాజుల్ని నిందించి, తన శ్రీకాళహస్తీశ్వర శతకము', 'శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యము' గ్రంథాల్ని తన ఇష్టదైవానికి అంకితం ఇచ్చుకున్నాడు. దీన్ని బట్టి ధూర్జటి అష్టదిగ్గజాల్లో వాడు అయినా కాకపోయినా రాయలవారి సమకాలీనుడు కావచ్చు.

26. నంది తిమ్మన= ముక్కు తిమ్మనగా కూడా ఈయన ప్రసిద్ధుడు.

పారిజాతాపహరణం కృతి అంకితం ఇచ్చాడు కాబట్టి, నిస్సందేహంగా రాయలవారి సమకాలికుడు, ఆంతరంగికుడు కూడా !

27. నాదిండ్ల గోపమంత్రి = తిమ్మరుసు మేనల్లుడు కొండవీటి ఉపపాలకుడు. స్వయంగా కవి. ప్రబోధ చంద్రోదయం నాటకానికి చంద్రిక వ్యాఖ్య, కృష్ణార్జున సంవాదం పేరుతో తెలుగులో ద్విపదలో కృష్ణార్జున యుద్ధ కావ్యాన్ని వ్రాశాడు.

28. పరాంకుశస్వామి = నరసింహస్తవం వ్రాసిన సంస్కృతకవి. క్రీ.శ. 1497–1511 నాటి వాడు. అహోబిలమఠాధిపతులలో ఆరవవాడు.

29. పింగళి సూరన = రాయల సమకాలికుడు కాకపోవచ్చని, ఇతను అళియరామరాజు కాలంలో నంద్యాల కృష్ణరాజు ఆశ్రయంలోని వాడని నిడదవోలు వెంకటరావుగారు భావించారు.

30. పుత్తేటి రామభద్రకవి = చాలామంది ఈ పుత్తేటి రామభద్రకవిని అయ్యలరాజు రామభద్రకవిగా పొరబడ్డారని కొందరు విమర్శకులు వాదించారు. నేలటూరివారూ అయ్యలరాజు రామభద్రకవిని రాయల సమకాలికుడిగా అంగీకరించలేదు. ఆ రామభద్రుడు పుత్తేటి రామభద్రకవే నన్నారు. రాయల వారి "సకల కథాసార సంగ్రహం" గ్రంథాన్ని తెలుగులోకి అనువదించింది ఈ పుత్తేటి వీరభద్రుడే గానీ అయ్యలరాజు రామభద్రుడు కాదని చాగంటి వారి అభిప్రాయం.

31. పురందరదాసు : కన్నడ సంస్కృత వాగ్గేయకారుడు.

32. బండారు లక్ష్మీనారాయణకవి = రాయల ఆస్థానంలో ప్రసిద్ధుడైన తెలుగు వాగ్గేయకారుడు. "సంగీతసూర్యోదయం" అనే సంగీత శాస్త్రీయగ్రంథాన్ని రాయలకు అంకితం ఇచ్చాడు. అభినవ భరతాచార్య, సూక్ష్మభరతాచార్య బిరుదాలతో పాటు, బంగారుపల్లకి, గజారోహణం, ముత్యాలు పొదిగిన రెండు శ్వేతఛత్రాల సన్మానం రాయలనుండి పొందాడట.

33. భానుకరుడు = రాయలవారి ప్రోత్సాహంతో 'రసమంజరి' వ్రాశాడు. రాయల్ని

ఈ కవి ప్రశంసిస్తూ చెప్పిన రెండు శ్లోకాలున్నాయి.

34. మండలపురుషుడు = తమిళ కవి

35. మాదయగారి మల్లన = వేటూరి వారు మల్లన కవి అష్టదిగ్గజాలలోని వాడు కాదన్నారు.

36. మొల్ల : రామాయణ మహాకావ్య రచన చేసింది. రాయల సత్కారము అంది ఉండునని శ్రీ వీరేశలింగం వ్రాశారు.

37. రామచంద్రభట్టు = వల్లభాచార్యుని శిష్యుడు.

38. రూప గోస్వామి = చైతన్య మహాప్రభు శిష్యుడు.

39. లొల్ల లక్ష్మీధర పండితుడు = ఒడీసా వీరరుద్రగజపతి ఆస్థాన కవి. తన ప్రభువు పేరున మునిసిపల్ పాలనకు సంబంధించిన గ్రంథం వ్రాశాడంటారు. ప్రతాపరుద్రగజపతి కుమార్తె తుఖ్ఖాదేవి (అన్నపూర్ణ) ని రాయలవారు వివాహం చేసుకున్నాక ఆమె వెంట విజయనగరానికి వచ్చాడని చెప్తారు.

40. వల్లభాచార్యులు = ఆంధ్రుడు, రాయల సమకాలికుడు, వల్లభ మత స్థాపకుడు

41. శంకరకవి = దేచమంత్రి కుమారుడు. "హరిశ్చంద్రోపాఖ్యానం' వ్రాశాడు.

42. శఠకోపయతి = అహోబల మఠానికి 7వ అధిపతి. 1512-22 దాకా ఉన్నారు. ఈయన "వాసంతికాపరిణయం"అనే సంస్కృత కావ్యం వ్రాశారు. తాతాచార్యులవారికి పూర్వాశ్రమంలో మేనల్లుడు.

43. సంకుసాల నృసింహ కవి : రాయల సమకాలికుల్లో ప్రసిద్ధి ఉన్న సంస్కృతాంధ్ర కవి. ఈయన కూడా అష్టదిగ్గజాలలోని వాడు కావచ్చని ఆరుద్ర వ్రాశారు.

44. సాళువ తిమ్మరుసు = సాళువ నరసరాజుకు మంత్రిగా పనిచేసి సాళువ తిమ్మరుసుగా ప్రసిద్ధుడయ్యాడు. కృష్ణదేవరాయలు అప్పాజీ అని నోరారా పిలిచిన వ్యక్తి. రాయలే అతన్ని కళ్ళుపొడిపించి చంపినట్టు కట్టుకథలు

మనవాళ్లే అల్లారు. కన్నడంలోనో తమిళంలోనో అల్లినవి కావివి. అప్పాజీ సంస్కృతకవి. సహృదయ చూడామణి అనే గ్రంథం వ్రాశాడు. అగస్త్యవిద్యానాథ కృత బాలభారత కావ్యానికి మనోహరి అనే వ్యాఖ్య వ్రాశాడు.

45. హరిహరదాసు= తమిళ కవి

వీళ్ళంతా రాయల సమకాలికులు. కొందరు ఆయనకన్నా వయో వృద్ధులు కాగా, కొందరు చాలా చిన్నవాళ్లు. దక్షిణ భారతదేశం మొత్తానికీ ఏలికగా ఉన్న ఆ మహానాయకుడికి తన మహాసామ్రాజ్యంలోని అన్ని భాషల కవులతోనూ సంబంధ బాంధవ్యాలు సహజం.

**అన్నమయ్యతో అనుబంధం**

"తెలుగు పదకవితా పితామహుడైన అన్నమాచార్యుడు, కర్ణాటక సంగీత పితామహుడైన కన్నడ వాగ్గేయకారుడు పురందర దాసుకన్నా ముందరి వాడు. అన్నమాచార్యుల మనుమడు చినతిరుమలాచార్యుడికి పురందరదాసు సమకాలీనుడు. ఈ చినతిరుమలాచార్యుడు, పురందర దాసు, రాయల అనంతర ప్రభువులు అచ్యుతదేవరాయలు (1529-42) సదాశివరాయలు (1542-76), "స్వరమేళ కళానిధి" గ్రంథ రచయిత తంజావూరు రామయ్యమంత్రి వీరందరి సమష్టి కృషితో సరళీస్వరాలు, జంటస్వరాలు, గీతాలు, అలంకారాలు, వర్ణాలు, అనే క్రమతరగతి పద్ధతిలో సంగీత విద్యార్థులకి శిక్షణ ఏర్పాటు జరిగాయని, రాజులు కన్నడ రాజ్య రమామణులు కాబట్టి పాలనా భాష తెలుగైనప్పటికీ, సంగీతాన్ని కర్ణాటక సంగీతం అనే పిలిచారని "తెలుగువారి సంగీతరీతులు" అనే వ్యాసంలో రజనీగారు పేర్కొన్నారు.

"చిన్నన్న ద్విపద కెఱఁగును, బన్నుగఁబెదతిరుమలయ్య పదమున కెఱఁగున్,
మిన్నంది మొరసె నరసి గన్న కవిత్వంబు పద్యగద్య శ్రేణిన్"

చిన్నన్న అనే చిన తిరుమల వేంగళనాథుడు అన్నమయ్యకి మనుమడౌతాడు. పెదతిరుమల్లయ్య కుమారుడు. ఆయన ద్విపదలు వ్రాయటంలో ప్రతిభావంతుడు. అష్టమహిషీ కళ్యాణం, పరమయోగి విలాసం వ్రాశాడు. పెద తిరుమలయ్య

క్రీ.శ. 1480-1547 కాలం నాటి వాడు. తండ్రికి తగిన తనయుడు. కొన్ని సందర్భాల్లో అధికుడు కూడా !

ఈ పెదతిరుమలాచార్యుని కాలానికి ప్రబంధ యుగం ఊపు మీద ఉంది. రాయలనాటి మూడు ప్రబంధాలు పారిజాతాపహరణం, మనుచరిత్ర, ఆముక్తమాల్యద ప్రభావంతో గొప్పగొప్ప ప్రబంధాలు అవతరించిన కాలం అది. ఆ ప్రభావం పెదతిరుమలయ్య మీద ఉంది. అతను వ్రాసిన 'చక్రవాళమంజరి' అనే శ్రీనివాసుని ప్రణయకావ్యంలో అలమేలుమంగ వేంకటేశ్వరునిపై వలపు పెంచుకుని శృంగారావస్థలకు లోనై చివరికి నాయకుని చేరటం ఇతివృత్తం. ప్రబంధ కవులు అనుసరించిన కావ్యరచనా విధానాన్ని ఇందులో పాటించాడాయన.

పెదతిరుమలయ్య అన్నమయ్య వరవడిని కొనసాగిస్తూ అనేక పదసంకీర్తనలు కూడా వ్రాశాడు. వాటిలో చాలా వరకూ రాగిరేకుల్లో, తంజావూరు సరస్వతీ గ్రంథాలయంలో ఉన్నాయని చెప్తారు. ఈ వంశీకుడే నరసింగన్న. కవికర్ణ రసాయన కర్త. తాళ్లపాక నృసింహకవి అసలు పేరు. బహుశా చినతిరుమలాచార్యుడి తరువాతి తరం వాడు. ఆయనకన్నా వందేళ్లు చిన్నవాడని, మానవల్లి రామకృష్ణకవి అభిప్రాయపడ్డారు. ఇలా, తాత, కొడుకు, మనుమడు పద కవితాప్రక్రియలో శేముషీ కృషిచేసి ఆంధ్ర పదకవిత్రయంగా ప్రసిద్ధులయ్యారు.

శ్రీవారి బంగారు వాకిటి దగ్గర భాష్యకారుల విగ్రహాలు అన్నమాచార్యుల విగ్రహం సంకీర్తనభండారం ఉన్నాయి.

"అదివో తాళ్ళపాక అన్నమాచార్యులు / యిదె వీఁడె శ్రీవెంకటేశునెదుట / వెదవెట్టి లోకములో వేదము లన్నియు మంచి పదములు సేసి పాడి పావనము సేసెను ఈతడే॥" అనే పెదతిరుమలయ్య కీర్తన వెంకటేశ్వరుని చెంత అన్నమయ్య స్థానాన్ని చాటుతోంది.

శ్రీకృష్ణదేవరాయలు పాలనకొచ్చేసరికి అన్నమయ్య మరణించి 4 ఏళ్లయ్యింది. ఆయన కుమారుడు పెదతిరుమలయ్య మధ్యవయస్కుడు. మనుమడు

చినతిరుమలయ్యకి 1503లో అన్నమయ్య స్వయంగా బ్రహ్మోపదేశం చేసి, ఉపనయనం చేశాడని వేటూరి వారు వ్రాశారు. పెదతిరుమలయ్య అన్నమాచార్యుని రెండవ భార్యయగు అక్కలాంబకు పుట్టాడు. 1553 దాకా జీవించాడు. అల్లసాని పెద్దనకి అన్నమయ్య స్వయంగా గురువు. 1512 నుండి, 1523 దాకా 7సార్లు తిరుమలకు రాయలవారు వచ్చారని రికార్డులు చెప్తున్నాయి. ఆయనకు అన్నమయ్య గురించి తెలీదని అనటానికి లేదు. అన్నమయ్య మరణించిన 4 యేళ్ళకు గానీ రాయలు పట్టాభిషిక్తుడు కాలేదు. కాబట్టి రాయలవారిని ప్రస్తావించే అవకాశం అన్నమయ్యకు లేదు. రాయలవారు ఎందరో కవుల్ని పోషించి ఆంధ్రభోజుడని పించుకున్నాడు. స్వయంగా సంస్కృతాంధ్ర కవి. రాయల కాలంలో పెద తిరుమలయ్య కవిగా ప్రసిద్ధుడయ్యాడు. పెదతిరుమలయ్య కొడుకు చినతిరుమలయ్య కూడా రాయలు జీవించిన కాలంలోనే కవిత్వం చెప్పి ప్రాచుర్యం పొందిననవాడు. రాయలవారికి అన్నమయ్య కుటుంబం మాత్రమే సమకాలీనులు!

❑

# రాయలనాటి బెజవాడ

గీ. భామ విను శ్రీమదాంధ్ర భూభాగమనెడు / తార హారంబునకు సొంపు దనరుచున్న
మధ్యమణి చందమున మహామహిమదాల్చె / భూరి విభవంబు బెజవాడ పురవరంబు.

సీ. క్రొత్తబియ్యము కాయగూర లొబ్బట్లు సై / దంపు బూరెలు పంచదార తొలలు
వడలు నల్లంబు మీగడల తియ్యని పెర్గు / కమ్మని సిరివాలు గసగసాలు
చిఱుసెన్గపప్పును తఱచు వీద్యంబులు / కంబళ్లు నంబళ్లు కంచుకములు
ఇంగువ జిలకఱ్ఱ నెనసిన మిరియంబు / మంచివాసన నెయ్యి మాట దురుసు

గీ. తఱచు రణశీలమొప్పు, గంధాక్షితములు / నంద మింపొందు శిఖలు, నొయ్యారి నడలు
కలిగి కాంతలు పురుషులు కలసి సిరుల / చెలఁగు నయ్యాంధ్రదేశంబు చెలువు గాంచె"

(అజ్జరపు పేరయకవి 'ఒడనంబి విలాసం')

అజ్జరపు పేరయ లింగం కవి ఒడయనంబి విలాసము అనే కావ్యం వ్రాశాడు. ఓఢ్రగజపతుల గౌరవం పొందాడు. పశ్చిమగోదావరి జిల్లా అజ్జరం గ్రామం వాడు. ఇత్తడి బిందెల పరిశ్రమకు ఈ గ్రామం ప్రసిద్ధి. తణుకు దగ్గర ఈ గ్రామం ఉంది. కోస్తాజిల్లాలు శ్రీకృష్ణదేవరాయల ఏలుబడిలో పరోక్షంగా ఉప్పటికీ ఇక్కడి ప్రజల్లో ఆయనంటే అపారమైన గౌరవ భావం ఉండేది.

బహమని సుల్తాన్ల చేతుల్లోంచి కొండపల్లి కోట ప్రతాపరుద్రదేవ గజపతికి, అతని నుండి కుతుబ్ షాహీ రాజవంశ స్థాపకుడు గోల్కొండ తొలి సుల్తాన్ కులీ కుతుబ్ ఉల్ ముల్క్ చేతుల్లోకి, తిరిగి గజపతులకు, మళ్లీ కృష్ణదేవరాయలు చేతికీ, మళ్ళీ గోల్కొండ సుల్తాన్లకు ఇలా కొండపల్లి కేంద్రంగా 50 యేళ్ళపాటు కనీసం నిరంతర పోరులో నలిగిపోయింది బెజవాడ. ఆనాటి బెజవాడ ప్రజలు యుద్ధ జీవులుగా జీవించాల్సిన పరిస్థితి.

గజపతుల తర్వాత కొండపల్లి కోట సుల్తానుల వశం అయ్యాక రాజధాని కొండపల్లికి మారి బెజవాడ ప్రాభవాన్ని కోల్పోయింది. 1870 నాటి కృష్ణాడిస్ట్రిక్ట్ మాన్యువల్లో ఆనాటి బెజవాడ జనాభా కేవలం 900 మంది మాత్రమే ! ఒక నాటి మాధవ వర్మ రాజధాని నగరం ఇది. ఎన్నో యుద్ధాల్ని చవి చూసినా తట్టుకుని నిలబడింది. కానీ, సుల్తాన్ల కాలంలో కొండపల్లి కోటకు ప్రాముఖ్యత పెరిగి బెజవాడ మరుగున పడిపోయింది. బ్రిటిషర్ల కాలానికి చిన్న గ్రామంగా మిగిలిపోయింది.

ఆనకట్ట నిర్మాణం జరిగాక, రైల్వే జంక్షన్ ఏర్పడిన తర్వాత ఈ నగరానికి మళ్లీ మహర్దశ అందుకుంది.

ప్రకాశం, గుంటూరు, కృష్ణా, ఉభయగోదావరి జిల్లాలు, విశాఖపట్టణం, విజయనగరం, శ్రీకాకుళం జిల్లాలన్నీ గజపతుల ఆధీనంలో ఉండేవి.

శ్రీమదాంధ్ర భూభాగమనే తారాహారంలో మెరిసే మధ్యమణి లాంటి బెజవాడపురాన్నీ, ఆనాటి ప్రజల ఆహారపు అలవాట్లను ఈ పద్యాల్లో పేరయ్యకవిగారు వివరించారు. ఒరిస్సా గజపతుల (1489–1563) ఏలుబడిలో ఉన్న ఆనాటి సాగరతీర ప్రజల ఆహార సంస్కృతిని ఈ పద్యాలు చాటుతున్నాయి. 'వ్యాసమంజరి'లో వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఈ పద్యాల్ని ఉదహరించారు.

మహాకవి బమ్మెర పోతన గారి మనుమడు కేసన్న. ఈయనకి ప్రౌఢసరస్వతి అనే బిరుదు ఉంది. వారి అమ్మాయిని ఈ అజ్జరపు పేరయ్యకవి వివాహమాడాడు. బమ్మెర కేసకవి మల్లకవులకు బావమరిది. ఇవటూరి పెదరామనాథుడి శిష్యుడు. పరమ శైవుడు.

అలనాటి బెజవాడ అందగాళ్లతో, సుందరంగా, సుభిక్షంగా ఉండేదనటానికి ఈ పద్యమే సాక్ష్యం.

1. **క్రొత్తబియ్యము, కాయగూరలు** : ఈ ప్రాంతాల్లో తెల్లబియ్యం, కాయగూరలు బాగా దొరికేవి. ప్రజలు సుష్టుగా భోంచేసేవారు. బియ్యం వ్యాపారం, కూరగాయల వ్యాపారం బాగా ఉండేది

2. **ఒబ్బట్లు :** ఆనాటి బెజవాడ వాళ్లు ఇష్టంగా తినే పదార్థాల్లో ఒబ్బట్లు లేదా బొబ్బట్లు ముఖ్యమైనవి. బందరు హల్వా, కాకినాడ కాజా అన్నట్టే ఆ రోజుల్లో బెజవాడ బొబ్బట్లకు ప్రసిద్ధి ఉండేది కాబోలు. పల్లెల నుండి పాయసం, బూరెలు గారెల్లాంటివి కొనుక్కొచ్చినట్టు శ్రీనాథుడే వ్రాయటాన్ని బట్టి, మిఠాయి వ్యాపారం జరిగేది. స్వీటుషాపుల్లో రుచికరమైన స్వీట్లు అమ్మేవాళ్లు.

3. **సైదంపు బూరెలు :** గోధుమపిండితో బూరెలు చేసేవాళ్లు. బియ్యప్పిండి బూరెలు పైత్యం చేస్తాయి. గోధుమల్ని బాగానే వాడేవారు. బెజవాడ అనగానే బొబ్బట్లు, బూరెలు గుర్తుకొచ్చేటంతగా వాటి ప్రసిద్ధి ఉండేది కాబోలు.

4. **పంచదార తొలలు :** పిల్లలు ఇష్టంగా తినే చప్పరించే బిళ్ళలు పంచదార తొలలు. నిమ్మతొనలు, పనసతొనల ఆకారంలో ఉన్న అచ్చులో చక్కెరపాకం పోసి గట్టి పరుస్తారు. వీటిని పంచదార తొలలు, నిమ్మతొలలు, చిలకలు ఇలా పిలుస్తారు.

5. **వడలు నల్లంబు :** అల్లం వేసిన వడలు (మసాలా వడలు) బెజవాడొస్తే దొరికేవన్న మాట

6. **మీగడల తియ్యని పెర్గు :** మీగడ కట్టిన గడ్డ పెరుగు చిక్కటి పాలవ్యాపారం జోరుగా ఉండేదని భావించవచ్చు

7. **కమ్మని సిరివాలు :** సిరివాలు అంటే రసాల లేదా శిఖరిణి (సిగరిణి) లాంటి పానీయం. సిరము (శిఖరి) అంటే పెరుగులో పచ్చకర్పూరం, కొద్దిగా పాలు, మిరియాలపొడి, పంచదార చేర్చి చిలికిన లస్సీని పైన వెన్నపూస పరిచి ఇచ్చేవారు. ఈ పానీయాన్ని భీముడు కనిపెట్టాడని భావప్రకాశ వైద్యగ్రంథంలో ఉంది. బహుశా బెజవాడ ఆనాడు ఈ పానీయానికి ప్రసిద్ధి కావచ్చు

8. **గసగసాలు, చిఱుసెన్గపప్పును :** గసగసాలు (మసాలా ద్రవ్యాలు), చిరుసెనగపప్పు అంటే పుట్నాల పప్పు బెజవాడలో బాగా దొరికేవి.

విజయవాడలో పప్పుల బజారు ఇప్పటికీ ఉంది అది చాలా ప్రాచీనమైన దంటారు.

9. **తఱచు వీడ్యంబులు :** తరచూ విడెములు అంటే తాంబూలాల్ని అదేపనిగా నములుతుంటారట. బహుశా బనారసి పాన్ లాగా బెజవాడ పాన్ కు కూడా ఆ రోజుల్లో ప్రసిద్ధి ఉండేదేమో !

10. **కంబళ్లు నంబళ్లు కంచుకములు :** కంబళ్లు(రగ్గులు), అంబళ్లు (పరిమళద్రవ్యాలు), కంచుకములు-నెహ్రూ జాకెట్టు లాంటి కవచం. శ్రీనాథుడు మహాకూర్పాసం అన్నాడు. వీటికి బెజవాడ ఆ రోజుల్లో వ్యాపారకేంద్రం అని అర్థం అవుతోంది. అప్పటి బెజవాడ పౌరులు పంచెగట్టుకుని పైన నెహ్రూజాకెట్టు లాంటి కవచం తొడుక్కుని తిరిగేవారని కూడా ఊహించవచ్చు. దీన్నే ఇప్పుడు మోడీ జాకెట్ అని కూడా అంటున్నారు.

11. **ఇంగువ జీలకఱ్ఱ నెనసిన మిరియంబు :** ఇంగువ, జీలకర్ర, మిరియాలు, ఉప్పు వేసి నూరిన కారప్పొడిని గరమ్ మసాలా పొడిగా వాడేవారట. 'బెజవాడ కారప్పొడి'కి ఆ రోజుల్లో గిరాకీ ఉండేదని దీన్నిబట్టి ఊహించవచ్చు. ఇక్కణ్ణించి వాణిజ్యపరంగా ఎగుమతులు ఘనంగా సాగేవన్నమాట. మిరపకాయలు అప్పటికి తెలియవు. సుగంధ ద్రవ్యాలు కూడా కొన్ని పెద్ద వాణిజ్య కేంద్రాల్లోనే దొరికేవి. ఇంగువ, మిరియాలు మన పంటలు కావు. అందువలన ఎక్కడపడితే అక్కడ దొరికేవి కాదు.

12. **మంచివాసన నెయ్యి :** బెజవాడకు ఇంకో ప్రసిద్ధి కూడా ఉండేది: ఇక్కడ ఘుమఘుమలాడే నెయ్యి దొరికేదట.

13. **మాట దురుసు :** ఇక్కడి మనుషులు నెయ్యిలా మృదువుగా ఉండరనీ, దురుసుగా మాట్లాడతారనీ వ్రాశాడు.

14. **తఱచు రణశీలమొప్పు :** ఎప్పుడూ సమరానికి సన్నద్ధంగా ఉండే యుద్ధ జీవులు వాళ్లు.

15. **గంధాక్షితములు నందమింపొందు శిఖలు :** పురుషుల తలపైన గంధమాదన పర్వతంలా ఇంపైన శిఖ ఉండేదట.

16. **ఒయ్యారి నడలు కలిగి కాంతలు పురుషులు కలసి సిరుల చెలఁగు :** సౌందర్య గర్వంతో అలరారే అమ్మాయిలతో కలిసి మెలిసి తిరుగుతు సంపన్నంగా జీవించారట.

ఇలా ఆనాటి బెజవాడ వాణిజ్య వైభవాన్ని, వారి ఆహారపు అలవాట్లని, వారి వేషభూషణాల్నీ ఈ అజ్జరపు పేరయ్యలింగకవి వర్ణించారు. 500 యేళ్ళ క్రితం కృష్ణాతీరవాసుల సాంఘిక చరిత్రకు ఈ పద్యం అద్దం పడుతుంది. ❑

# రాయలవారి తాంబూలాల కథ

"మన కనురక్తి హెచ్చునిదె మందని కంఠముఁగౌఁగిలించి ని
క్కిన ఫణిరాజవల్లి యెఱిఁగింపఁగనో యనఁ బూగముల్బరం
బున బడు మట్టచేఁ జెఱకు ముత్తియముల్చిటిలించి, తద్రసం
బనిశము వడు నంతిక తలాంతికఁజూర్ణము జేయునప్పురిన్"

ఆముక్తమాల్యద కావ్యంలో కృష్ణదేవరాయలవారి వర్ణన ఇది. శ్రీవిల్లిపుత్తూరు లో చెరకుతోటలు, పోకతోటలు, వాటిని పట్టుకు ప్రాకిన తమలపాకుల తోటలున్నాయి, ఈ పోకమాకు(వక్కచెట్టు) లకు తమలపాకుల తీగలు పాకటం స్త్రీ తన పురుషుని కంఠాన్ని నిక్కి కౌగిలించుకొని పైకెగబాకినట్టుగా ఉంది. "మనమధ్య అనురాగం పెరగడానికి ఇదిగో ఒక మందు చూపిస్తా" నన్నట్టుగా పోకచెట్టు నుండి రాలిపడ్తున్నాయిట వక్కలు. చెరకుగడలు విరిగిపోతూ అందులో నుండి ముత్యాలు ప్రక్కనే బెల్లం వండే పొయ్యిలో పడి సున్నంగా మారుతున్నాయట ! పోకతోటలు, చెరకు తోటలు, ఆ ప్రక్కనే బెల్లం వండే పొయ్యిలు...ఇదీ దృశ్యం ! ముత్యాలభస్మం అంటే ఖరీదైన సున్నం కదా ! ముత్యాల సున్నం కలిసిన తాంబూలం నోటికి రాగాన్ని (ఎరుపు) మనసుకు అనురాగాన్నీ (ప్రేమ) కలిగిస్తుంది !

తాంబూలానికి రాయలవారికీ అవినాభావ సంబంధం ఉంది. రాయల యుగంలో తాంబూలం కథలు కొల్లలు. గుడ్ మార్నింగ్ తాంబూలం నుండి గుడ్ నైట్ తాంబూలం వరకూ దినచర్యలన్నీ తాంబూలంతో ముడిపడి సాగేవి. తాంబూలానికి గౌరవప్రదమైన స్థానాన్ని కల్పించటంలో రాయల యుగానిది పెద్ద పాత్ర. రాయలవారి యుగాన్ని తాంబూల యుగంగా చెప్పుకోవచ్చు. పరస్పర గౌరవాలకు, ఆత్మీయతలకు, అభిమానాలకు ఆ రోజుల్లో తాంబూలం ఒక సాధనం.

విజయనగరకాలంలో తాంబూలం ఇవ్వటం, తీసుకోవటం, సేవించటం మూడూ గౌరవప్రదాలే ! తాంబూలాన్ని ఇవ్వటంలో ఎంత నిబద్ధత ఉండేదో తాంబూలాన్ని పుచ్చుకోవటంలోనూ అంత నిబద్ధత ఉండేది.

**తాంబూలా లిప్పించే అధికారి అడపంగారు**

రాయలవారి కాలంలో అడపం గారు అనేది పెద్ద హోదా ! ఒక విధంగా వాణిజ్యశాఖ మంత్రి, ఇంకో విధంగా విదేశాంగ మంత్రి, మరో విధంగా రక్షణ మంత్రి పాత్రల్ని పోషించేవాడు. అడపం గారంటే రాజుకు తాంబూలాన్ని అందించేవాడనేది సరైన అర్థం కాదు. విదేశీ వ్యాపారులతో, పాలెగాళ్లతో, సామంత ప్రభువులతో, మతాధిపతులతో, కవిపండితులతో రాజుకు సఖ్యత కుదర్చటం, వారితో రాజుగారికి ఒప్పందాలు కుదర్చటం, ఆ ఒప్పందాలకు సూచనగా రాజుగారితో తాంబూలాలిప్పించి సభాగౌరవం కలిగించటం ద్వారా ఆ ఒప్పందాన్ని సభకు తెలిసేలా చేయటం ఈ తాంబూల సభాగౌరవం వెనుక ఉన్న పరమ ప్రయోజనంగా కనిపిస్తుంది. వాణిజ్యము పెంచేలా పాలించాలని కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో అనటాన్ని దృష్టిలో పెట్టుకుంటే అడపంగారి ప్రయోజనం ఏమిటో మనకు తెలుస్తుంది.

ఇంతటి ప్రాముఖ్యం కలిగిన పదవి కాబట్టే తనకు నమ్మకస్తుల్ని అడపంగారిగా నియమించుకుని, ఆయనకు మండలాధిపత్యం ఇచ్చే విధానాన్ని శ్రీకృష్ణదేవరాయలే ప్రారంభించాడంటారు. "తంజావూరు, మధురపాలకుడిగా కూడా వ్యవహరించిన విశ్వనాథ నాయకుడు కృష్ణదేవరాయలవద్ద అడపంగా ఉండేవాడు" అని ఆంధ్రుల చరిత్ర సంస్కృతి-2 గ్రంథంలో కంభంపాటి వారు వ్రాశారు. రాయల అనంతరం మధుర, జింజి రాజ్యాలలో నాయక రాజుల పాలన వర్ధిల్లటానికి విశ్వనాథనాయకుడే కారకుడయ్యాడు.

**తాంబూలం ఇవ్వాలంటే...**

'తాంబూలాలిచ్చేశాను తన్నుకు చావండి'అంటాడు అగ్నిహోత్రావధాన్లు గురజాడవారి కన్యాశుల్కం నాటకంలో. ఈ అగ్నిహోత్రావధాన్లు 60 ఏళ్ల ముసిలికి ఎనిమిదేళ్ళ పిల్లని కట్టబెట్టేందుకు తాంబూలం ఇచ్చేసినంత తేలిక్కాదు, ఒకరాజుగారు

కవినో, యోధుడినో, సామంతుడినో తాంబూలం ఇచ్చి గౌరవించటం అంటే ! దాని వెనక చాలా తతంగం ఉంటుంది. ఆ వైనాన్ని చూడండి:

మేఘవర్తిపురంలోనూ, ఈశ్వరపురంలోనూ, కారటీపురంలోనూ పండిన వక్కల్ని తెప్పించి, రాజు సమక్షంలో వాటిని ఉడికిస్తారు. వక్కకాయలు కొద్దిగా ఎఱ్ఱగా అయ్యేవరకూ ఉడికించి ఆరబెడతారు. మామిడితొడిమ రసం, గంధం పొడి, కర్పూరం కలిపిన నీళ్లలో వీటిని నానబెడ్తారు. పైన పొరని చెక్కి, నీడన ఆరబెడతారు.

రాయలవారు శుచిగా స్నానం చేసి, తాంబూలాధికారి – అడపంగారిని పిలిచి తాంబూల ప్రదానానికి సిద్ధం చేయిస్తాడు.

ఏడాదికన్న ఎక్కువ వయసున్న తీగనుండి పెద్దవిగా తెల్లగా లేతవిగా ఉన్న తమలపాకులు తీసుకుని వాటిమీద రాజుగారు  నదీజలం చల్లి సంప్రోక్షణం చేస్తాడు.

వివిధ ఆకారాలలో తాంబూలం మడవగల నిపుణుల్ని పిలుస్తారు. ఆకుల తొడిమల్ని కొనల్ని తీసేసి మధ్య ఈనె దగ్గర చీలుస్తారు. శైలోదకం (చన్నీళ్లు)తో తడిపిన మంచి ముత్యాల భస్మాన్ని ఆకులకు రాసి. మామిడివాసన కలిగి మలయాచలంలో పుట్టిన శ్రేష్ఠమైన పచ్చకర్పూరాన్ని, గంధం పొడిని తగుమోతాదు లో ఆ ఆకులమీద ఉంచుతారు.

"కస్తూరీ శశి తక్కోలం జాతీఫల సుచూర్ణకం / ఖదిరక్వాథ చూర్ణంతు కస్తూరీ తక్కోలమిశ్రితం

శ్రీఖండ కల్క సంయుక్తం కర్పూర రజసమన్వితం / మేళయిత్వా సమ్యక్ భాగైః గుళికా కల్పితా శుభా"

కస్తూరి, తక్కోలం, జాజికాయ, కాచు, వీటిని కూడా ఈ ఆకులమీద ఉంచి, అందమైన ఆకృతులలో మడుస్తారు.

తాంబూలాన్ని ఏ హోదా కలిగిన వ్యక్తికి ఇస్తున్నారో ఆ స్వీకర్త హోదాని (ప్రోటోకాల్) బట్టి ఎన్ని ఆకులు వెయ్యాలి, ఎన్ని వక్కలు వెయ్యాలి లాంటి నియమా లుండేవి. దేవాలయం శుభ్రపరిచే వారికి మంగళ వాద్యకారులకు, పూజారులకు ఇలా ప్రతీ ఒక్కరికీ ఇన్ని ఆకులు, ఇన్ని వక్కలు అని నిర్దేశిస్తూ వ్రాసిన శాసనాలున్నాయి.

**రెండు తాంబూలాల గౌరవం**

ప్రాచీన సంస్కృత సాహిత్యంలో తాంబూల గౌరవానికి సంబంధించి అనేక ఉదంతాలు మనకు కనిపిస్తాయి : శ్రీహర్షుడు రాజాశ్రయం పొందాలని ప్రయత్నించినప్పుడు మనసులో "తాంబూలద్వయమాననంచ లభతే యః కాన్యకుబ్జేశ్వరాత్" తనకు కన్యాకుబ్జ ప్రభువు నుండి తాంబూల ద్వయ గౌరవం దక్కాలని మనసులో అనుకుంటాడు.

తాంబూల ద్వయం అంటే ఏమిటీ ? పండు, తాంబూలం, శాలువా ఇలాంటి గౌరవాలను ఒక్కటిగా ఇవ్వరు. రెండు పళ్ళు, రెండు తాంబూలాలు, రెండు శాలువాలూ ఇలా రెండుగా ఇవ్వాలి. బహుశా గౌరవం పొందే వ్యక్తికీ, అతని భార్యకూ కలిపి రెండు గౌరవాలూ ఇచ్చే వారనుకుంటాను. రెండు శాలువాలు అనేదే "దొ శాలువా"– "దుశ్శాలువా" అయ్యిందని పండితులు చెప్తారు. దొశాలువా లాగానే తాంబూలద్వయ గౌరవం ఇచ్చే ఆచారం కూడా ఉండేదన్నమాట.

**బీడా ఎత్తటం**

బీడా అనేది విడెము (తాంబూలం) కు పర్షియన్ రూపం. హిందీలో "బీడా ఉత్తాన్" అంటే తాంబూలం తీసుకుని కష్టసాధ్యమైన దాన్ని సుసాధ్యం చేస్తానని ప్రతిజ్ఞ చేయటం. దీన్నే తెలుగులో 'బీడాఎత్తటం' అంటారు. వీరతాంబూలం అని మనవాళ్లు అన్నది దీన్నే ! రాయలవారి ఈ విధానాన్నే మొఘల్ పాలకులూ సుల్తానులు కూడా పాటించారు. విజయనగర కాలంలో ఇది ప్రధానమైన ఆచారం. దసరా రోజున ఆయుధ పూజ చేసే అలవాటు వెనుక ఈ వీర తాంబూలం పాత్ర ఉంది.

వానలవలన యుద్ధాలకు అనుకూలత తక్కువ కాబట్టి, సైనిక శక్తిని సమృద్ధం చేసుకోవటానికి రాజులకు కావలసిన విరామం వానాకాలంలో ఉంటుంది. వానలు వెనకబట్టగానే యుద్ధ భేరీభాంకారాలు మార్మోగుతాయి. విజయదశమినాడు ఆయుధపూజ చేస్తారు. రాజు తన సైనికబలగాన్ని సమీక్షించుకుంటాడు. తగిన వ్యూహాన్ని రూపొందించుకుని యుద్ధానికి బయల్దేరేందుకు విజయదశమిని ఒక ముహూర్తంగా ఎంచుకుంటాడు. వీరాధివీరులైన సైనికుల్ని సమావేశపరుస్తాడు. వీరతాంబూలం ఇచ్చి, వారి నుండి విజయం సాధించ గలననే వాగ్దానం తీసుకుంటాడు. అలా రాయలవారిచ్చిన తాంబూలాన్ని స్వీకరించిన వీరుడు రాయాలవారికిచ్చే వాగ్దానమే 'బిడాఎత్తటం'.

**వారాంగనలకు తాంబూల గౌరవం**

"విదేశ రాయబారులు తమ కొలువుల కేతెంచినపుడు నాటిరాజులు మర్యాదకై వీడ్యము (తాంబూలము) లిచ్చిరి, దమయెదిరికి ప్రియాప్రియులు మనసులోని మరులను వక్కలాకులతోఁ దెలిపిరి" అని ఆనాటి విదేశీ యాత్రికులు విజయనగర సామ్రాజ్యంలో తాంబూల గౌరవం ఎలాఉండేదో శ్రీ భావరాజు కృష్ణారావుగారు "ఆంధ్రదేశము-విదేశీ యాత్రికులు" అనే గ్రంథంలో అబ్దుల్ రజాక్ వ్రాసినట్టు తెలిపారు.

ఆనాటి వారాంగనలకి ఎంత సామాజిక గౌరవం ఉండేదో, వాళ్ల భోగభాగ్యాలు ఎంతటివో ఆముక్తమాల్యద కావ్యంలో శ్రీకృష్ణ దేవరాయలు స్వయంగా ఇలా వ్రాశాడు:

"... నెట్టినరునైనఁగులముఁదెలియఁ
బ్రభుతసెడిపల్లవుఁడుపేదవడిననేఁద
నృపతివెలియంతిపురముగానెన్నమెలఁగ
బాసఁగృతింజెప్పవలఁతులప్పద్మముఖులు"

వారాంగనలు తమ దగ్గరకొచ్చిన విటుడు ధనికుడా కాదా అనేది కాకుండా వాళ్ల యోగ్యతను బట్టి ఆదరించేవారట, ఒకవేళ తమ దగ్గరకొచ్చి డబ్బంతా

పోగొట్టుకుని బికారులైన వాళ్ళని జాలితో చేరదీసే వాళ్లేగాని ఈసడించేవాళ్లు కాదట. ఈ వారాంగనలు "నృపతి వెలియంతిపురము" గా ఎన్నదగినవారు– అంటే, రాణివాసపు స్త్రీలకు ఎంత గౌరవం ఉండేదో అంత గౌరవం ఇవ్వదగిన వారుగా గుర్తింపు ఉండేది. ఈ వేశ్యల నుండి వసూలు చేసే పన్నులన్నీ కలిపి 12,000 పణాల వరకూ ఉండేదట. ఈ డబ్బు రాజధాని నగరం రక్షకభటుల జీతబత్యాలకు సరిపోయేదట. అంతటి ప్రభుత్వాదాయానికి కారకులైనవారికి సభాగౌరవాలు సహజం.

వీళ్లు వారాంగనలైనా పరువుగలవారని బాగా చదువుకుని కావ్యరచనలు కూడా చేయటంలో నేర్పు, పాండిత్యం ఉన్నవాళ్లని ఆముక్తమాల్యద (1వ ఆశ్వాసం 60) లో రాయల వారు స్వయంగా వ్రాశారు. రాయల యుగంలో సంగీత నృత్య కళలను పోషించటం అంటే పరోక్షంగా వారాంగనలను పోషించటమే ! సంగీత నృత్యాది కళలలో ప్రతిభావంతులైన స్త్రీలకు తాంబూల గౌరవమే కాకుండా వాళ్లు సభామందిరంలో రాజు ఎదుట తాంబూల సేవన చేయటానికి అనుమతి ఉండేది. ఇంతటి మహాగౌరవం ప్రధానమంత్రికి కూడా లేదు !

నిజానికి ఈ సభాగౌరవం లేదా తాంబూల గౌరవం సంగీత నృత్యాది కళాకారులకు ఇచ్చే గౌరవమే ! ఈ కళాకారులు వారాంగన స్త్రీలలోనే ఉండే వారా రోజుల్లో కాబట్టి సభాగౌరవాలు వారికే దక్కేవి. 16–17 శతాబ్ది దాకా అగ్రవర్ణాల స్త్రీలలో సంగీత నృత్యకళా పారీణులు విశేషంగా కనిపించేవారు కాదు. నృత్యాన్ని ఒక దేవదాసీ కళ, వారాంగనల వృత్తి అనుకునేవారు. కూచిపూడి కళాకారులుగా కేవలం పురుషులే ఉండాలనే నిబంధన నిన్నమొన్నటి దాకా ఉండేది. ఇప్పుడు సంగీత నాట్యాలపట్ల పురుషుల కన్నా స్త్రీలే ఎక్కువ ఆసక్తి చూపిస్తున్నారు. సమీప భవిష్యత్తులో పురుష వేషాలను కూడా స్త్రీలే వేసే రోజులు వచ్చినా ఆశ్చర్యపడనవసరం లేదు. ఆ రోజుల్లో ప్రభువులు పన్ను కట్టేవారిని అక్కున చేర్చుకునేవారు. ఈ రోజుల్లో పన్ను ఎగవేత దారులకే ఎక్కువ రాజాదరణ !

**ఒక రాజు – 700 రాణులు**

అబ్దుల్ రజాక్ ఆ నాటి విదేశీ యాత్రికుడు. రాయలనాటి అంతఃపుర జీవన స్థితి గురించి ఆనోటా ఈనోటా విన్నవి కొన్ని, తాను స్వయంగా చూసినవి కొన్ని కలిపి వ్రాసిన విశేషాలు ఆనాటి సాంఘిక చరిత్రకు కొంత వరకూ ఆధారంగా ఉన్నాయి.

"తాంబూలం నములుట వలనో లేక, తమలపాకుల గుణం వలనో కర్ణాటభూపాలుడైన రాయలవారు అంతఃపురంలో ఇంచుమించుగా 700 మంది రాణుల్ని ఉంపుడుకత్తెల్ని భరిస్తున్నాడు. అంతఃపురంలోకి పదేళ్ల దాటిన మగపిల్లల్ని సైతం అనుమతించేవాళ్లు కాదు. ప్రతీ ఉంపుడుగత్తెకీ ప్రత్యేకంగా వేర్వేరు వసతులు, పరిచారికలు, దాసదాసీ జనం ఉండేవారు. ఇద్దరు రాణులు, లేదా, ఇద్దరు ఉంపుడు గత్తెలు కలిసి ఒకే ఇంట్లో ఉండేందుకు వీల్లేదన్నట్టుగా అందరికీ ఇళ్లు ఉండేవి. ఆ విశాల రాజ్యంలో ఎక్కడైనా అందమైన ఆడపిల్ల ఉంటే వెంటనే రాయలవారు ఆమె తలిదండ్రుల్ని ఒప్పించి, తగిన డబ్బిచ్చి మహావైభవంగా తెచ్చి అంతఃపురంలో జేర్చే వాడు. రాణివాసంలో చేరాక ఆమె ఇంక బైట ఎవరి కంట బడదు." అని వ్రాశాడు అబ్దుల్ రజాక్.

ఇదంతా చదువుతుంటే మల్లీశ్వరి సినిమాకథ గుర్తుకొస్తుంది. మొత్తం మీద "700 మంది స్త్రీలను ఒక్క మగాడు" ఎలా నిభాయించుకొచ్చాడంటే అతను వేసుకున్న శృంగార తాంబూల మహిమేనని అబ్దుల్ రజాక్ ఈ కథనానికి కొసమెరుపు ఇచ్చాడు.

**రాజు వెడలె వారాంగన ఇంటికి...**

రాజుగారు ఓ రాత్రిపూట భోగం దాని ఇంటికి బయల్దేరాడు. అప్పుడాయన అలంకారం ఎలా ఉంటుందో ఓ పద్యం ఉంది. దాని భావం ఇది : "పన్నీరు కలిసిన కస్తూరి పూసుకొని, పొడవైన కుచ్చు టోపీలు, చెవులకు పెద్దముత్యాల పోగులు, కంఠానికి ముత్యాల హారం ఎర్ర అంచుగల తెల్ల వస్త్రాలు ధరించి, బంగారు పిడికత్తి చేత్తో పుచ్చుకుని నడుస్తుంటే అడపకత్తె తాంబూల కరండం

(తాంబూల సామగ్రి పెట్టుకునే పెట్టె) పట్టుకుని వెంట వస్తుంటే, తలారులు (body guards) ముందు నడువగా భోగం దాని ఇంటికి బయల్దేరాడు రాజుగారు" అని! ఇదేదో గోడదూకి వెళ్లే వ్యవహారం కాదు. రాజుగారు వేశ్యని కలవటానికైనా ప్రోటోకాల్ నిబంధనలనుపాటించాల్సిందే ! జెడ్ కేటగిరీ రక్షణ ఆయన్ను చుట్టుముట్టి ఉంటుంది కదా !

## పెద్దన, తిమ్మనలకు తాంబూలాలు

మంచి ప్రబంధాలు వ్రాయమని కోరుతూ శ్రీ కృష్ణదేవరాయలు అల్లసాని పెద్దనామాత్యుడికీ, ముక్కుతిమ్మనార్యుడికీ ఒకేసారి తాంబూలం ఇచ్చాడని రాయవాచకం చెప్తోంది. అడిగిందే తడవుగా తిమ్మనగారు చెకచెకా పారిజాతాపహరణ ప్రబంధాన్ని ముగించి, ఇచ్చేశాడు. పెద్దనగారిలా కాకుండా లలితమైన పదాలతో కోమలమైన భావాలతో ఈ పారిజాతాపహరణం కావ్యరచన చేశాడు. ముక్కు తిమ్మన ముద్దు పలుకులుగా ఆయన్ని సమకాలికులు కూడా మెచ్చుకున్నారు.

ఆంధ్రకవితాపితామహుడుగా ప్రసిద్ధుడైన అల్లసాని పెద్దనగారు మాత్రం తాంబూలం పుచ్చుకున్నాడు గానీ రచన పూర్తి చేయలేదు. గజపతులమీద రాయలవారు విజయం సాధించాక కూడా ఆయన రచన పూర్తిచేయలేదు.

మధ్యమధ్య రాయలవారు "ఎందాకా వచ్చిందీ మీ రచన" అని గుర్తుచేస్తూనే ఉండేవాడట. ఒకరోజు రాయలవారు మరీ గట్టిగా అడిగేశాడు. దానికి, కవిత్వం వ్రాయడమంటే మాటలా? అన్నట్టుగా పెద్దనగారు చెప్పిన విసుగుపద్యం ఇది. కవిత్వం వ్రాయాలంటే కవులకు కావలసిన సామగ్రి పట్టీ ఇందులో ఇచ్చాడు.

"నిరుపహతిస్థలంబురమజణీప్రియదూతికతెచ్చియిచ్చు క
ప్పురవిడెమాత్మకింపయినభోజనముయ్యెలమంచమొప్పుత
ప్పరయురసజ్ఞు లూహతెలియంగలలేఖకపాఠకోత్తముల్
దొరకినగాక ! యూరక కృతు ల్రచియింపు మటన్న శక్యమే?"

ఎప్పుడు పడితే అప్పుడు కవిత్వం రాదు. అన్ని సౌకర్యాలూ ఉన్న సురక్షితమైన వ్యక్తిగత ఛాంబర్ (నిరుపహతి స్థలము) కావాలి. ఆపైన ఉయ్యాల మంచం,

ఒప్పుతప్పు తెలిసి కవిత్వాన్ని ఆస్వాదించగల రసికులు ఎదురుగా ఉండాలి, ఊహ తెలుసుకోగలిగి చెప్పింది చెప్పినట్టు వ్రాసే లేఖకులు దొరకాలి. అన్నింటికీ మించి పాఠకోత్తములు ఉండాలి. అప్పుడే పారవశ్యంలో కవిత్వం వస్తుందన్నాడు.

తనంతటి కవి ఆముక్తమాల్యద కర్త కృష్ణదేవరాయలు. ఆయనకు కవిత్వం వ్రాయటం అంటే ఏమిటో వివరించాల్సిన అవసరం లేదు. కానీ, ఈ పద్యంలో తనకన్నా వేగంగా కృతిని పూర్తి చేసిన నందితిమ్మనగారికున్నన్ని సౌకర్యాలు తనకు లేవనే అధిక్షేపం దాగుంది. దాన్ని రాయలవారు అర్థం చేసుకోగలడని పెద్దన నమ్మకం.

రాయల భార్య తిరుమల దేవికి అరణంగా వచ్చిన కవి నంది తిమ్మన కాబట్టి, రాణివాసంలో ఆయన సుఖభోగి. ఆయన కున్న 'ప్రైవసీ' పెద్దనగారికి ఉండి ఉండదు. ఆ అక్కసుని పెద్దనగారు ఇలా బైటపెట్టారు. మనసు తెలిసిన వ్రాయసగాళ్లు ఉచితంగా రారు. వారి ఖర్చులు భరించాలి. కప్పుర విడెము ఇచ్చే రమణీప్రియదూతికలూ ఉచితంగా రారు. నిరుపహతి స్థలం అంటే ఎవరూ వచ్చి డిస్టర్బ్ చెయ్యని వ్యక్తిగత ఛాంబర్. మధ్యతరగతి బ్రాహ్మడి ఇంట్లో ఇలాంటివి అమరే అవకాశం ఉండదు కదా ! రాణిగారి మద్దతున్న ముక్కుతిమ్మన గారికి ఈ సౌకర్యాలన్నీ అమరాయి. ఆ విషయాన్ని రాజుగారికి తెలియజెప్పటం ఈ పెద్దనగారి చాటువు పరమప్రయోజనం.

**ఆడ తాంబూలం – మగ తాంబూలం**

"అతడావాత పరంపరా పరిమళ వ్యాపార లీలజ్జనా
న్వితమిచ్చోటని చేరఁబోయి కనియె న్విద్యుల్లతా విగ్రహన్
శతపత్రేక్షణఁ జంకరీక చికురన్జంద్రాస్యఁజక్రస్తనిన్
నతనాభిన్నవలా నొకనొక మరున్నారీ శిరోరత్నమున్."

ప్రవరుణ్ణి వరూధినినీ కలిపింది తాంబూలమే ! ఎలాగంటారా? దారితప్పి తిరుగుతున్న ప్రవరుడి ముక్కుపుటాలకు పరిమళ భరితమైన ఓ సువాసన సోకింది. ఆ పరిమళాన్ని బట్టి దూరంగా ఎక్కడో ఒక స్త్రీ ఉన్నదని గ్రహించాడు ప్రవరుడు.

ఆడమనిషి పొలువు తెలిపే గాలి అతనికి సోకిందట. ఆ పరిమళం ఎక్కడిదో వెదుకుతూ వెడితే వరూధిని అతని కంటపడింది.

ఆ తరువాత అతన్ని ఆమె వలచి వెంటపడటం, అతను తప్పించుకోవటం, ఓ గంధర్వుడు డూప్లికేట్ ప్రవరుడిగా రావటం ఈ కథంతా అందరికీ తెలిసిందే ! వరూధిని పరిమళ భరిత తాంబూలం వేసుకోకపోతే హిమాలయాల్లో దారి తెలీక దిక్కుతోచక తిరిగే ప్రవరుడికి వరూధిని తెలిసేది కాదు. తాంబూలం ఆ ఇద్దరి కథనీ మలుపు తిప్పింది.

అతడు చల్లటి పిల్లతెమ్మెరల మీదుగా అలలు అలలుగా వస్తూన్న ఆ తాంబూల పరిమళాన్నిబట్టి వెదుకుతూ ముందుకు కదలగా, ఎదురుగా 'మెఱుపుతీగలాంటి యువతి, విరబూసిన పువ్వుల్లాంటి కళ్లతో, తుమ్మెదలు దండుతీరాయా అన్నట్టున్న పొడవైన నల్లటి కురులతో, అందంగా వెలిగిపోతున్న మోముతో, గర్వంగా చక్రాల్లా వంపుదిరిగిన వక్షోజాలతో వళులు తిరిగిన లోతైన నాభి కలిగి మరో లోకం నుంచి దిగివచ్చిందా అనిపించే ఆ వనితామణి వరూధినిని చూశాడు. అలా తాంబూలం వరూధిని ప్రవరుల్ని కలిపింది.

"మృగమదసౌరభవిభవ
ద్విగుణిత ఘనసార సాంద్ర వీటీగంధ
స్థగితేతర పరిమళమై
మగువపాలుపు దెలుప నొక్క మారుతమొలసెన్"

''మృగమదసౌరభవిభవద్విగుణితఘనసారం'' స్త్రీలు వేసుకునే తాంబూలంలో ఉంటుంది. అంటే, ఆడవాళ్లు వేసుకునే తాంబూలంలో కస్తూరి రెండుపాళ్లు, పచ్చకర్పూరం ఒకపాలు ఉంటాయి. మగవాళ్ళు వేసుకొనే తాంబూలంలో కస్తూరి ఒకపాలు పచ్చ కర్పూరం రెండు పాళ్లు ఉంటాయి. కస్తూరి లైంగికవాంఛని రెచ్చగొడ్తుంది. కర్పూరం పునస్సమాగమానికి పురికొల్పేదిగా పనిచేస్తుంది. అందుకని స్త్రీలు రెచ్చగొట్టే కస్తూరిని ఎక్కువగానూ, పురుషులు సమర్థతను పెంచే పచ్చకర్పూరాన్ని ఎక్కువగానూ వాడతారు. అంతేకాదు ఎక్కువ కస్తూరితో తాంబూలం వేసుకుంటే పురుషుల్లో శీఘ్రస్ఖలనం ఏర్పడుతుందనే నమ్మకం కూడా ఉంది. అది స్త్రీలకు వర్తించదు. 'స్త్రీవీటీ' లో కస్తూరి పాళ్లు ఎక్కువగా ఉంటాయి. దాన్ని వేసుకున్న స్త్రీ నోటి కస్తూరి పరిమళం దూరంగా వ్యాపించి ఉంటుంది. ప్రవరుడు గుర్తుపట్టింది దాన్నే. మగతాంబూలానికి ఆడతాంబూలానికి తేడా ఆ కాలంనాటి

రసికులకు మాత్రమే తెలుసు ! ప్రవరుడు ఏకపత్నీ వ్రతుడేగానీ అరసికుడని పెద్దన గారు చెప్పలేదు. ప్రవరుడి భార్య గుండెడు అన్నాన్ని వొంటి చేత్తో వండి వార్చగల దిట్టే అయినా భర్తను మురిపించగల నాయికే ! ప్రవరుడు ఏకపత్నీ వ్రతుడు కాగలగటమే అందుకు సాక్ష్యం.

**వీధుల్లో పోకిరీలు**

కందుకూరి రుద్రకవి (1480-1560) కృష్ణదేవరాయల ఆస్థానంలోని అష్టదిగ్గజ కవులుగా పేరొందినవారిలో ఒకడు. జనార్దనాష్టకం, నిరంకుశోపాఖ్యానం, సుగ్రీవవిజయం యక్షగానం ఈయన రచనల్లో ముఖ్యమైనవి. ఈనాటి ప్రకాశం జిల్లా, కందుకూరుకు చెందినవాడు.

"మీర ఘనసార తాంబూల సౌరప్రవాహవహ గంధవాహ ప్రదోహమోహ
వశ విశాలేక్షణాజనస్యాంతుడగుచు, రాత్రుల జరించుచుండు నా బ్రాహ్మణుండు"

నిరంకుశుడనే ఓ బ్రాహ్మణ యువకుడు రాత్రిపూట వేశ్యావీధుల్లో తిరుగాడుతున్న వైనాన్ని తన నిరంకుశోపాఖ్యాన కావ్యంలో ఇలా వర్ణించాడు రుద్రకవి.

నిజానికి 500 ఏళ్లనాటి ఈ వర్ణన చూస్తే ఇప్పటి కొందరు కుర్రాళ్లను చూసి వర్ణించాడా అనిపిస్తుంది. మనం ఏదో నాగరికులమని మన పూర్వులంతా పాత చింతకాయ పచ్చడి, వాళ్లకేమీ తెలీదని అనుకుంటూ ఉంటారు కదా... కానీ, ఈ నిరంకుశుడి వేషం ఇప్పటి వాళ్లని మించిపోయింది.

కర్పూరపు తాంబూల సువాసన సన్నగాలి మొలకలతో కూడి సోకుటవలన కామినులు మోహపరవశులౌతుండగా ఇతను రాత్రిళ్లు వీధుల్లో తిరుగుతున్నాడట. అతని నోట్లోంచి తాంబూల సువాసన ఆ వీధిలో ప్రవహిస్తోందట !

మెడలో కాలరు కింద  ఒంటిపొర ఎర్రరుమాలు కట్టుకున్నాడట.

చల్లడ అంటే, సగం తొడలదాకా తొడిగిన గుడిగి (కురుచలాగు - దీన్ని షార్ట్ అంటూన్నాం ఇప్పుడు) తొడుక్కుని తాంబూల పరిమళంతో అమ్మాయిల్ని ఆకర్షించాలని తిరిగే పోకిరీగా ఈ నిరంకుశుణ్ణి వర్ణిస్తాడు రుద్రకవి.

ఇప్పటి వాళ్లకి ఏమీ తీసిపోయినవాళ్లు కాదు 500 యేళ్లనాటి కుర్రాళ్లు. ❑

# రాయలవారి దసరా ఉత్సవాలు

భారత గణతంత్ర దినోత్సవం నాడు జనవరి 26న ఎర్ర కోట వద్ద నిర్వహించే దేశ రక్షణ యంత్రాంగాన్ని, దేశం ఈ ఏడాది కాలంలో సాధించిన ప్రగతిని ప్రదర్శిస్తూ, నిర్వహించే ఉత్సవాలకు విజయనగర మూలాలున్నాయి. డొమింగో పేస్, అబ్దుల్ రజాక్ లాంటి యాత్రికులు విజయనగర ప్రభువులు దసరా ఉత్సవాలను నిర్వహించిన తీరు గురించి కొన్ని వివరాలు వ్రాశారు.

విజయనగర రాజుల కాలంలోని దసరా ఉత్సవాలను అనుకరిస్తూనే మైసూరు రాజులు కూడా దసరా పండుగ జరుపుతున్నారు. ఈ నాటికీ ఆ ఆచారం కొనసాగుతోంది.

శ్రీరాముడి లంకావిజయం నుండి దసరా ఉత్సవాలు ఆరంభం అయ్యాయని కొందరు, కౌరవులపై విజయుడి విజయం నుండీ ఆరంభమయ్యాయని మరికొందరూ చెప్తారు. ఇంకా రాక్షసులపై ఇతర దేవతల విజయాలను కూడా ఉదహరిస్తారు. అమ్మవారి మహిషాసుర సంహారమే దసరా పండుగ జరుపుకోవటానికి కారణం. శమీపూజ : శమీ శమయతే పాపం శమీ శత్రు వినాశనీ అర్జునస్య ధనుర్ధారీ రామస్య ప్రియదర్శినీ – అర్జునుని ధనస్సును ధరించి, రాముడికి ప్రియాన్ని చేకూరుస్తూ శమీవృక్షం పాపాలను, శత్రువులను నాశనం చేస్తుంది... అని మంత్రం జపిస్తూ జమ్మిచెట్టును ఆరాధిస్తారు.

రావణ సంహారానికి బయల్దేరబోయే ముందు శ్రీరామచంద్రుడు మొదట దేవీ పూజ చేశాడని, దేవి ఆశ్వయుజ శుద్ధ పాడ్యమి నాడు ప్రత్యక్షమయ్యిందని, రావణ సంహారం జరిగాక శమీపూజ చేసి పుష్పక విమానంలో అయోధ్య చేరుకున్నాడని ఒక ఐతిహ్యం. అజ్ఞాత వాసానికి వెళ్లబోయే ముందు తమ

దివ్యాయుధాల్ని జమ్మిచెట్టు మీద భద్రపరచారు. వాటిని ఆ మహావృక్షం పరుల కంటపడకుండా కాపాడింది. అందుకనే ప్రజలు శమీపూజ చేస్తారు. అందుకు దసరా పండుగ ఒక మంచి అవకాశం, అనువైన సమయం కూడా !

విజయనగర రాజులు విజయదశమి నాడు శమీపూజకి వెడతారు. మైసూరు రాజులు ఈ పద్ధతిని అనుసరిస్తున్నారు నేటికీ ! దీన్ని కన్నడంలో 'జంబూసవారీ' అంటారు.

చక్కగా అలంకరించబడిన పట్టపుటేనుగునెక్కి రాయలవారు ముందు సాగుతుంటే, వెనుక ఆశ్విక హస్తి పదాతి దళాలు నడుస్తుండగా, మంత్రి సామంతులు వెంటరాగా, కళాప్రదర్శనలతో బాజాభజంత్రీలతో ఊరేగి వెడతారు. ఈ ఉత్సవం చూడటానికి లక్షలాది జనం విచ్చేసి ఆనందించేవారు.. సామంత రాజులు వచ్చి కట్టవలసిన కప్పాలు చెల్లిస్తారు. ఇప్పుడు ఢిల్లీ ఎర్రకోట వద్ద నిర్వహిస్తున్నట్టే అప్పట్లో హంపీ విజయనగరంలో ఆ ఉత్సవం అంతా 'దసరాదిబ్బ' వద్ద జరిగేది. కానీ, ఆ పండుగ సందర్భంగా నిర్వహించే ప్రదర్శనే ముఖ్యమైంది. దాన్ని ప్రారంభించినవారు విజయనగర రాజులు.

శ్రావణ భాద్రపదాలలో వానలు ముమ్మరంగా ఉంటాయి. యుద్ధాలకు అనుకూలత తక్కువ కాబట్టి, సైనిక శక్తిని సన్నద్ధం చేసుకోవటానికి కావలసిన విరామం వానాకాలంలో ఉంటుంది. వానలు వెనకబట్టి, శరదృతువు రాగానే యుద్ధ భేరీభాంకారాలు మార్మోగుతాయి. విజయదశమి రోజున ఆయుధపూజ చేస్తారు. రాజు తన సైనికబలగాన్ని సమీక్షించుకుంటాడు. తగిన వ్యూహాన్ని రూపొందించుకుని యుద్ధానికి బయల్దేరే ముహూర్తం విజయదశమి.

ఇప్పటి 'రిపబ్లిక్ డే పెరేడ్' నాడు దేశరక్షణ యంత్రాంగాన్ని ప్రదర్శించినట్టే శ్రీ కృష్ణదేవరాయల కాలంలో సైనిక కవాతులు, ఏనుగులు, పోర్చుగీసుల నుండి కొన్న బలమైన గుర్రాలు, మరఫిరంగులు వగైరాల్ని ప్రదర్శించేవారు. మల్లయుద్ధాలు, కత్తి యుద్ధాలు, విలువిద్యా ప్రదర్శనలు వగైరా ఈ 9 రోజులూ జరిగేవి. ప్రజలు లక్షలాదిగా రాజధానికి తరలివచ్చి వీటిని తిలకించేవారు. 10వ రోజు విజయదశమి.

రాజు తన సైనిక శక్తిని సమీక్షించుకుని తన యుద్ధ నిర్ణయాన్ని ప్రకటించే అవకాశం ఉన్న రోజు అది. ఒక విధంగా నవరాత్రులు భక్తి ప్రధానంగా సాగితే దసరా ఉత్సవాలు సామాజికంగా, రాజకీయంగా జరిగేవని దీన్ని బట్టి భావించవచ్చు.

**మైసూరు ఉత్సవాలు**

రాయలవారి తరువాత కూడా విజయనగర వారసులు ఈ ఉత్సవాలను జరిపిస్తూనే వచ్చారు. మైసూరు మహారాజా ఇదే పద్ధతి లోనే దసరా ఉత్సవాలను కొనసాగించాడు. నేటికి ఆ వంశీకులు మైసూరులో నిర్వహించే దసరా ఉత్సవాలకు ప్రసిద్ధి ఉంది. ఆ తరువాత బ్రిటిష్ వారు, ఇతర యూరోపియన్లు కూడా విజయదశమి నాడు తుపాకులను జమ్మిచెట్టు దగ్గర ఉంచి పూజించటం మొదలు పెట్టినట్టు బ్రిటిష్ రికార్డులు చెప్తున్నాయి. ఇప్పటికీ పోలీసువారు ఆయుధపూజ ఆచారాన్ని కొనసాగించటానికి అది బ్రిటిష్ వారి నుండి సంక్రమించిన ఆచారం కావటమే కారణం.

రాచరికాల యుగం పోయి జమీందారుల యుగం వచ్చాక తెలుగు నేలపైన జమీందార్లు కూడా తమ హెూదాని చాటుకునేందుకు, ప్రజలను సమీకరించేందుకు దసరా ఉత్సవాలు కొనసాగించారు. స్వాతంత్ర్యం వచ్చాక క్రమేణా రాజకీయ ప్రాబల్యం కోరుకునేవారి నిర్వహణలో వీధిపందిళ్ళు వేసి ఉత్సవాలు నిర్వహించటం అలవాటుగా మారింది. ఎన్నికల సంవత్సరంలో కనిపించిన హడావిడి ఎన్నికలై పోయాక కనిపించదు. దసరా ఉత్సవ స్ఫూర్తి ఈ నిర్వహణలో ఎక్కడా కనిపించదు.

విజయాలకు సంకేతం విజయదశమి. చెడుమీద మంచి సాధించే విజయమే ముఖ్యం. మన విజయాలు చెడుమీద గెలుపుకు ప్రాతిపదికగా ఉండాలనేదే సందేశం.

"రాయలవారు ఎంతటి వైష్ణవుడో అంతటి శైవుడు. శ్రీ విద్యారణ్యుల నాటినుండి శ్రీ శృంగేరీ విరూపాక్ష స్వాములు విరూపాక్షము లోనే ఉండి చక్రవర్తులకు తమ శ్రీ హస్తములతోడనే పట్టాభిషేకము చేయుచుండిరి. అట్లు పట్టాభిషిక్తుడైనవాడే శ్రీకృష్ణదేవరాయలు. ఆయన పట్టాభిషిక్తుడైన వెంటనే ఆయన కావించిన

బృహత్కార్యము శ్రీ విరూపాక్షస్వామి ఆలయమునకు మహా గోపురము నిర్మించుట. అది నేటికిని రాయల శివభక్తి చిహ్నముగా నిలిచియున్నది. ఒక్క విరూపాక్షము లోనేకాదు. ఆయన కంచిలో శ్రీకాళహస్తిలో శ్రీశైలములో మరియు నెన్నియో శివక్షేత్రములలో మహాగోపురములు తన కీర్తిధ్వజములుగా నిర్మించినవి నేటికిని నిలిచియున్నవి" అని నోరి నరసింహశాస్త్రి ఆముక్తమాల్యద కర్తృత్వ నిర్ణయము' వ్యాసంలో వ్రాశారు.

రాయలవారు శైవాన్ని నిర్లక్ష్యం చేయలేదు. ఆచార్య యం. యం. కలిబుర్గి లాంటి వ్యక్తులు రాయలు కన్నడానికి ఏమీ చెయ్యలేదని వ్రాశారు. ఆంధ్రలోని దేవాలయాలు దర్శించాడుగానీ కర్ణాటక దేవాలయాలను దర్శించలేదని వ్రాశాడు. అష్టదిగ్గజాలనే భావన తెలుగు వారు కల్పించుకున్నది. కలిబుర్గి దాన్ని నమ్మి కన్నడం వాళ్లకు అందులో చోటులేదని అసూయ పెంచుకున్నారు. రాయలపట్ల శత్రుత్వాన్ని వహించారు. కృష్ణదేవరాయ ఉత్సవాలను బహిష్కరించాలన్నాడు.

రాయల పాలనా కాలంలో ప్రధాన దేవాలయ ప్రాంతాలు కర్ణాటకలో సుల్తానుల ఆధీనంలో ఉన్న సంగతి కలిబుర్గీ మరిచారు. ఆయన శాసనాలు 4 భాషల్లో దొరుకుతున్నాయి ఆయన చేరదీసిన కవుల్లో కన్నడ కవులు అనేకులున్నారు. ఆయన శైవాన్ని సమాదరించారు. దసరా రోజున అమ్మవారి పూజ, దేవీ నవరాత్రులు యథావిధిగానూ ఘనంగానూ జరిపించారు.

**తిరుమలలో దశమి ఉత్సవాలు**

విజయపుటమ్ము వేసె వెంకటేశుడు
విజయుని సఖుడు యీ వేదమూరితి
పాఱతెంచి దశకంఠు పది శిరసుల మీద
అఱికి నమ్ముువేసె నాది దేవుడు
అఱిడి సేనల తోడ నంబుధి మీద వేసె
శేఱొక యమ్ము దొడిగి విష్ణుదేవుడు
చాలుగ ఱేడు రాళ్లు సర్వము నొక్కటిగాక

అలములో నమ్ము వేసె నఖలేసుడు
ఆలించి రుక్మిణి బెండ్లియాడునాడు వైరులపై
జాలి యమ్ము వేసెను విజయకృష్ణుడు
భజన నిందిర గూడి పంతమున నమ్ము వేసె
విజయదశమిని శ్రీ వెంకటేశుడు
సుజనుల దేవతల సొరిది నిందరిగాచు
విజయము చేకొనె విష్ణుదేవుడు (8-83)

అన్నమాచార్య సంకీర్తనల్లో విజయదశమి ఉత్సవాన్ని వర్ణించే ఈ కీర్తన చాలా విశిష్టమైనది. ఇందులో విజయదశమి ప్రాధాన్యతకు రెండు ఇతిహాసాలలోని సంఘటనలను తీసుకుని ఈ కీర్తన ఆలపించాడు అన్నమయ్య. సముద్రాన్ని శాంతింపచేసి వారధి కట్టి, రావణాసురుడి పది తలలు నరకటం ఈ కీర్తనలో మొదటి భాగం. ఇంక రుక్మిణీదేవిని చేపట్టి అడ్డగించిన శత్రువులను ఓడించటం రెండవ భాగం.

1. విజయపుటమ్ము వేసె వెంకటేశుడు విజయుని సఖుడు యీ వేదమూరితి: విజయం అనే బాణం వేశాడు వెంకటేశుడు. విజయుని సఖుడైన శ్రీ కృష్ణుడు-ఈ వేదమూర్తి.
2. పొఅతెంచి దశకంఠు పది శిరసుల మీద అఠికి నమ్మువేసె నాది దేవుడు : దశకంఠుని పది తలలు తెగేలా శక్తివంతమైన బాణాన్ని వేశాడు ఆ ఆది దేవుడు. అరి అంటే శత్రువు, అరిషడ్వర్గములు అనే అర్థాలతోపాటు చక్రము, సుదర్శనము, మిస్సైల్ లాంటి శక్తివంతమైన ఆయుధం అని కూడా అర్థాలున్నాయి.
3. అఱడి సేనల తోడ నంబుధి మీద వేసె శేఱొక యమ్ము దొడిగి విష్ణుదేవుడు: అరడము అంటే ఉత్సాహం. ఊపు మీద ఉన్న సైన్యంతో ఆ అలల ఉధృతి నణిచే బాణాన్ని సముద్రం పైన ప్రయోగించాడు విష్ణుదేవుడు.

4. చాలుగ ఏడు రాళ్లు సర్వము నొక్కటిగాక అలములో నమ్ము వేసె నఖలేసుదు: రాళ్లలోకెల్ల శ్రేష్ఠమైన రాళ్లు, చాలుగ అంటే ఒక వరుసలో ఒక్కటయ్యేలా అలము అంటే కక్ష్య (orpiment) లోకి బాణం వేశాడు అఖలేశుడు. 'అఖలః' అంటే గొప్ప వైద్యుడని.

5. ఆలించి రుక్మిణి బెండ్లియాడునాడు వైరులపై జాలి యమ్ము వేసెను విజయకృష్ణుడు : తన దగ్గరకు వచ్చి చేపట్టమని కోరిన రుక్మిణీదేవి కోరికను ఆలించి, ఆమెతో తన పెళ్లిని అడ్డగించిన వైరివర్గం మీద (జాలి అమ్ము) బాణాల వల వేశాడు. అందరినీ ఒకేసారి ఓడించాడని భావం.

6. భజన నిందిర గూడి పంతమున నమ్ము వేసె విజయదశమిని శ్రీ వెంకటేశదు: భజనము అంటే సేవించటం. తనను సేవిస్తున్న లక్ష్మీదేవితో కలిసి తన పంతం (ప్రతిజ్ఞ) నెరవేర్చటానికి విజయదశమినాడు దుష్టశక్తుల పైన బాణం ఎక్కుపెట్టాడు శ్రీ వెంకటేశుడు.

7 .సుజనుల దేవతల సొరిది నిందరిగాచు విజయము చేకొనె విష్ణుదేవుడు: సొరిది అంటే వరుసగా, క్రమంగా, విశేషంగా , విస్తారంగా అని ! పుణ్యాత్ముల్ని దేవతల్ని వరుసగా ఇందరినీ సంరక్షిస్తూ విజయాన్ని చేకొన్నాడు విష్ణుదేవుడు.

శ్రీ వేంకటేశ్వరుడు రామావతారంలో రావణవధ చేసి సీతను చేపట్టటం, కృష్ణావతారంలో రుక్మి, శిశుపాలాదులను ఓడించి రుక్మిణిని చేపట్టటం కలియుగంలో దుష్టశక్తులను ఒక కంట కనిపెట్టి ఉంటాడని హెచ్చరించటం ఈ కీర్తనలో ముఖ్యాంశాలు.

తిరుమల కొండమీద ప్రస్తుతం జరిగే ఎన్నో ఉత్సవాలకు అన్నమయ్య ప్రారంభకుడని పండితుల అభిప్రాయం. విజయదశమి ఉత్సవాల్ని కూడా అన్నమయ్యే ప్రారంభించాడని భావిస్తున్నారు. "శరన్నవరాత్రుల తరువాత దశమి నాటి రోజు చేసే సర్వోత్సవం విజయదశమి. ఆయా మతస్థులు తమ విశ్వాసాల కనుగుణంగా బేతాళపూజ, ఆయుధపూజ, అపరాజిత దేవీ పూజలు చేస్తారు. తిరుమలలో

విజయదశమి 'పారువేట ఉత్సవం' నిర్వహిస్తారు" అని డా॥ చిత్రాజు గోవిందరాజు "తాళ్లపాక అన్నమయ్య సంకీర్తనలలో ఉత్సవ విశేషాలు" గ్రంథంలో పేర్కొన్నారు.

పారువేట అంటే పరిగెత్తే దాన్ని వెంటాడటం. చిరకాలంగా రాజులు ప్రజలందరి సమక్షంలో విజయదశమి పండుగను జరిపే ఆచారం ఉండటం చేత, ఆయుధపూజలు వగైరాలతోపాటు వేటాడటాన్ని కూడా ఒక అంశంగా ఆచరించేవారు. అన్నమయ్య కూడా వెంకటేశుని చేత బాణం ఎక్కు పెట్టించి కలియుగంలో దుష్టశక్తులను జాగ్రత్త...అని హెచ్చరించాడు. ఈ విజయదశమి కీర్తనలో ఇదే కనిపిస్తుంది.

ఈ పారువేటనే 'పార్వేట' అని కూడా పిలుస్తారు. పారువేట ఉత్సవంలో ఉత్సవ విగ్రహమైన మలయప్ప స్వామిని వేటాడే రాజుగారి రూపంలో శంకం, చక్రం, గద, బాణం, ఖడ్గం వంటి పంచాయుధాలతో అలంకరించి తాళ్లపాకవారి పార్వేటి మండపానికి తోడ్కొని వస్తారు. అక్కడ దగ్గరలో పొదల్లో బంగారంతో చేసిన జింక ఇంకా ఇతర జంతువుల బొమ్మలు ఉంచుతారు. అర్చకులు బంగారంతో చేసిన బల్లెం తీసువచ్చి వేటను కొనసాగిస్తారు. దసరా బొమ్మలకొలువు అనే వ్యవహారానికి మూలం ఇక్కడ కనిపిస్తుంది. మనం సంక్రాంతికి బొమ్మల కొలువు పెడతాం. కానీ వ్యవహారంలో 'దసరా బొమ్మల కొలువు' అంటాం. పారువేట మహోత్సవం రోజున శ్రీరాముడు బంగారు లేడిని వేటాడే సన్నివేశాన్ని బొమ్మలతో అలంకరించటం...బాలబాలికలకు, యువతీ యువకులకు మన సంస్కృతి ఆచార వ్యవహారాలు, మన కట్టుబాట్లు, పెద్దలపట్ల మన గౌరవాల గురించిన అవగాహన కల్పించటానికే ! అమ్మవారికి తొమ్మిది రోజులూ తొమ్మిదరకాల అలంకారాలు చేయటం కూడా ఈ బొమ్మల కొలువు భావనలోని అంశమే !

అక్కడినుండి స్వామివారు పారువేట మండపానికి వేంచేస్తారు. అచ్చట స్వామివారికి 'ఆరాధనా తళిగెలు' నివేదిస్తారు.

తళిగ, తళియ, తళిహ అంటే, 'భగవంతుడికి నివేదనార్హమైన అన్నము' అని అర్థం. ఆపై హారతి జరిపించి స్వామివారికి మర్యాదలు చేస్తారు. స్వామివారు

పారువేట ముగించుకుని మహాద్వారం వద్దకు రాగా హత్తిరాంజీ మఠం వారు హారతి సమర్పిస్తారు.

విజయదశమి రోజున ఈ పార్వేట ఉత్సవం అన్నమయ్య కాలం నుండీ జరుగుతోందనటానికి ఆధారంగా తిరుమలలోని ఆలయ గోడల పైన నాలుగు శాసనాలను శ్రీ గోవిందరాజు ఉదహరించారు. 536 రామానుజ దాసర్ శాసనం, 543 అంధకాలం తీర్థర్ కుమారుడు ఎల్లప్ప పిళ్ళ శాసనం, 544 పొట్టరాజ కుమారుడు రెండవమట్ల వరదరాజ శాసనం, 545 మలైనిన్ర భట్టర్ అప్పయ్యన్ కుమారుడు వేంకటత్తురైవర్ శాసనాలలో విజయదశమి ప్రస్తావనలున్నాయని వ్రాశారు. విజయదశమి ఉత్సవంలో జమ్మిపూజని "వన్నిమరం" పూజ అనీ, తోటమండపంలో అలమేర్మంగై నాచ్చియార్ పూలతోట మండపంలో పారువేట జరిగేదని ఈ శాసనాలను బట్టి తెలుస్తోందన్నారు.

శరదృతువు ఆరంభంలో వచ్చే పండుగ కనుక శరన్నవరాత్రులనే పేరు వచ్చింది. మొదటి మూడు రోజులు పార్వతిదేవికి తరువాతి మూడు రోజులు లక్ష్మీ దేవికి, తరువాతి మూడురోజులు సరస్వతి దేవికి పూజలు నిర్వహిస్తారు. పోతన గారు ప్రార్థించిన ముగురమ్మల మూలపుటమ్మకు సంబంధించిన పండుగ ఇది. శివుడు, విష్ణువు, అగ్ని ఈ ముగ్గురు అయ్యల నుండి శక్తిని సముపార్జించుకుని దుష్టశిక్షణ చేసే యుద్ధ దేవతగా అమ్మవారు ఆదినుండీ ప్రసిద్ధి. హిందువులలో శాక్తేయులు, వైష్ణవులు, శైవులు ముగ్గురూ ఈ అమ్మతల్లిని ఆరాధిస్తారు.

నవరాత్రులు, దసరా ఉత్సవాలు ఈ రెండింటికీ మౌలికంగా కొంత తేడా ఉంది. నవరాత్రులు 9 రాత్రులకు సంబంధించిన భక్తిపరమైన, మతపరమైన అంశాలతో కూడి ఉంటాయి. కానీ, దసరా అనేది 9 పగళ్లకు(Days) సంబంధించినది. భక్తి పరమైన అంశాలతో పాటు సామాజిక పరమైన రాజకీయ పరమైన అంశాలు ఈ పది రోజుల ఉత్సవాలలో అదనంగా ఉంటాయి. ఇది విజయనగర రాజుల కాలంలోనే రూపొంది సామాజికమైన ఉత్సవంగా పరిణామం పొందింది. ❑

కళారత్న, భాషాభిజ్ఞ, సభాసరస్వతి, తెలుగుపసిడి, వైద్యవిజ్ఞాన శౌరి,
సాహితీస్వర్ణోత్సవ రచయిత

# డా॥ జి.వి.పూర్ణచందు, B.A.M.S.,

రచయితగా 50 యేళ్ల సాహితీ ప్రస్థానంలో, గ్రంథరచయితగా 45 ఏళ్ళ కాలంలో మొత్తం 150 కి పైగా పుస్తకాలు వెలువరించి సాహితీ స్వర్ణోత్సవం జరుపుకున్న సాహితీమూర్తి డా॥ జి.వి.పూర్ణచందు.

కాలమిష్టు, సంపాదకుడు, 43 ఏళ్లుగా రాష్ట్రంలో ప్రసిద్ధ ఆయుర్వేద వైద్యుడు, చిత్రకారుడు, తెలుగు భాష మూలాల్ని తవ్వి తీసిన పరిశోధకుడు, భాషోద్యమ ప్రముఖుడు, మన ఆహార సంస్కృతి మూలాల్ని వెలుగులోకి తెచ్చిన తొలి తెలుగు ఆహార చరిత్రకారుడు, గ్రంథకర్త, ఆరు పర్యాయాలు ప్రపంచ తెలుగు రచయితల మహాసభలకు బాధ్యతలు వహించిన మహాకార్యదర్శి, భాషాసాహిత్య పరిరక్షణలో బహుముఖీనమైన పాత్ర నిర్వహిస్తూ, ఉభయ రాష్ట్రాల్లోనూ పరిచయం అవసరంలేని సాహితీవేత్తగా చిరపరిచితుడు.

75 కి పైగా పురస్కారాలు అందుకొని, రచయితగా తాను అత్యంత సంతృప్త జీవినని ప్రకటించుకున్న సాహితీ పరిపూర్ణజీవి డా॥ జి.వి.పూర్ణచందు.

1970-71లకే, హైస్కూల్లో చదివే రోజుల్లోనే మేఘమాల లిఖిత మాసపత్రిక సంపాదకత్వం వహించారు.

వివిధపత్రికల్లో 40 కి పైగా శీర్షికలు లేదా ధారావాహికలు వ్రాశారు. 3,000 పైగా వ్యాసాలు వ్రాశారు. కవితలు, కథలు, నవలలు, రేడియో నాటికలతోపాటు, విమర్శనా వ్యాసాలు, పరిశోధనా వ్యాసాలు, జీవిత చరిత్రలు కూడా వ్రాశారు. వివిధ "యూ ట్యూబు ఛానల్స్ ద్వారా మెడికల్ ఇంటర్వ్యూలు,

ప్రసంగాలు లక్షల సంఖ్యలో తెలుగు వీక్షకుల సందర్శనాన్ని పొందాయి. దేశవిదేశాల్లో వీరి వీడియోలకు అభిమాన సందోహం ఉంది.

ఆంధ్రజ్యోతి ఆదివారం సంచికలో మన ఆహారసంస్కృతి మూలాల్ని తవ్వి తీస్తూ "తినరా మైమరచి" శీర్షికన ఆయన వ్రాసే వ్యాసాలు, ఆంధ్రప్రభ, అమ్మనుడి, విశాలాక్షి, Neo Science Hub, 'సంచిక' వెబ్ పత్రిక ఇంకా అనేక దినపత్రికల్లో, మాసపత్రికల్లో వ్రాస్తున్న వ్యాసాలు మన భాష పట్ల, మన చరిత్ర పట్ల పూర్ణచందు నిబద్ధతను చాటుతాయి.

30కి పైగా పరిశోధనా బృహద్గ్రంథాలకు సంపాదకత్వం / సహ సంపాదకత్వం వహించారు.

తెలుగు భాషా సంస్కృతుల మూలాలు వెలికితీసి "తెలుగే ప్రాచీనం" "నైలు నుండి కృష్ణదాకా" గ్రంథాల ద్వారా భాషోద్యమ దీప్తి కలిగించారు.

లండన్ నగరంలో జరిగిన తొలి ప్రపంచ తెలుగు చరిత్ర మహాసభల్లో తెలుగువారి ఆహారచరిత్రపైన పత్ర సమర్పణ చేశారు. అనేక విశ్వవిద్యాలయాల జాతీయ సదస్సులలో కీలక ప్రసంగం చేశారు.

పూర్వపు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీకి 1984లో జరిగిన ఎన్నికల్లో ఆంధ్ర-నాగార్జున విశ్వవిద్యాలయాల సాహితీ సంస్థల నియోజకవర్గం నుండి తన 26వ యేట సభ్యునిగా ఎన్నికయ్యారు.

1979-80లలో ప్రారంభమైన మినీకవితా ఉద్యమంలో పూర్ణచందు ప్రముఖపాత్ర పోషించారు. అనేక ప్రాంతాల్లో మినీకవితా ప్రదర్శనలు ఏర్పాటు చేసి ఆ ప్రక్రియ ఉద్యమరూపం సంతరింపచేశారు. కవిత్వానికి ప్రదర్శన అనే ఆలోచన పూర్ణచందుదే !

తెలుగు భాషోద్యమ ప్రముఖుడిగా రచయితల పాదయాత్ర సహా వందలాది కార్యక్రమాలు, జాతీయ అంతర్జాతీయ సదస్సులు నిర్వహించారు. తెలుగు భాష, సంస్కృతుల ప్రాచీనతను నిరూపిస్తూ అనేక గ్రంథాలు వ్రాశారు.

కృష్ణా విశ్వవిద్యాలయం ఏర్పాటులోనూ, దానిలో తెలుగు శాఖ ప్రారంభించటంలోనూ విశేష కృషిచేశారు. తన స్వంత గ్రంథాలయం నుండి 1500 పుస్తకాల్ని అలాగే కృష్ణాజిల్లా రచయితల సంఘం పక్షాన 6 బీరువాల్ని తెలుగు శాఖకు అందించారు.

శ్రీకాకుళం కృష్ణదేవరాయ మహోత్సవాల నిర్వహణలో ముఖ్యపాత్ర వహించారు. పద్యకవితా బ్రహ్మోత్సవాలు, తెలుగు భాషా బ్రహ్మోత్సవాలు, జానపద సాహిత్య వైభవ సదస్సులకు సంచాలకుడిగా వ్యవహరించారు...

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ హంస పురస్కారం, అఖి భారత సాహిత్య సమ్మేళన్ వారి సరస్వతి సమ్మాన్ పురస్కారం, తెలుగు విశ్వవిద్యాలయం కీర్తి పురస్మారం, అధికార భాషాసంఘం భాషాభిజ్ఞ పురస్మారం, కాశీనాథుని నాగేశ్వర రావు ఫౌండేషన్ సాహితీ పురస్మారం, ఆరుద్ర సాహితీ పురస్మారం, సద్గురు శివానంద శ్రీరామనవమి పురస్మారం, మారిషస్ ప్రధాని చేతుల మీదుగా ముంబై తెలుగు సమాఖ్య వారి జీవన సాఫల్య పురస్మారం, మద్రాస్ శీకళాసుధ జాతీయ పురస్మారం మరియు రజత కిరీట ధారణ, ఆంధ్ర సారస్వత పరిషత్ పూర్ణకుంభ పురస్మారం, వంశీ ఆర్ట్ థియేటర్స్ వారి లత సాహితీ స్వర్ణవంశీ పురస్మారం, జానమద్ది హనుమచ్ఛాస్త్రి ప్రతిభా పురస్మారం, గోపీచంద్ సాహితీ పురస్మారం, మధునాపంతుల సూరయ్య ప్రతిభా పురస్మారం, డా॥ ద్వా నా శాస్త్రి సాహితీ పురస్మారం, ఇలా 70కి పైగా అవార్డులు, విశిష్ట సత్కారాలు పొందారు. కళారత్న సభాసరస్వతి, భాషాభిజ్ఞ, తెలుగుపసిడి, వైద్యవిజ్ఞాన శౌరి బిరుదులు వీరిని వరించాయి.

2008లో ఆచార్య శరజ్యోత్స్నారాణి జ్యోత్స్నకళాపీఠం పురస్కారాన్ని పూర్ణచందుకి అందించిన సభలో సినారె ప్రసంగిస్తూ, “తెలుగు ప్రాచీనుడు మన పూర్ణచందు” అన్నారు. బుద్ధప్రసాద్, లక్ష్మీప్రసాద్, గుత్తికొండసుబ్బారావు, పూర్ణచందు ఈ నలుగురూ భాషోద్యమానికి నాలుగు స్తంభాలని సినారె అనేక సభలలో వ్యాఖ్యానించారు. సినారె ప్రశంసే అన్నింటికన్నా పెద్ద పురస్మారంగా భావిస్తాడు పూర్ణచందు.

**వ్యక్తిగతం :** డా॥ జి.వి.పూర్ణచందు 1973-75 విజయవాడ శాతవాహన

కళాశాలలో ఇంటర్మీడియట్, 1976–81 విజయవాడ నోరి రామశాస్త్రి ప్రభుత్వ ఆయుర్వేద కళాశాలలో ఆయుర్వేద వైద్యం చదివారు. 1982 నుండి సుశ్రుత ఆయుర్వేద ఆసుపత్రి నడుపుతున్నారు.

భార్య గంగరాజు అరుణాదేవి. ఆమె కూడా రచయిత్రి. నలుడి 'పాకదర్పణం, క్షేమశర్మ క్షేమకుతూహలం, రఘునాథ సూరి భోజనకుతూహలం గ్రంథాలకు వ్యాఖ్యానం వ్రాయటానికి పూర్ణచందుకు సహరచయిత్రిగా ఉన్నారు.

కుమార్తె లక్ష్మీ చేతన, అల్లుడు చక్కిలం శివరామ్ మల్లిక్. న్యూజెర్సీలో ఇద్దరూ సాఫ్ట్ వేర్ రంగంలో పనిచేస్తున్నారు. మనుమరాలు శ్రీ సాత్విక, మనుమడు సమన్యు.

కుమారుడు డా॥ మనో కార్తీక్ చెన్నై ఐఐటిలో పిహెచ్ డి, (గోల్డ్‌మెడల్) దక్షిణకొరియాలో పోస్ట్ డాక్టొరేట్ చేశారు. వారణాసి ఐ ఐటిలో అసిస్టెంట్ ప్రొఫెసర్ గా పనిచేస్తున్నారు. కోడలు సౌమ్య. మనుమరాలు పూర్ణసంహిత.

## డా॥ జి.వి.పూర్ణచందు రచనల వివరాలు

### 1. సంపాదకులు / సహసంపాదకులుగా (38)

కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణలు (25)

- 2006 : తెలుగు పసిడి, జాతీయ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా పరిశోధనా వ్యాస సంపుటి
- 2006 : తెలుగు భాషోద్యమం–కరదీపిక, కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ
- 2007 : వజ్రభారతి : మొదటి ప్రపంచ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా పరిశోధనా వ్యాస సంపుటి
- 2007 : స్వర్ణయానం, శ్రీ మండలి బుద్ధప్రసాద్ 50వ జన్మదిన ప్రత్యేకం వ్యాస సంకలనం
- 2008 : తెలుగు భాష విశిష్ట ప్రాచీన సంపన్నత – జాతీయసదస్సు పరిశోధనా వ్యాస సంపుటి
- 2010 : తెలుగు మణిదీపాలు : తెలుగు ప్రముఖుల జీవనరేఖల వ్యాస

సంపుటి

- 2011 : కృష్ణాజిల్లా చారిత్రక సర్వస్వం : పరిశోధనా వ్యాస సంపుటి, కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ
- 2011 : తెలుగు వ్యాసమండలి : పరిశోధనా వ్యాస సంపుటి, కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ
- 2012 : తరతరాల తెలుగు సంస్కృతి – తానా సహకారంతో పరిశోధనా వ్యాస సంపుటి
- 2012 : తెలుగు పున్నమి – 2వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా పరిశోధనా వ్యాస సంపుటి
- 2014 : సేవాయానం – ఆంధ్రప్రదేశ్ శాసనసభ తొలి ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్ అభినందన సంచిక
- 2015 : తెలుగు యువత – 8వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా పరిశోధనా వ్యాస సంపుటి
- 2016 : విశ్వనాథ సాహితీ విశ్వరూపం – పరిశోధనా వ్యాస సంపుటి, కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ
- 2016 : కథలు – గాథలు : వ్యాస సంపుటి, విక్టరీ ప్రచురణలు
- 2017 : సినారే సాహిత్య వివేచన : వ్యాస సంపుటి, కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ
- 2019 : పాటల పూజారి వేటూరి సుందరరామమూర్తి – శ్రీ భువనచంద్ర రచన, కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ
- 2019 : మహిళ (ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ సౌజన్యంతో) కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ
- 2019 : ఆంధ్ర రచయిత్రులు – లఘుపరిచయాల కరదీపిక, కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ
- 2019 : 'ప్రపంచతెలుగు' వ్యాస సంపుటి, ప్రపంచ తెలుగు రచయితల సంఘం ప్రచురణ
- 2021 : పసిడి కృష్ణ (వ్యాససంపుటి) కృష్ణాజిల్లా రచయితల సంఘం

ప్రచురణ .

- 2021 : కృష్ణాజిల్లా రచయితల సంఘం స్వర్ణోత్సవ ప్రత్యేక సంచిక
- 2022 : గమనం – గమ్యం : 5వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభల సందర్భంగా వ్యాస సంపుటి
- 2023 : అమృతభారతి : భారత స్వాతంత్ర్య అమృతోత్సవాల సందర్భంగా ప్రచురణ
- 2024 : కృష్ణం వందే జీవనాధారం
- 2024 : "మార్పు" 6వ ప్రపంచ తెలుగు రచయితల మహాసభల వ్యాస సంపుటి.

**అఖిలభారత తెలుగు అకాడెమీ – బెంగుళూరు ప్రచురణ (1)**

- 2022 : నయనానందకారక తారకరాముడు శతజయంతి ప్రత్యేక సంచిక

**కృష్ణాడిస్ట్రిక్ట్ న్యూ మాన్యువల్ కమిటీ ప్రచురణలు (6)**

- 2006 : విజయవాడ డివిజన్
- 2006 : కృష్ణాజిల్లా శాసన స్రవంతి 1వ భాగం
- 2006 : కృష్ణాజిల్లా గ్రామదేవతలు
- 2007 : కృష్ణాజిల్లా శాసనస్రవంతి 2వ భాగం
- 2007 : కృష్ణాజిల్లా బ్రిటిష్ క్రైవసం
- 2007 : బెజవాడ చరిత్ర

**ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి ప్రచురణలు(5)**

- 2016 : కృష్ణాతీరం – కృష్ణాపుష్కరాల సందర్భంగా వెలువరించిన పరిశోధనా వ్యాస సంపుటి
- 2017 : పోలవరం –పట్టిసీమ ఆంధ్రుల ఆకాంక్షలు:: ఆంధ్రకవుల కవితా సంపుటి
- 2018 : పద్యకవితా బ్రహ్మోత్సవాల ప్రత్యేక సంపుటి
- 2018 : దేశభాషలందు తెలుగు లెస్స: పరిశోధనా వ్యాస సంపుటి

- 2019 : జయంతి రామయ్య పంతులుగారి “శాసన పద్య మంజరి”

**గాంధీక్షేత్రం కమిటీ ప్రచురణ (1)**

- 2018 : ఆపద్బాంధవులు వ్యాస సంపుటి

**2. వైజ్ఞానిక రచనలు (5)**

- 1980 : అమలిన శృంగారం మొదటి పుస్తకం, శ్రీమహలక్ష్మీ బుక్ ఎంటర్ ప్రైజెస్ ప్రచురణ
- 1980 : రేపటి గ్రహణం–ప్రపంచ భవిష్యత్తు (లఘుగ్రంథం–శ్రీ మైత్రేయతో కలిసి)
- 1982 : మదము(ఆల్కాహాలిజం) వారధి పక్షపత్రిక అనుబంధ లఘు గ్రంథం
- 1982 : సిగ్గు::వారధి పక్షపత్రిక అనుబంధ లఘు గ్రంథం
- 2014 :Quest:Answers that you want to Question:: Vijayawada Convents and Tutorials Association

**3. కవిత్వం(5)**

- 1985 : నిజం నిజం లయనిజం మాట (ఆల్కహాలిజం పై కూనలమ్మ పదాలు)
- 1988 : “కాంతిస్వప్న” దీర్ఘకవిత, స్పందనసాహితీసమాఖ్య ప్రచురణ
- 2010 : వెలుగు రాగాలు : ఎమెస్కో ప్రచురణలు
- 2017 : ముక్కాలు–1 : తెలుగు, ఆంగ్లం, హిందీ భాషలలో వెలువడిన కవితా సంపుటి
- 2020 : ముక్కాలు–2 తెలుగు, సంస్కృతం, హిందీ, ఆంగ్లం, తమిళం, కన్నడం, మలయాళ భాషలలో అనువాదం.

**4. నవలలు (3)**

- 1991 : సప్తసింధు(ఎమెస్కో ప్రచురణ)
- 2017 : తెలుగు ధీర : చిత్ర మాసపత్రికలో సీరియల్, శ్రీ మధులత ప్రచురణ
- 2017 : చిగురులు వేసిన కలలు–స్వాతి మాసపత్రిక అనుబంధం,

శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ

**5. సాహిత్య విమర్శ (10)**

- 2003 : మాటల ముచ్చట్లు: మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2003 : కొసమెరుపులు: శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2004 : శ్రీ గీతగోవిందం శృంగార వివేక తత్త్వ రచన– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2006 : తెలుగులో 5 మహా నాటకాలు వ్యాఖ్యానంతో: సూర్యా బుక్స్
- 2006 : రామాయణంలో విశేషాలు : సూర్యాబుక్స్
- 2016 : పద్యంలో మనం : శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2017 : పద్యానుభవం : శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2020 : పద్యరాగాలు ఎమెస్కో ప్రచురణ
- 2022 : పూర్ణచంద్రోదయం : పూర్ణచందు రచనలపై 70 మంది ప్రముఖుల విశ్లేషణ
- 2024 : సొంపైన తెలుగు, తెలుగు మాటల పుట్టు పూర్వోత్తరాల విశ్లేషణ

**6. చరిత్ర గ్రంథాలు (9)**

- 2006 : అలనాటి పట్టణాలు శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2006 : బ్రిటిష్ యుగం : శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2006 : కాలచక్ర తంత్రం – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2006 : బుద్ధదేవుని కథ – సూర్యా బుక్స్
- 2007 : సభాపర్వం : శ్రీ మధులత పబ్లికేషన్స్
- 2009 : గుండె తలుపులు తడుతున్న తెలుగు భాషోద్యమం (లఘు పరిచయ గంథం)
- 2013 : కృష్ణాతీరం–మరోచూపు :: ఆం. ప్ర. హిస్టరీ కాంగ్రెస్ ప్రచురణ
- 2015 : భారతీయ సభా మర్యాదలు : శీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2025 : భువనవిజయం–రాయలనాటి కథలు–గాథలు– ఆంధ్రప్రదేశ్

సృజనాత్మకత మరియు సంస్కృతి సమితి ప్రచురణ

### 7. భాషాసంస్కృతులు (7)

- 2008 : తెలుగే ప్రాచీనం: ఆంధ్రప్రదేశ్ అధికార భాషాసంఘం ప్రచురణ
- 2008 : నైలూ నుండి కృష్ణదాకా– ద్రవిడ విశ్వవిద్యాలయం ప్రచురణ
- 2018 : తెలుగు కోసం, ఆంధ్రప్రదేశ్ సృజనాత్మకత సంస్కృతీ సమితి ప్రచురణ
- 2018 : తెలుగులో అతిథి పదాలు శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2019 : మాతృభాష – మహాత్ముడి బాట శ్రీ మధులత పబ్లికేషన్స్
- 2023 : తాంబూలం : ఆరోగ్యం ఆనందం, మరో 100 విశేషాలు: (పరిశోధనా గ్రంథం) జాగృతి వారపత్రిక సీరియల్
- 2024 : సొంపైన తెలుగు : తెలుగు నుడుల సంచికట్టు

### 8. జీవిత చరిత్రలు (8)

- 1986 : తెన్నేటి సూరి సాహితీ మహోదయం–శ్రీ మైత్రేయతో కలిసి, సుధ పబ్లికేషన్స్ ప్రచురణ
- 1992 : శ్రీ ముక్కామల నాగభూషణం జీవితము–రచనలు : కృష్ణాజిల్లా రచయితల సంఘం ప్రచురణ
- 2000 : దీనజనబాంధవుడు–శ్రీ వేముల కూర్మయ్య జీవిత చరిత్ర శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2015 : స్మృతి గీత–శ్రీమతి గుత్తికొండ రామరత్నం జీవితం, గుత్తికొండరామరత్నం చారిటబుల్ ట్రస్ట్ ప్రచురణ
- 2016 : గమనం–శ్రీ గుత్తికొండ సుబ్బారావు జీవిత చరిత్ర – గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్ ప్రచురణ
- 2020 : హరహరమహాదేవ (శ్రీ అప్పయ్య దీక్షితుల జీవితచరిత్ర)– శ్రీ రాఘవేంద్ర ప్రచురణలు
- పరువు : గుత్తికొండ సుబ్బారావు + నేను @ 50 – గుత్తికొండ రామరత్నం చారిటబుల్ ట్రస్ట్ ప్రచురణ
- 2024 : శస్త్ర మహాస్త్ర శాస్త్రార్జునుడు–మిసైల్ మ్యాన్ సతీష్ రెడ్డి (రక్షణ

శాస్త్రజ్ఞుడు డా॥ గుండ్రా సతీష్ రెడ్డి విజయగాథావాహిని)

## 9. వైద్య గ్రంథాలు (24)

- 1986 : ఏమిటా రహస్యం? ప్రశ్నలు–సమాధానాలు, కీర్తి పబ్లికేషన్స్ ప్రచురణ
- 1986 : సెక్సులో అనాచారాలు– కీర్తి పబ్లికేషన్స్ ప్రచురణ
- 1986 : షుగర్ వ్యాధి చికిత్స : కీర్తి పబ్లికేషన్స్ ప్రచురణ
- 1996 : క్విక్ రెమెడీస్ : శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 1996 : దీర్ఘాయుష్మాన్ భవ – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 1997 : మీ వ్యాధులకు మీరే వ్యాధులు– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 1998 : చిరంజీవ ! చిరంజీవ ! సుఖీభవ ! సుఖీభవ ! శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 1999 : ఆరోగ్యామృతం – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2000 : ఆరోగ్య భగవద్గీత – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2000 : బి.పి వ్యాధి సులభ నివారణ : శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2001 : షుగరు వ్యాధి సులభ నివారణ – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2002 : జీర్ణకోశ వ్యాధులు సులభ నివారణ – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2002 : ఆడవారికోసం ఆయుర్వేదం – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2003 : ఆయుర్వేదంలో చమత్కారాలు శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2004 : ఆయుర్వేదంలో సులభ చికిత్సలు – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2009 : ఆయుర్వేదంలో వేగచికిత్సలు– పాపులర్ షూమార్ట్ వారి ప్రచురణ
- 2010 : కీళ్ళ వ్యాధులు సులభ నివారణ – (శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2010 : ఆరోగ్య రహస్యాలు– శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2010 : ఎలర్జీ వ్యాధులు–సులభ నివారణ– శ్రీ మధులత పబ్లికేషన్స్

ప్రచురణ

- 2013 : చిటికలో చికిత్సలు : శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2014 : షుగరు వ్యాధి సులభ చికిత్సలు శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2017 : నిండు యవ్వనం – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2020 : నవకరోనా నిజాలు శ్రీ రాఘవేంద్ర పబ్లికేషన్స్
- 2020 : కరోనా సంహారం: శాంతా వసంతా ఛారిటబుల్ ట్రస్ట్, హైదరాబాద్ ప్రచురణ

**10. ఆహార చరిత్ర – ఆరోగ్యప్రభావం (19)**

- 1993 : తల్లి వైద్యం – శ్రీమహాలక్ష్మి బుక్ ఎంటర్‌ప్రైజెస్
- 1996 : వంటిల్లే వైద్యశాల – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2003 : భోజన భోగం – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2003 : అలనాటి ఆహారాలు – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2003 : ఆరు రుచులతో ఆరోగ్యం – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2003 : ఆయుర్వేదంలో పథ్యాలు – అపథ్యాలు – శీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2010 : తరతరాల తెలుగు రుచులు – ఎమెస్కో ప్రచురణ
- 2012 : మన ఆహారం – తెలుగు విశ్వవిద్యాలయం ప్రచురణ
- 2014 : ఆహారవేదం – శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2017 : ఆహారం–ఆరోగ్యం–సందేహాలు, సమాధానాలు శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2017 : ఆరోగ్యం కోసం ఆహారం : శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ .
- 2020 : ఆహారోపనిషత్తు 1వ భాగం : జీర్ణక్రియలు, జీవనక్రియలు
- 2020 : ఆహారోపనిషత్తు 2వభాగం (మన ఆహారం–ఆరోగ్యప్రభావం)
- 2020 : ఆహారోపనిషత్తు 3వ భాగం : ఆహార ద్రవ్యాలు–పోషక విలువలు
- 2020 : ఆహారోపనిషత్తు 4వ భాగం : తిళ్లు వత్తిళ్లు
- 2020 : ఆహారోపనిషత్తు 5వ భాగం : ఆహార వైద్యం
- 2024 : నలచక్రవర్తి పాకదర్పణం : గంగరాజు అరుణాదేవితో కలిసి:

ఆంధ్రజ్యోతి దినపత్రిక శనివారం నవ్యలో ధారావాహిక

- 2024 : క్షేమశర్మ క్షేమకుతూహలం : గంగరాజు అరుణాదేవితోకలిసి ఆంధ్రజ్యోతి దినపత్రిక శనివారం నవ్యలో ధారావాహిక
- 2025 : తినరా ! మైమరచి : ఆదివారం ఆంధ్రజ్యోతి దినపత్రికలో ధారావాహిక

**11. సామాజిక రచనలు (10)**

- 1997 : లయనిజం విధి-విధానాలు - లయన్స్ క్లబ్ ఆఫ్ విజయవాడ మెగాసిటీ ప్రచురణ
- 1998 : ది ప్రెసిడెంట్ - లయన్స్ డిస్ట్రిక్ట్ 324సి4 ప్రచురణ
- 2000 : ది సెక్రటరీ - లయన్స్ డిస్ట్రిక్ట్ 324సి4 ప్రచురణ
- 2001 : ది ట్రెజరర్ - లయన్స్ డిస్ట్రిక్ట్ 324సి4 ప్రచురణ
- 2003 : అంతరంగం - లయన్స్ డిస్ట్రిక్ట్ 324సి4 ప్రచురణ
- 2004 : సేవాతరంగం - లయన్స్ డిస్ట్రిక్ట్ 324సి4 ప్రచురణ
- 2006 : పేరులోనే పెన్నిధి - శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2006 : సభాపర్వం - శ్రీ మధులత పబ్లికేషన్స్ ప్రచురణ
- 2009 : సేవా సామ్రాజ్యం - ఇమ్మిడిశెట్టి అక్కేశ్వరరావు ఛారిటబుల్ ట్రస్టు ప్రచురణ
- 2012 : జస్టిస్ శ్రీకృష్ణ కమిటీ నివేదిక ఏం చెప్పింది? ఎందుకు చెప్పింది? విక్టరీ పబ్లికేషన్స్ ప్రచురణ

**12. ఇతర భాషలలోకి అనువాదిత రచనలు (4)**

- 2006 : సులభచికిత్స పరిహారగళు (కన్నడ) అను : శ్రీ ఎం.ఎల్ రాఘవేంద్ర రావు
- 2008 : ఆయుర్వేద చమత్కారగళు (కన్నడ) అను : శ్రీ ఎం. ఎల్ రాఘవేంద్ర రావు
- 2008 : తెలుగు హీ ప్రాచీన్ హై (హిందీ) అను : డా॥ వెన్నా వల్లభరావు
- 2017 : Telugu Language and its antiquity : Trans : Dr. Turlapati Rajeswari, Sri N.S. Murty ❑